# విషయసూచిక

# ఉపోద్ఘాతము

శివాజీ భారతదేశంలో జాతీయస్థాయికి చెందిన ప్రసిద్ధవ్యక్తులలో ఒకరు. విశ్వాసం, ఆచరణ శుద్ధిగల వ్యక్తిగా, ఈ అసాధారణ రాజనీతిజ్ఞుడు, యుద్ధతంత్రజ్ఞుడు ఒక జాతిని సృజించి, ప్రజలలో సమరోత్సాహాన్ని, త్యాగాన్నీ ప్రేరేపించగల ఒక లక్ష్యాన్ని రూపొందించడంతో బాటు సహనశీలం, ధర్మబుద్ధి నింపుకొన్న ఒక రాజ్యాన్ని, ఒక నిజమైన లౌకిక శ్రేయోరాజ్యాన్ని స్థాపించాడు.

అంతేకాదు, మొఘల్ సామ్రాజ్యపు సామంత రాజ్యమైన బీజాపూర్‌కు చెందిన ఒక భూస్వామ్య ప్రభువు కుమారుడైన ఈయన అర్థ శతాబ్ది కాలంపాటు సాగిన సంగ్రహ జీవితంలో, మొఘల్ రాజ్యాన్ని ఎదిరించి ఒక విశాల రాజ్యానికి 'హైందవస్వరాజ్యం' గా పేరొందిన భూమి పుత్రుల రాజ్యానికి రూపకల్పన చేయగలడని ఎవరు విశ్వసించగలరు?

సైనికుడుగా, వీరుడుగా, సేనానాయకుడుగా శివాజీ తన సైన్యాన్ని ఒక నిజమైన జాతీయ సైన్యంగా తీర్చిదిద్దాడు. పొల్లులేని క్రమశిక్షణ, శీఘ్రంగా సాగే కదలికలు, చక్కని గూఢచారి బృందం, ఆత్మరక్షణ పట్ల విరామం లేని శ్రద్ధ ఆయన సైన్య వ్యవస్థ లక్షణాలు. ఈ వ్యవస్థ శత్రువులను పదేపదే నిర్జించడానికి ఆయనకు తోడ్పడింది. సముద్రతీర రక్షణను కూడా ఆయన అలక్ష్యం చేయలేదు. భారత 'నౌకాదళపిత' అని పిలువదగిన వాడాయన.

మాతృభూమి రక్షణకై ఆయన పోరాడాడు. అసహనం, అన్యాయం, జాత్యహంకారాలను క్రియాత్మకంగా వ్యతిరేకించాడు. రాజపుత్రులు, బుందేల్‌లు, ఇత్యాదులు ఆయన చూపిన మార్గాన్ని అనుసరించునట్లు ప్రేరేపించబడ్డారు ఆయన కార్యకలాపాలు కాలక్రమేణా, అఖిల భారత ఉద్యమరూపం దాల్చి, భారతదేశపు రాజకీయ పటాన్ని మార్చగల పోరాటస్థాయిని అందుకొన్నాయి. అపజయం కల్గినప్పుడు ధైర్యం కోల్పోక, విజయం లభించినప్పుడు ఔదార్యాన్ని చూపిన ప్రగాఢమత విశ్వాసాలుగల ఈ వ్యక్తి స్త్రీజాతి గౌరవాన్ని సంరక్షిస్తూ సర్వమత సహనాన్ని వాక్కాయకర్మలలో పాటించాడు. శివాజీ మూర్తిమత్వం, సందేశం గతంలో వలెనే నేడుకూడా సమాదరణీయమైనది.

సేతుమాధవరావు. ఎస్. పగడి

# 1
# తొలి సంవత్సరాలు

అది ఫిబ్రవరి నెల. సంవత్సరం 1630. అక్బరు చక్రవర్తి నేతృత్వంలో మొఘల్ సామ్రాజ్యం క్రమంగా విస్తరింపసాగింది. దక్షిణాపథంలో కాలు మోపి ఖాందేష్, విదర్భలను నైజాం షాహి రాజధాని అహ్మద్ నగర్‌ను ఆక్రమించింది.

అక్బర్ 1605లో మరణించిన తరువాత భోగలాలసుడైన జహంగీర్ పాలన క్రింద సేనానులలో ఉద్యోగులలో అంతఃకలహాలు, అవినీతి నానాటికీ పెచ్చుపెరుగుతూ వచ్చాయి. కాగా మొఘల్‌లు అహ్మద్‌నగర్ రాజ్యం అబిసీనియా జాతి మంత్రి మాలిక్ అంబర్ సైనిక ప్రతిభకు వ్యతిరేకంగా దాదాపు ఎట్టి పురోగతిని సాధింపలేక పోయారు. మాలిక్ అంబర్ తేలిక పాటి మరాఠా అశ్విక దళాన్ని, కాల్బలాన్ని పూర్తిగా వినియోగించి గెరిల్లా ఎత్తుగడలను అవలంబించి సుమారు పావుశతాబ్ది కాలం మొఘల్‌లతో పోరాడాడు.

మాలిక్ అంబర్ 1626 మే లో గతించిన తరువాత యువరాజు ఖుర్రం షాజహాన్ మొఘల్ సింహాసనాన్ని అధిష్ఠింపగా మొఘల్‌లను పట్టి పీడిస్తున్న నిర్వ్యాపార మంత్ర ప్రభావం సడలింది. నైజాంషాహి రాజ్యంతో కలసి 1628 లో మొఘల్‌లను వ్యతిరేకించిన బీరారు ప్రాంత ప్రభువర్గీయుడు మరాఠా నాయకుడు అయిన లఖూజీ జాధవరావ్ మరుసటి సంవత్సరమే రాజాస్థానంలో కుట్రలకు బలియై బంధువులతో సహా హతమయినాడు ఆయన జామత, 1624 అక్టోబర్ నాటి భటవాడీ యుద్ధంలో మాలిక్ అంబర్ నాయకత్వంలో పోరాడి లబ్ధప్రతిష్ఠుడైన తేజస్వి యువ నాయకుడు షాజీ భోస్లే ఈ పిరికితనపు క్రూర చర్యలను నైజాంషాహి వంశం పట్ల విశ్వాసాన్ని కోల్పోయినాడు. కోపంతో వదలుకొన్న బీజాపూరు కొలువులో ఆయన తిరిగి చేరలేక పోయినాడు. పూనాలో ఆయన జాగీరుపై బీజాపూరు సేనలు దాడి చేసినవి. ఇంతలో అహ్మద్‌నగర్ రాజ్యంలోగల జున్నార్ సమీపంలోని శివనేరి కోటకు. దాని రక్షణాధిపతి విశ్వాసరావు కుమార్తెతో తన పెద్ద కుమారుడు శంభాజీ వివాహ సంబంధంగా [illegible]. అప్పుడు గర్భవతియైన తన భార్య జిజాబాయిని శివనేరిలో [illegible]

సైనిక దళమును వ్యవస్థీకరించుటకు, తన జాగీరు సంరక్షణను పర్యవేక్షించుటకు మొఘలులతో పొత్తుకలుపుటకు గల అవకాశాలను పరిశీలించుటకు ఆయన పోవలసి వచ్చింది.

అహ్మద్ నగరపు నైజాం షాహి రాజవంశాన్ని తుదముట్టింప వలెనని షాజహాన్ నిశ్చయించాడు. అవినీతిపరుడైన దక్కన్‌లోని మొఘల్ గవర్నర్ ఖాన్‌జహాన్‌లోడీ లంచానికి పాల్పడి మొఘల్ ఆధీన ప్రాంతాలను అహ్మద్ నగర్ పాలకుల స్వాధీనం చేశాడు. షాజహాన్ అతనిని మాళ్వాకు బదిలీ చేసి, నైజాంషాను ఒత్తిడిపెట్టి బాల ఘాట్ ప్రాంతపు[1] మహల్‌లను తిరిగి యిచ్చి వేయునట్లుగా చేసాడు. ఆగ్రాకు రమ్మని ఆజ్ఞ అందుకొన్న ఖాన్‌జహాన్ శిక్షాభీతితో 1629 నవంబర్‌లో దౌలతాబాద్‌లో ఉన్న నైజాంషాతో చేరుటకు దక్కనుకు పారిపోయాడు. ఖాన్‌జహాన్ స్థానంలో దక్కన్ గవర్నర్‌గా మహబత్ ఖాన్ ను 1628 ఏప్రిల్ 24 న షాజహాన్ నియమించగా మహబత్ ఖాన్ కుమారుడు ఖాన్‌జమాన్ దక్కన్‌లో తండ్రి ప్రతినిధిగా 1629 మార్చి వరకు వ్యవహరించాడు. తరువాత అతని స్థానే 'అజమ్‌ఖాన్' అను నామాంతరం తర్వాత పొందిన ఇరాదత్ ఖాన్‌కు గవర్నర్ పదవి కొత్తగా లభించింది.

ఖాన్‌జహాన్ నైజాంషాను ఆశ్రయించడం మొఘల్ ప్రతిష్ఠకు పెద్ద దెబ్బ. ద్విగుణీకృతమైన సంకల్పబలంతో షాజహాన్ దక్కన్‌కు ససైన్యంగా వెళ్ళాలని ఖాన్‌జహాన్‌ను శిక్షించాలని, నైజాంషాహి రాజ్యాన్ని తిరిగి తలయెత్తకుండా అంతం చేయాలని నిర్ణయించాడు.

దక్కన్‌లో కొత్తగా వేగాన్ని పుంచుకుంటున్న మొఘల్ కార్య కలాపాలను ఆ ప్రాంతపు బీజాపూర్ గోల్కొండ సుల్తానులు భయంతో గమనించసాగారు. ఆ దశలో షాజహాన్[1] 1630 ఫిబ్రవరి 11 న ఖాందేష్‌లోని బుర్హాన్‌పూర్‌కు చేరాడు.

ఆరు రోజుల తరువాత, మొఘల్ సామ్రాజ్యానికి అత్యంత శక్తిమంతమైన సవాలుగా నిలిచిన శివాజీ నైజాంషాహి తాలూకు శివనేరి కోటలో 1630 ఫిబ్రవరి 19వ తేదీన ప్రభవించాడు. గొప్ప పండితుడు, శివాజీకి సన్నిహిత సహచరుడు అయిన పరమానంద్ శివాజీ స్వయంగా అతనికి ఇచ్చిన ఆదేశాల ప్రకారమే 'శివభారత్'[2] అను పద్యకావ్యాన్ని రచించాడు. ఆ పద్యకావ్యం భోస్లే, మాలోజీ, షాజీ, శివాజీల జీవితాలలోని సంఘటనలను వర్ణిస్తుంది. ఈ సమకాలీన ఆధారంలోనే కాక 'జేధే

---

[1] అబ్దుల్ హమీద్ లాహోరీ : బాద్‌షానామా.

[2] పరమానంద్:- శివభారత్, ఒక సంస్కృత పద్య కావ్యం.

శాకావళి' (జేధే వంశ చరిత్ర)లోను, రాజస్థాన్‌లో దొరికిన జాతకంలో కూడా శివాజీ జన్మదినం 1630 ఫిబ్రవరి 19 గా పేర్కొన్నారు. వాటి తర్వాత కాలం నాటిదైన చిట్నీస్ చరిత్రలో ఉదాహరించగా, ఇంతకు ముందు అంగీకారాన్ని పొందిన 1627 వ సంవత్సరం ఈనాడు విశ్వసనీయం కాదు.

శివాజీ శివనేర్ కోటలో జన్మించిన పిదప అనతికాలంలో బీజాపూర్ సైన్యాలు షాజీకి చెందిన పూనా జాగీర్లపై దాడిచేసి, వాటిని ధ్వంసం చేశాయి. ఆ సమయంలో సొంత వనరులను సమీకరించుకోవటంలో నిమగ్నుడైన షాజీ శివనేర్‌లోలేడు . ఆయన చేసిన ప్రయత్నాలేవీ పూనాకు చేటు వాటిల్లకుండా కాపాడలేకపోయాయి. ఎనిమిది సంవత్సరాలపాటు అది జనశూన్యమైనది. షాజీ 1630 నవంబర్‌లో మొఘల్‌ల కొలువు చేయాలని నిశ్చయించాడు. దక్కన్ గవర్నర్ అజమ్‌ఖాన్ ఆధిపత్యంలోని మొఘల్ సైన్యాలు రణరంగంలో నెగ్గి నైజాంషాహి భూభాగాలను వశపరచుకొనసాగాయి. ఆ మొఘల్ దండయాత్రలో షాజీ చురుకుగా పాల్గొన్నాడు. షాజహాన్ ఆయనకు 'మన్సబ్‌గిరి' (సైన్యాధికారి హోదాతో) బాటు నైజాంషాహీకి చెందిన సంగంనేర్, జున్నార్ భూభాగాలను ప్రదానం చేశాడు. ఆయన 1631 మార్చిలో నాసిక్‌లో సైన్యాధికారిగా నియమితుడయ్యాడు. ప్రస్తుతపు నాసిక్ అహ్మద్‌నగర్ జిల్లాలలో ఆయన మిత్రులకు, సహచరులకు వివిధ పదవులు లభించాయి.

అయితే ఎంతోకాలం జరుగలేదు. కొన్ని కారణాల వల్ల షాజీ 1632 లో మొఘల్‌ల నుంచి విడిపోయాడు. పశ్చిమ తీరాన గల చౌల్ నుంచి తూర్పున ఉన్న శ్రీగొండ మధ్య విస్తరించిన అహ్మద్ నగర్ రాజ్యపు దక్షిణ భూభాగాన్ని ఆయన ఆక్రమించాడు. ఉత్తర భారతానికి చెందిన మొఘల్ దురాక్రమణదార్లకు వ్యతిరేకంగా చేసే పోరాటంలో తనకు నైతిక, భౌతిక సహాయం ఇవ్వమని బీజాపూర్‌ను కోరాడు. మాలిక్ అంబర్ సంప్రదాయాన్ని అనుసరించి ఒక నైజాంషాహి వంశజుని రాజుగా ప్రతిష్ఠించి, తాను రాజప్రతినిధి పాత్రను నిర్వహింపసాగాడు. అయితే 1633 జూన్‌లో నైజాం షాహిల రాజధాని అయిన దౌలతాబాద్‌ను మొఘల్‌లు ఆక్రమించటం నిరోధించలేకపోయాడు. తన స్థావరాలైన నాసిక్, జున్నార్, కొంకణ్‌ల నుంచి షాజీ మొఘల్‌లకు వ్యతిరేకంగా నిర్విరామమైన పోరాటం సలిపాడు. మొఘల్‌లను ఎదిరించి ఆయన కొనసాగిస్తున్న యుద్ధాన్ని బీజాపూర్ ప్రశంసాపూర్వకంగా గమనించింది. బీజాపూర్ సరిహద్దుల్లో మొఘల్‌లు పొంచి ఉండటం బీజాపూర్ వారికి ఊరడింపు కలిగించలేదు.

కానీ చిక్కులు కల్పించగల నైజాం షాహి రాజ్యాన్ని అంతం చేయడానికి షాజ

హాన్ నిశ్చయించాడు. ఒక వంక తీవ్రమైన దాడులు చేసే సాహస విధానం ద్వారా బీజాపూర్‌కు ప్రమాదం కల్పించి, మరొక వంక నైజాంషాకు పూనా, కళ్యాణ్, భివాండీ జిల్లాలను ఇవ్వజూపి షాజహాన్ అదిల్‌షాను షాజీ నుంచి విడదీశాడు.

ఆ పోరాటం 1636 లో అంతమైనది. బీజాపూర్ సుల్తాన్ మహ్మద్ అదిల్‌షా సేవలో చేరదలచిన షాజీ నాసిక్, సంగమనేర్, జున్నార్, కొంకణ్‌లలోని తన భూభాగాలను మొఘల్‌ల స్వాధీనం చేశాడు. పూనా జాగీర్లు ఆయనకు తిరిగి దక్కేవి. దండయాత్రలో పాల్గొనుటకు, షాజీ దక్షిణాదికి వెళ్లవలసి వచ్చింది. బెంగుళూర్ 1637 చివరి మాసాంతంలోనో లేక 1638 తొలి మాసాలలోనో బీజాపూర్ స్వాధీనం కాగా, దానిని షాజీకి మొఖాసాగా ఇచ్చారు. మొఘల్‌లతో షాజీ పోరాటం ముగిసే నాటికి శివాజీ సప్తవర్ష ప్రాయుడయాడు. దక్కన్ రాజ్యాలైన బీజాపూర్, గోల్కొండలతో శివాజీకి గల అతిసాన్నిహిత్యం దక్కన్ పై మొఘల్ దండయాత్రలు కలిగించిన చేదు అనుభవాల సహజ పరిణామమే.

అంతలో షాజీ బెంగుళూరు మొఖాసాలో స్థిరనివాసం ఏర్పరచుకోవాలని నిశ్చయించాడు. షాజీ భార్య జిజాబాయికి ఆరుగురు సంతానం కల్గినప్పటికి ఇద్దరు మాత్రమే జీవించారు. జ్యేష్ఠుడు శంభాజీ తండ్రితో బెంగుళూరు లోనే ఉండిపోయాడు. షాజీ రెండవ భార్య తుకాబాయి, ఆమె కుమారుడు తర్వాత తంజావూరు రాజ్య స్థాపకుడైన వెంకోజీకూడా బెంగుళూరులో నివసించారు.

జిజాబాయి, ఆమె కుమారులలో కనిష్ఠుడు శివాజీ. శివాజీకి పన్నెండేళ్ల వయస్సు వచ్చేవరకు షాజీతో కలసి బెంగుళూరులో ఉన్నారు. అప్పుడు జిజాబాయి శివాజీతో పూనా వెళ్లి అక్కడ జాగీర్లను నిర్వహించాలని నిశ్చయించారు. జిజాబాయి షాజీల మధ్య మనస్పర్థలకు సంబంధించిన కథలన్నీ ఊహాజనితాలు, ఆధార రహితాలు. అదిప్రధానంగా ఆచరణ యోగ్యమయిన సాదా ఏర్పాటు.

శివాజీ 1641-42 సంవత్సరాలలోని అస్పష్టకాలంలో పన్నెండవ ఏట పూనా చేరాడు. షాజీకి విశ్వాసపాత్రులైన కొందరు ఉద్యోగుల బృందం అతని వెంట వచ్చింది.

శివాజీకి అప్పగించిన జాగీరు ప్రస్తుతపు పూనా జిల్లాలో అధిక భాగము. అతని తల్లి జిజాబాయి అసాధారణ శీలం, సంకల్పబలం గల స్త్రీ. ఆమెతో అతనికి గాఢ అనుబంధం కలదు. తల్లి మార్గదర్శకత్వంలో శివాజీ దృఢ విశ్వాసాలు, స్వీయ మత సంస్కృతుల పట్ల భక్తిభావమూ కలిగిన వ్యక్తిగా పెరిగాడు. అతని తల్లి ప్రేమపూరితమైన, అప్రమత్తమైన పెంపకంలో స్వదేశపు ఘన వారసత్వం పట్ల గర్వం, గాఢమైన మతానురక్తి, విశాల సహనబుద్ధి అతనిలో దినదినాభివృద్ధి చెందాయి.

ఆ జాగీరు పెద్దది కాకపోయినా కీలక ప్రదేశంలో ఉండేది. ఉత్తరాన ఖాందేష్ నుంచి దక్షిణాన గోవా హద్దుల వరకు వ్యాపించిన సహ్యాద్రి పర్వత శ్రేణులు పశ్చిమ కనుమలనుంచి కొంకణ్ ప్రాంతాన్ని విడదీస్తాయి. ఆ కొండలు కొన్ని చోట్ల సముద్ర మట్టం కంటె 1,218 మీటర్ల ఎత్తున ఉండి భూభాగానికి మేలైన రక్షణ కల్పిస్తుంటా యి. పశ్చిమం నుంచి పూర్వదిశకు వ్యాపించిన ఆ శ్రేణులనుంచి వెలువడిన చిన్న శాఖలు సాహసవంతులు, దృఢకాయులు అయిన ప్రజలకు తగుపాటి భూవసతి కలి గించి వారికి స్వేచ్ఛా ప్రియత్వం, ఆత్మవిశ్వాసం తెచ్చి పెట్టాయి. ఆయా గ్రామా లలో ప్రవహించే చిన్న నదుల తోడ్పాటుతో రైతులు ఉత్తరాన జున్నార్, దక్షిణాన మహాబలేశ్వర్ మధ్యగల భూములను సాగుచేయగలిగారు. 'ఖోరులు' అను ప్రసిద్ధ నామం కల ఆ లోయలను వాటి మధ్య పారుతుండే చిన్న వాగుల పేరుతో తరుచు పిలుస్తుండేవారు. అవి పశ్చిమ ప్రాంతాన (మవాల్తి సూర్యుడు అస్తమించు దిశ) ఉన్నవి గనుక, ఆ భూభాగానికి 'మావళు' లని, అక్కడి దృఢకాయులకు 'మావళీ లని' సమష్టి నామములుండేవి. ప్రతి లోయలోని గర్వించదగిన ఎత్తుగల పర్వత శిఖ రాగ్రాన నిలచిన దుర్గం ప్రజలకు మంచి రక్షణ కల్పిస్తుంది.

అనేక వర్గాలుగా ఏర్పడిన మరాఠాలు పురాతన కాలంనుంచి వంశ పారంపర్యంగా వ్యవసాయదారులుగా, పన్నుల గణకులుగా స్థిరపడ్డారు. వారు గ్రామస్థాయిలో 'పటేల్' లుగా 'కులకర్ణీలు'గా గ్రామ సముదాయాల స్థాయిలో 'దేశ్‌ముఖ్‌లు'గా 'దేశ్‌పాం డేలు'గా వ్యవహరించేవారు. దక్కన్‌లోని బహమనీ సుల్తానులను. వారి ఉత్తరాధికార రాజ్యాలను భూమి పాలనా నిర్వహణతో మరాఠాలు సేవించేవారు. వారి సేవలు జీతభత్యాలు 'వతన్‌లు' అని రొక్కం చెల్లింపుల. కౌలుజేసే భూముల చిన్న మాన్యాల రూపంలో ఉండేవి. ఈ 'వతన్ దార్ల'ను మామూలు ప్రభుత్వోద్యోగులుగా పరిగణించ రాదు. పైపెచ్చు స్థిరమైన వ్యవసాయం కొరకు ప్రశాంత భూవ్యవహార పరిష్కారం కొరకు ముఖ్యమైన మొఖాసాదార్లుగా వృద్ధిచెందిన కొందరు వతందార్లను మిక్కిలి గౌరవించి, వారి కార్యకలాపాలతో సాధారణంగా చేసికొనేవారు కారు.

సుస్థిర ప్రభుత్వంలో వారు విశ్వాసపూరితమైన పాత్రను నిర్విహించేవారు. కాని ఒత్తిడి పరిస్థితులలో ప్రభుత్వం పట్ల వారి విశ్వాసం సన్నగిల్లినప్పటికి వారి 'వతన్' పట్ల అనుబంధం పటిష్టంగా నిలిచేది. వతన్‌దార్లు, మొఖాసాదార్లు, ప్రజల స్వప్రయో జనాల దృష్ట్యా రాజకీయ నిర్మాణంలో యథాస్థితిని వాంఛించేవారు.

మరాఠాల ప్రవర్ధమాన పాత్ర

తూర్పున గోండు రాజుల, బగ్లానాలో రాజపుత్ర పాలకుల, పశ్చిమాన కోలీ ప్రభువుల స్వాధీనంలోని కొన్ని ప్రాంతాలు మినహా, దాదాపు ప్రస్తుతపు మహారాష్ట్రాన్ని అంతటినీ తమ ఏలుబడి క్రిందికి తెచ్చుకోవటంలో తురుష్క-అఫ్ఘన్ వంశజులైన బహమనీలు సఫలీకృతులైనారు. మరాఠాలు వతన్‌దార్లుగా లేక దుర్గ రక్షణ కాల్బలంగా, కొన్ని సందర్భాలలో భూస్వామ్య దళనాయకులుగా సామాన్య పాత్రలను నిర్వహించేవారు.

పదునారవ శతాబ్ది తొలి సంవత్సరాలలో బహమనీ రాజ్యం శిథిలమై దక్కన్ చిన్న స్వతంత్ర రాజ్యాలుగా పంపిణీ అయినందున పరిస్థితి కొంతవరకు మరాఠాలకు అనుకూలంగా మారింది.

దక్కన్ రాజ్యాలతో ప్రతిదీ చిన్న ప్రాంతానికి పరిమితం కాగా, పెద్ద కక్షలకు లభ్యం కాగల అర్థబలం అంగబలం వాటికి ఉండవనడం సువిదితమే. అవి పరస్పరం కలహించుకుంటూ వుండేవి. విజయనగరం వంటి పెద్ద రాజ్యాలకు వ్యతిరేకంగా స్వల్పకాలంపాటు ఏకమైనా, గోవాలో ఉత్తర కొంకణ్‌లో పాతుకుపోయిన పోర్చుగీసువారికి వ్యతిరేకంగా గణనీయమైన పురోగతి సాధించలేక పోయినవి.

బహమనీల కాలం నుంచి పర్షియా, అరబ్, ఆఫ్రికా తీరప్రాంతాల ప్రజలు దక్కన్‌కు ఎడతెగకుండా తరలివస్తుండేవారు. తురుష్కులు, పర్షియన్లు, అరబ్బులు, ఆఫ్రికన్లు (సిద్ధీలు) ఆ ప్రదేశంలో శిష్ట వర్గంగా ఏర్పడ్డాయి. వలసవచ్చిన వారిని 'అఫాఖీలు' అంటుండేవారు. అంటే దిఙ్మండలం నుంచి వలస వచ్చిన వారని అర్థం. వారితో బాటు ఉత్తర భారతం నుంచి వచ్చిన పఠానులు త్వరలోనే గణనీయమైన శక్తిగా రూపొందారు.

పదిహేనవ శతాబ్దిలో చాలా కొద్దిమంది మరాఠాలు బహమనీ సైన్యాధికారులు కాగలిగారు. ముధోలుకు చెందిన ఘోరపడేలు మాత్రం కొంత గణ్యత సంపాదించారు. అహ్మద్‌నగర్ రాజ్యపు నైజాంషాహిల మూలపురుషుడు ఇస్లాంమతాన్ని స్వీకరించిన మారాఠా బ్రాహ్మణుడే. బీరార్‌కు చెందిన ఇమ్మద్‌షాహి వంశ దృష్టాంతం అటువంటిదే. దాని స్థాపకుడైన ఫతేహుల్లా ఆదిలో దక్షిణాది నుంచి యుద్ధ ఖైదీగా తెచ్చిన బ్రాహ్మడే. బీజాపూర్, గోల్కొండ, బీదర్ రాజవంశ స్థాపకులు అందరూ తురుష్కులు.

పదహారవ శతాబ్దిలో మరాఠాల స్థితిగతులు శుభప్రదమైన మార్పు చెందాయి. పౌర పాలనా రంగంలో కొందరు మరాఠాలు అహ్మద్‌నగర్‌లో ప్రత్యేక స్థానాన్ని సంపాదించారు. 'నాయక్ వాడీలు' అను మరాఠా కాల్బలం దుర్గ రక్షణలో నియమితమవు

తుండేది.

అయితే సమకాలీన పర్షియన్ చరిత్రగ్రంథాలలో మరాఠాలను గెరిల్లా తరహా యుద్ధాన్ని సాగించే తేలికపాటి అశ్విక దళంగా పేర్కొన్నారు. ఇరాక్ నుంచి 1580 లో వచ్చిన సయ్యద్ అహ్మద్ తబాతాబాయ్ నవదుర్గం ముట్టడిలో వారిని గమనించి మధ్య ఆసియాకు చెందిన ఉజ్‌బెక్‌లతో వారిని పోల్చినాడు.

మొఘల్‌లు 1596 లో బీరార్‌ను జయించారు. ఖాందేష్ 1601 నాటికి వారి ప్రత్యక్ష పాలన క్రిందకు వచ్చింది. అంతకుమునుపు అహ్మద్‌నగర్ రాజ్యసేవలో నియుక్తమైన అనేక ప్రసిద్ధ మరాఠా కుటుంబాలు ఈ స్థితిలో మొఘల్‌ల అండ మొఖాసాలు, మన్సబ్‌లు (సైన్యాధికారి హోదాలు) పొందాయి. జిజాబాయి పితృ కుటుంబమైన బీరార్ ప్రాంతపు జాధవ్‌లు బీరార్‌లోని మాహుర్‌కు చెందిన ఉదారమ్‌లు మొఘల్‌ల కొలువులో చేరిన ఉన్నతశ్రేణి మరాఠా కుటుంబాలలో మెండు. నైజాం షాహీ భూభాగాలు అంతకంతకు మొఘల్‌ల ఆక్రమణ క్రిందకు వచ్చినకొలదీ మొఘల్‌ల సేనలోని మరాఠా మన్‌సబ్‌దార్ల సంఖ్య పెరుగుతూ వచ్చింది.

మొఘల్‌లను కృతనిశ్చయంతో ఎదిరించిన మాలిక్ అంబర్ ఎందరో మరాఠాలను ఉన్నత పదవులతో నియమించాడు. శివాజీ పితామహుడు మాలోజీ, తండ్రి షాజీ ఆయన నీడలో పేరుప్రతిష్ఠలు గడించారు.

బీజాపూర్‌తో గల చాలా ప్రఖ్యాత మరాఠా కుటుంబాలను ప్రభుత్వ సేవలో నియోగించారు. మథోలుకు చెందిన ఘోర్‌పడెలు, జావాళికి చెందిన మోరేలు, ఫల్టాన్‌కు చెందిన నింబాల్కర్లు, కొల్హాపూర్‌కు చెందిన ఘట్గేలు, కొంకణ్‌కు చెందిన షిర్కేలు ఆ పేరెన్నికగన్న కుటుంబాలలో కొన్ని.

ఇంతమాత్రాన దక్కన్‌లో జన్మించిన వారు, బీజాపూర్‌ని మరాఠాలు లేక గోల్కొండలోని ఆంధ్ర కుటుంబాలు ప్రభుత్వవిధాన నిర్ణయాలను రూపొందించుటలో అమలు చేయటంతో చెప్పుకోదగిన పాత్ర నిర్వహించినట్లు కాదు. బీజాపూర్‌లోని పరిస్థితులను ఈ క్రింది మాటలలో డాక్టర్ సయీమ్ చక్కగా వర్ణించాడు. "బీజాపూర్‌లోని మత ప్రధాన. బహుళజాతి వంశ పారంపర్య పాలనా రాజ్యంగా ఉండేది. అది అఫాకీల (విదేశాల నుంచి వలస వచ్చిన వారి) ప్రాబల్యంగల రాజ్యం. ప్రభు వర్గీయులలో పైతరగతులకు చెందిన అఫాకీలదే కేంద్ర రాష్ట్ర స్థాయిలలోని పరిపాలనలో పైచేయి."

గోల్కొండలోని పరిస్థితులు బీజాపూర్‌లో ఉన్న వాటికంటె భిన్నమైనవి కావు. అక్కడ కూడ చాలా వరకు విదేశాల నుంచి చొరబడి వచ్చిన అఫాకీల పాలన కొన

సాగెది

షాజహాన్ 1635 లో ఉపయుక్తమైన మేరకు అహ్మదనగర్ రాజ్యాన్ని అంత మొందించగా, గొల్కొండ పూర్తిగా మొఘల్‌ల సామంత రాజ్యమైంది

అహ్మదనగర్ రాజ్యాన్ని తుదముట్టించటంలో బీజాపూర్ పాత్రకు గుర్తింపుగా షాజహాన్ దానికి ఒక ముఖ్య రాజ్య హోదాను ఇచ్చేందుకు పూనుకున్నాడు. ఒక నిర్ణీత మైన మొత్తం కప్పంగా చెల్లించినందుకు బదులుగా దాని సరిహద్దులు పదిలంగా ఉంచే ఖరారు జరిగింది. ఉద్గీర్, ఔసా, నాందేడ్ పట్టణాలతో సహా, జున్నార్‌కు దక్షిణం నుంచి పరెండాకు ఉత్తరం నుంచి తూర్పుకు వెళ్లే రేఖను బీజాపూర్‌కు మొఘల్‌లకు సరిహద్దుగా నిర్ణయించినారు. బీజాపూర్‌కు శాశ్వత శాంతి హామీ లభించింది. బీజా పూర్ గోల్కొండల మధ్య తలయెత్తే వివాదములను మొఘల్‌ల మధ్యవర్తిత్వానికి అప్పగించవలసి ఉంటుంది. ఆ రెండు దక్కన్ రాజ్యాలు, దక్షిణాదిన విస్తరణకు అవ కాశమూ, ఉత్తరాన సుస్థిర శాంతి లభించడంతో, దక్షిణ భారత దేశంలో తమ ఆధిక్య మును పెంచుకొన్నారు. గోల్కొండ సముద్రతీరం వెంబడి మద్రాసు వరకు వ్యాప్తి చెందగా, బీజాపూర్ ప్రస్తుతపు కర్ణాటకను కలుపుకొని తమిళనాడులోని తంజావూర్, మధురవరకు విస్తరించింది. మహమ్మద్ ఆదిల్షా పాలనా కాలంలో (1627-1656) బీజాపూర్ విస్తరణ జరిగింది

## తన జాగీరులో శివాజీ

శివాజీ పూనా జిల్లాలోని కొండల లోయల మధ్య పెరిగాడు ఆయన పాలించిన ప్రజలు దృఢకాయులైన పరాక్రమశాలులు. వారికి రాజకీయ చైతన్యం ఉండేది కాదు. ముఖ్యమైన భూస్వాములు, శిస్తు వసూలు పాటదార్లు, చిన్న సామంతులు, బీజాపూర్ పట్ల రాజభక్తి కలిగి ఉండడంలోని రక్షణ, సౌకర్యం కనుగొన్నారు.

గొప్ప సంఘటనలు సాధారణంగా చిన్న స్థాయిలో ఆరంభం నుంచి వృద్ధి చెందు తాయి. దీనికి ఉదాహరణలుగా అమెరికాలో, ఫ్రాన్సులో జరిగిన విప్లవాల ప్రారంభద శలను స్వీకరిస్తే చాలు. పొల్లులేని జాతీయ స్ఫూర్తి దేశమంతటా వ్యాప్తి చెందడా నికి నిగూఢ శక్తిగల స్వచ్ఛమైన స్వదేశీ, స్వతంత్ర సంక్షేమరాజ్యం పునాదులను నిర్మించటమే శివాజీ సాధించిన ఘన విజయాలు. ఉదాసీనులైన ప్రజలలో జాతీయ భావాన్ని మేల్కొలిపి వారి విశ్వాసాన్ని చూరగొన్నాడు. తన శత్రువుల అసహనాన్ని, అహంకారాన్ని, అతిశయాన్ని ఎదుర్కొని ప్రజలు ఇచ్చిన ఆలంబనతోనే ఏ రాజ్య మైనా స్థిరంగా నిలిచి వర్ధిల్లగలదని వారికి నిరూపించాడు.

అయితే ఈ నిరూపణ తర్వాత జరిగింది. ఆరంభ దశలో లక్ష్యశుద్ధిని అసాధా రణ విచక్షణా శక్తిని పెంపొందించుకొంటూ, జాగరూకత, సాహసప్రదర్శనలు శ్లాఘనీ యంగా మేళవించిన స్వభావం సంపుకొన్న యువకుడు క్రమ క్రమంగా ముందంజ వేస్తూ కనబడతాడు.

శివాజీకి కఠిన వాస్తవాలతో తొలి అనుభవం అతని చతుర్దశవర్ష ప్రాయంలోనే కలిగింది అధికార్లకు ప్రభువర్గీయులకు వారి సేవలకు బదులుగా ఇచ్చిన జాగీర్లలో లేక మొఖాసాలలో దుర్గాలను చేర్చలేదు. అవిధేయుడైన ప్రభు వర్గీయుని సార్వభౌ ముడు వాటి సహాయంతో తేలికగా అదుపులోనికి తేగలిగేవాడు. అదే విధంగా సార్వ భౌముడు నిష్కారణంగా ప్రతికూలవైఖరిని అవలంబిస్తే జాగీరుదారునకు తన ప్రయో జనాలు కాపాడుకొనే సాధనాలు ఉండేవి కావు.

అటువంటి సంఘటన ఒకటి జరిగింది. ఏదో కారణం వల్ల షాజీ పట్ల కోపం వచ్చిన మహమ్మద్ ఆదిల్‌షా తన సైన్యాన్ని , షాజీ తాలూకు పూనా జాగీర్లపై దాడివేసి, వాటిని ధ్వంసం చేయమని ఆజ్ఞాపించాడు. కోటలవంటి రక్షణ కేంద్రాలు లేనందున ఆ జాగీర్లు తేలికగా లొంగిపోయి అపార నష్టానికి గురిఅయాయి. అయితే త్వరలోనే శాంతి నెలకొన్నందున షాజీ రాజానుగ్రహపాత్రుడైనాడు. శివాజీ దానినుంచి గుణపాఠం నేర్చుకోకపోలేదు.

శివాజీకి క్రీ.శ. 1645 లో పదునైదేండ్ల వయస్సు ఉన్నప్పుడే రక్షణ ప్రయోజనా లకై కోటలను స్వాధీనం చేసుకొని, కొత్త వాటిని నిర్మించాలనే కోరిక కలిగింది, బీజా పూర్ అధినేతయైన మహమ్మద్ ఆదిల్షా 1646 లో రోగ పీడితుడైనాడు. ఆయన పదేళ్ళ తర్వాత 1656 లో మరణించే వరకు అశక్తుడుగా ఉన్నాడు. ఆయన దీర్ఘకాల వ్యాధి బీజాపూర్ రాజ్యవ్యవహారాలను అంతకంతకు గందరగోళంలో పడవేసింది. అదే కాలంలో షాజీకి చెందిన పూనా ఆస్తినిర్వాహకుడైన దాదోజీ కొండదేవ్ 1647 మార్చి 7 న మరణించాడు. శివాజీ సాహసవంతుడైన యువసేనానాయకుడుగా పరి ణతి చెందటము ప్రశంసాపూర్వకంగా గమనిస్తూనే దుస్సాహస కృత్యాలకు పాల్పడ రాదని దాదోజీ హెచ్చరించాడు. ఆయన మృతి జాగరూకతతో వ్యవహరించే వృద్ధ తరం విధించే నిర్బంధాలను సహజంగానే తొలగించింది.

అనతికాలంలో శివాజీ మొరంబదేవ్ తర్వాత 1670 వరకు 'రాజఘడ్' అను పేరుతో ఆయన రాజధాని, తోరణ దుర్గాలను ఆక్రమించాడు. ఆయితే తర్వాత సింహ గడ్ అను పేరు పెట్టిన కొండనాను సంఘర్షణ లేకుండా స్వాధీనం చేసికోవడం ఆయన సాధించిన ఘనవిజయం.

బీజాపూర్ ఆస్థానం సహజంగానే కలత చెందింది. సగం నాశనమైన కోటల పునరుద్ధరణ వేరు విషయం. సింహగడ్ వంటి దుర్గం ఆక్రమణ నిర్లక్ష్యం చేయతగినది కాదు.

కొండనా ప్రాంతంలో శివాజీ పైకి దండయాత్ర చేయమని అదిల్‌షా తన సేనాని ఫతేఖాన్ ఖుదావంద్‌ఖాన్‌ను ఆజ్ఞాపించాడు. ఈ ప్రమాదాన్ని ఎదుర్కొనడానికి పురందర్లో తన స్థావరాన్ని కాపాడుకొంటూ శివాజీ సన్నాహాలు చేశాడు.

అంతలో గోల్కొండతో, జింజీ దగ్గరలోని శత్రుసైన్యాలతో చేరి కుట్రచేస్తున్న ఆరోపణలపై తన తండ్రిని నిర్బంధించిన వార్త శివాజీకి అశనిపాతంలా తాకింది. ఇది 1648, జూలై 28 నాటి సంఘటన. బెంగుళూరులోని షాజీ జాగీర్లపై దండెత్తారు. శివాజీ జ్యేష్ఠ సోదరుడు శంభాజీ వాటి రక్షణకు కృతనిశ్చయంతో పూనుకున్నాడు.

దాడి చేసిన బీజాపూర్ దళాలలో ఘాట్‌గేల, ఫల్తానుకు చెందిన నింబాల్కర్ల నాయకత్వంలోని మరాఠా సైనిక విభాగాలు కూడా ఉన్నాయి. శివాజీ భార్య సాయిబాయి ఫల్తాన్ వాస్తవ్యురాలైన బాజాజీ నింబాల్కర్ సోదరి అనే సంగతి గమనార్హం. ఫతేఖాన్‌పై శివాజీ యుద్ధాన్నీ, బీజాపూర్ దళాలు ఒక భీకర పోరాటం తరువాత తమ నాయకుడు మూసేఖాన్‌తో సహా మరణించిన వారిని వదలివేసి చెల్లా చెదురుగా పారిపోయిన సైన్యాన్నీ కవి పరమానంద్ తన 'శివభారత్'లో ప్రస్ఫుటముగా వర్ణించాడు. ఆ పద్య కావ్యం నుంచి కన్‌జీ, గోడాజీ భీమాజీవాఘ్, శంభాజీ కాటే, శివాజీ ఇంగ్లే, భికాజీ చోరే, అతని సోదరుడు భైరవ్ వంటి శివాజీతొలి సహచరులను గూర్చి తెలుసుకొనగలము. శివాజీ తన పరివారాన్ని అనేక వర్గాల నుంచి సమకూర్చుకొన్నాడు . కన్హోజీ జేధే పుత్రుడైన బాజీ రణరంగంలో ఖ్యాతినొందగా, బాజీ పసాల్కర్ అను అతి విశ్వసనీయుడైన అనుచరుని మరణంతో గొప్ప నష్టాన్ని పొందాడు.

శివాజీ అదిల్‌షా సైన్యాల దాడిని నిరోధించినప్పటికీ సుల్తాన్ షాజీని ఖైదీగానే ఉంచాడు. చెరసాలనుంచి ఆయనకు విముక్తి కల్గించడం కఠినమైన పనిగా పరిణమించింది. శివాజీ దక్కన్‌లో మొఘల్ గవర్నరైన మురాద్ కుమారునితో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపినట్లు రాకుమారుడు 1649 మార్చి 14 న వ్రాసిన లేఖ నిరూపిస్తున్నది. కాని మొఘల్‌ల ఒత్తిడి వలన షాజీ కారాగారం నుండి విడుదల అయినట్లు దీని అర్థం కాదు. ఆ విడుదల 1649 మే 16 న జరుగగా షాజీ యథా ప్రకారం సుల్తాన్ అనుగ్రహపాత్రుడైనాడు. శివాజీ కొండనా అంటే శింహగడ్‌ను త్యజించటం మూల్యంగా చెల్లింపవలసి వచ్చింది.

## మొఘల్ దౌత్యనీతి

మొఘల్ బీజాపూర్‌తో సమాధాన పడినప్పటికీ, దక్కన్ రాజ్యాలను జయించే అంతిమ లక్ష్యం వారి విదేశాంగ విధానంలో శాశ్వతాంశము బీజాపూర్ ప్రభువర్గీయులకు, అధికారులకు, దుర్బుద్ధులు పుట్టించి వారిని మొఘల్‌ల సేనలలో చేర్పించడం ఎడతెగని కృషిగా సాగింది. మురాద్ రాకుమారుడు శివాజీకి, షాజీకి వ్రాసిన రెండు లేఖల నుంచి తీసిన భాగాలుమొఘల్ దౌత్యనీతిని తేట తెల్లం చేయగలవు. శివాజీకి మురాద్ రాకుమారుడు 1649 ఆగస్టు 14 వ తేదీన వ్రాసిన ఉత్తరం నుంచి గ్రహించిన భాగం ఇలా వుంది. "రాకుమారులమైన మా అపరిమిత అనుగ్రహాలతో ప్రసిద్ధి చెందు అత్యంత కృపతో నీ తండ్రి అపరాధాలపై క్షమాలేఖనిని వినియోగించినట్లు ఆయన భక్తి విశ్వాసాలకు క్షమానుగ్రహాల ద్వారాన్ని తెరచి ఉంచినట్లు తెలుసుకో. నీ తండ్రితో నీ వంశీయులతో కలసి మొఘల్ సార్వభౌముని గడపకు నమస్కరించేందుకు రావలసిన సమయం ఇదే. ఆ ఆనందాన్ని పొందిన తర్వాత పంచ సహస్ర 'జాత్' (వ్యక్తిగత) హోదాతో బాటు పంచ సహస్ర 'సహర్' (అశ్వికదళ) హోదాగల మన్సబ్, ఇతర బహుమానాల ప్రాప్తి ద్వారా నీవు నీ సాటి వారిలో ఘనత వహిస్తావు. నీ తండ్రికి సామ్రాజ్య సేవలో లోగడ గల 'మన్‌సబ్' తిరిగి లభిస్తుంది."

షాజీ, అతని కుమారుడు శంభాజీ ఇతర సహచరులతో కలసి షాజహాన్ నుంచి మన్‌సబ్‌లు, రొక్కపు బహుమతులు, ఉద్యోగాలు, లోగడ 1630 నవంబర్‌లో అందుకున్నారు. పైన ఉదాహరించిన లేఖ సామ్రాజ్యసేవకు తిరిగి రమ్మని వారికి పంపిన ఆహ్వానము. బీజాపూర్ రాజ్యం అంతమయే వరకు దాని అధికారులను ప్రభువర్గీయులను అపమార్గం పట్టించే కృషిని మొఘల్‌లు కొనసాగించారు.

షాజీ విడుదలై తన జాగీర్లకు తిరిగి వచ్చిన పిదప శివాజీ మొఘల్‌లతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపవలసిన సందర్భం కలుగలేదు. తరువాత అయిదు సంవత్సరాల పాటు శివాజీ తన తండ్రి పూనా జాగీర్‌ను సమర్థవంతంగా నిర్వహించాడు. చట్ట రీత్యా అతనిది తండ్రి ప్రతినిధి స్థానం. కాని షాజీ బెంగుళూరులో స్థిర నివాసం ఏర్పరచుకొన్నందుకు అప్పటికే పూనాకు దూరంగా ఉన్నాడు. షాజీ 1655 మే వరకు ఆజ్ఞలను జారీ చేస్తున్నప్పటికీ, తనకు నచ్చని ఉద్యోగులను తొలగించి వారిని బెంగుళూరు పంపడానికి శివాజీకి అధికారాలు లభించాయి. మిగతా ఉద్యోగుల విశ్వాసాన్ని చూరగొని, అవసరమైనప్పుడు తన అనుచర వర్గం నుంచి కొత్తవారిని ఉద్యోగాలలో అతను నియమిస్తుండేవాడు. పూనా, బాకస్, బారామతె, ఇందాపూర్ 1655 నాటికి శివాజీ పూర్తిగా స్వాధీనం చేసికోగలిగాడు. తోరణ, రాజ్‌గడ్, పురందర్ కోటలను

గూడ వశపరచుకొన్నాడు. చివర ఉదాహరించిన దానిని వశపరచుకోవటంలో యుక్తి పన్నవలసి వచ్చింది

శివాజీ జాగీర్ల ఉత్తర సరిహద్దులును, మొఘల్ సామ్రాజ్యం దక్షిణ సరిహద్దులును ఒకటే. ఆ వైపు పురోగమించే సమస్యను గురించి తలపెట్టినవసరంలేదు. అతని తూర్పు సరిహద్దుల చుట్టూ బీజాపూర్ అధీనంలో చక్కని పరిపాన, గట్టి కాపుదల కలిగి బాలాఘాట్, అనే పేరుగల సమున్నత ప్రాంతపు సతారా, సాంగ్లీ, కొల్హాపూర్ జిల్లాలు వ్యాపించాయి.

## కొంకణ్

శివాజీ కొంకణ్ తీరభాగం వైపు తన దృష్టిని మరలించాడు దాని ఉత్తర ప్రాంతం 1632-1636 సంవత్సరాలలో మొఘల్‌లతో పోరాడిన షాజీ హస్తగతమై ఉంది.

కొంకణ్ తీరం సూరత్ సమీపంలోని 483 కి.మీ. పైగా నిడివిగల భూభాగంలో వ్యాపించిఉంది. దాని వెడల్పు 80-95 కి మీ. కు మించదు ఆ తీరం అంచును అసంఖ్యాకమైన సముద్రపు కయ్యలు, నదులు, వాగులు విభజిస్తాయి. సముద్రపు కయ్యలు చాలా చోట్ల పర్వతశ్రేణులను తాకుతుంటాయి. అక్కడ వర్షపాతం బారీగా ఉంటుంది. వార్తా ప్రయాణ సౌకర్యాలు కష్టసాధ్యము. తీర ప్రాంతంలోని కయ్యల్లో బస్సేన్, బొంబాయి, చౌల్, దాభోల్, రాజాపూర్, వెన్‌గుర్‌ల వంటి అనేక చిన్న పెద్ద రేవులు సంగమేశ్వర్, మహాద్, థానా వంటి వ్యాపార కేంద్రాలు గర్వకారణంగా వుంటాయి.

కొంకణ్ రేవుల ద్వారా దేశాంతరాల నుంచి వస్తువులు, అన్యదేశీయులు, రావడం కద్దు. పర్షియన్లు, అరబ్బులు, తురుష్కులు, ఆఫ్రికన్లు గుంపులు గుంపులుగా వచ్చి బహమనీ, బీజాపూర్, గోల్కొండ, అహ్మద్‌నగర్ రాజ్యాలలో స్థిరనివాసం, ఏర్పరచుకొంటుండేవారు. విలువైన వస్తువులు, గొప్ప వెలగల గుఱ్ఱాలు విదేశాల నుంచి దిగుమతి అవుతుండేవి. సహ్యాద్రి పర్వత పంక్తులను విడదీసే, 'ఘాట్‌లు' అనే పేరు గల అనేక దుర్గమమైన కనుమలు మెట్ట ప్రాంతాలకు దారి తీస్తాయి.

ఆ ప్రాంతంలో సుస్థిర శాంతిని నెలకొల్పడానికి బహమనీ సుల్తాన్‌లకు ఒక శతాబ్ది కాలం పట్టింది. కొంకణ్ తీరం, మెట్ట ప్రాంతాల మధ్య వార్తా ప్రయాణ సౌకర్యాలు నిరాఘాటంగా సురక్షితంగా కొనసాగేటట్లు చేయటం వారి ప్రధాన లక్ష్యము. బహమనీలకు ఉత్తరాధికార రాజ్యాలుగా బీజాపూర్ అహ్మద్‌నగర్ స్థాపనతో కొంకణ్ ఉత్తర ప్రాంతం అహ్మద్‌నగర్ మధ్య కొంకణ్ బీజాపూర్ నియంత్రణకు లోనయ్యా

యి. అబిసీనియన్లు లేక హబ్షీస్ లేక సిద్దీలు అను పేర్లుగల ఆఫ్రికన్లు ప్రధానంగా దండా రాజపురి సమీపంలో స్థిర నివాసం ఏర్పరచుకొన్నారు. వారు దృఢకాయులైన జాతి. మాలిక్ అంబర్, సిద్ధీ రెయిహన్ వంటి రాజనీతిజ్ఞులను యుద్ధ వీరులను వారు దక్కన్ రాజ్యాలకు ప్రసాదించారు. అహ్మదనగర్ తాలూకు తీర నౌకాదళాన్ని నిర్వహింపగా జంజీరా వారికి బలమైన కేంద్రంగా రూపొందినది. పదునెనిమిదవ శతాబ్ది మధ్యకాలం వరకూ కొంకణ్ వ్యవహారాల్లో జంజీరాకు చెందిన సిద్దీలు గణనీయమైన పాత్రవహించారు.

పోర్చుగీసువారు 1510 లో గోవాను జయించి ఆక్రమించారు. వారు 1534 లో గుజరాత్ సుల్తానులనుంచి ఉత్తర కొంకణ్‌ను స్వాధీనం చేసికొన్నారు. థానాలోని వారి ప్రధాన కార్యస్థానం నుంచి, బస్సేన్‌కు ఉత్తరం నుంచి దక్షిణ భాగంలోని చౌక్‌వరకు విస్తరించిన తీరం, వారి నియంత్రణకు గురి అయింది. బీజాపూర్ వారిని గోవానుంచి పారద్రోలడానికి నిర్విరామ యత్నాలు చేసింది. కాని అవి ఫలించలేదు. ఇదే విధమైన భంగపాటు ఉత్తర కొంకణ్‌లో అహ్మదనగర్ అనుభవంగా మిగిలింది. ఈ రెండు రాజ్యాలు చివరకు పరాజయాన్ని పొందినట్లు ఒప్పుకొంటూ తమ ఐరోపా జాతి పొరుగువారితో ప్రశాంతంగా జీవించడానికి అంగీకరించాయి.

పోర్చుగీసువారి ఆక్రమణలో లేని ఉత్తర కొంకణ్ ప్రాంతంలో కళ్యాణ్, భివాండీ ప్రాంతం ప్రస్తుతపు కొలాబా జిల్లాలో అత్యధిక బాగం చేరి వున్నాయి. ఈ ప్రాంతం అహ్మదనగర్ రాజ్యం అంతం కాక మునుపు దాని పాలనలో ఉండేది. మొఘల్‌లు, బీజాపూర్ మధ్య 1635 లో జరిగిన పంపిణీ ఒప్పందం ప్రకారం మొఘల్‌లు ఈ ప్రాంతాన్ని పూనా జిల్లాతో సహా బీజాపూర్ హస్తగతం చేశారు. కాగా జంజీరాకు చెందిన సిద్దీలు వారి విశ్వాసాన్ని బీజాపూర్‌కు బదిలీచేశారు. బీజాపూర్ సుల్తాను అదిల్షా పూనా జాగీరును షాజీకి ఇచ్చి, కల్యాణ్-భివాండీ ప్రాంతం నిర్వహణను ముల్లా అహ్మద్ అను ఒక ప్రముఖ ఉద్యోగికి అప్పగించాడు.

మొఘల్ పరిభాషలో తీర కొంకణ్‌గా పిలువబడిన కొంకణ్‌కు చెందిన కళ్యాణ్ భివాండీ ప్రాంతంలో బీజాపూర్ పాలన క్రీ.శ. 1636 లోనే ఆరంభమైంది. అది పటిష్ఠమైనది గాని, శక్తివంతమైనదిగాని కాదు. మహ్మద్ అదిల్షా 1646 నుంచి పది సంవత్సరాల పాటు దీర్ఘరోగపీడితుడు కాగా ముల్లా అహమ్మద్ బీజాపూర్‌లో రాజధాని రాజకీయాలలో పాల్గొంటూ అంతకంతకూ ఎక్కువకాలాన్ని గడపసాగాడు.

శివాజీకి చెందిన పూనా జాగీర్లు బీజాపూర్‌కు కళ్యాణ్-భివాండీక్ మధ్య విస్తరించాయి. మహాబలేశ్వర్ సమీపంలో మెట్ట ప్రాంతాలనుంచి కొంకణ్ తీరంలోనికి వెళ్లడా

నికి అనుమతించే పర్వత కనుమవద్ద మోరేల శక్తివంతమమైన మరాఠా మొఖాసా ఉండేది. వారి సహకారం లేకుండా శివాజీ మధ్య కొంకణ్‌లోకి పురోగమించలేడు. అతను వారి సహాయాన్నయినా పొందాలి, లేదా వారిని అంతమొందించాలి.

శివాజీ క్రమక్రమంగా జాగరూకతతో తన అధికార పరిధిని విస్తరించి సుస్థిరంచేసుకొనే లక్ష్యంతో ఉన్నట్లు వెల్లడి అయినది. రాజ్య వ్యవహారాలు గందరగోళంలో పడిన స్థితిలో బీజాపూర్ ప్రభువర్గీయులు చేతులు ముడుచుకుని కూర్చోలేదు. రైబాగ్, హక్కేరీ, వెన్‌గుర్లలో సిద్దీ ప్రభువర్గీయుడు రుస్తుంజమాన్, ధార్వార్ -బెల్గాం ప్రాంతంలో పఠాన్ ప్రభువర్గీయుడు బహలూల్ ఖాన్, కర్నూల్ భూభాగంలో ప్రభువర్గీయుడు సిద్దీ జౌహర్, కార్యోన్ముఖులయారు. అందరూ ఒక రకమైన కార్యకలాపాల్లో నిమగ్నులయ్యారు. అవి ఒకే మోస్తరుగా ఉండేవి; పొరుగు వారిని వ్యయించి అధికార పరిధిని విస్తరించడం, కోటలను స్వాధీనం చేసికొని రాజుపేరుతో వాటిని నిర్వహించడం, స్వాధీనమైన వాటిపై స్థిరమైన హక్కులు ఏర్పరచుకొని అర్ధస్వతంత్ర ప్రతిపత్తిని చెలాయిస్తూ, రాజ్యరాజధానిలో అధికారం కొరకు పెనుగులాడటం. ఆ విధంగానే బహమనీలు అంతర్థానం కాగా, దక్కన్ రాజ్యాలు ముక్క చెక్కలయాయి. సిద్దీలు, పఠానులు ఆ విధంగా చేయగలిగినప్పుడు మూడు తరాల ప్రభువర్గీయుడైన శివాజీ తన మరాఠా జన్మ భూమిలో అదే విధంగా వ్యవహరిస్తే ఆశ్చర్యపడనవసరంలేదు. మొదటిసారిగా ఒక మరాఠా తన అధికారాన్ని పటిష్టం చేసికొనడం అతని శత్రువులకు సహింపరానిదయింది.

శివాజీ మరాఠా దేశ్‌ముఖులను, ఇతర స్థానిక వర్గాలను అనేక మందిని తన వైపు త్రిప్పుకొనగలిగినాడు. అతని లక్ష్యాలను శ్లాఘించినవారు వివాహబంధాల ద్వారా అతని పక్షంలో చేరగా వాటితో ఏకీభవించని వారు బలప్రయోగం ద్వారా లొంగిపోయారు. అదిల్షా పట్ల, గట్టి విశ్వాసంగల యువ మరాఠా నాయకుని కార్యకలాపాలను అపనమ్మకంతో చూశారు. విదేశీ ప్రభువర్గీయుల ప్రాబల్యానికి గురి అయిన రాజవంశ పాలనలోని రాజ్యాల స్థానే ఒక స్వచ్ఛమైన స్వదేశీ రాజ్యన్ని సృష్టించే స్థిరమైన లక్ష్యం అతనికి ఉన్నదనుభావం వారికి స్ఫురించలేదు. శక్తి సంపన్నులైన మొఘల్‌ల ఎడతెరిపిలేని ఒత్తిడికి గురి అయి దక్కన్ రాజ్యాలు త్వరితగతిని శిథిలమౌతున్నాయని మరాఠాలు వారి జన్మభూమిలో స్వరాజ్య స్థాపన చేయడానికి సాహసవంతమైన నాయకత్వం క్రింద వ్యవస్థీకృతులు కావాలని వారు గ్రహించలేక పోయినారు.

మోరేలకు వ్యతిరేకంగా ఎడతెరిపిలేని దండయాత్రలు, శివాజీ జాగీర్ల సరిహద్దుల వద్దగల (చంద్రారావ్ అనే బిరుదుగల నాయకుని ఆధ్వర్యంలోని) జావళీకి చెందిన

మోరేల మధ్య చిల్లర తగాదాలు, వారి మధ్య సంఘర్షణకు దారితీసింది. శివాజీ మద్ద తుతో దత్తత ద్వారా చంద్రారావు మోరేల నాయక పదవిని పొందాడు. ఆ కుటుంబ మొఖాసాలోని వివిధ భాగాలు ఇతర కుటుంబ సభ్యుల స్వాధీనంలో వున్నాయి. బీజా పూరు గవర్నరు అఫ్జల్‌ఖాన్ మోరేల అంతరంగిక కలహాలలో జోక్యం చేసికోవడానికి ప్రయత్నించి విఫలుడయాడు.

ఈ స్థితిలో శివాజీ మోరేలను శిక్షించి జావళీని జయించడానికి సంకల్పించా డు. ఇది 1655 సంవత్సరంలో జరిగింది.

### ఔరంగజేబ్ కార్యకలాపాలు

ఔరంగజేబ్ రాకుమారుడు క్రీ.శ. 1653 లో దక్కన్‌కు రాజ ప్రతినిధిగా విచ్చేయ టంతో దక్కన్‌లో మొఘల్ దౌత్యనీతి చాలా చురుకుగా కొనసాగింది. బీజాపూర్ గోల్కొండలను మొఘల్ సామ్రాజ్యం దక్షిణ సరిహద్దుల్లో సామంత రక్షిత రాజ్యా లుగా వాటి మనుగడను సహించడం షాజహాన్ విధానం. దక్షిణాపథంలో వాటి విస్త రణను కూడా ఆయన అనుమతించాడు. కొత్త రాజప్రతినిధి ఔరంగజేబ్ రాకుమారుని విధానం అది కాదు. గోల్కొండ బీజాపూర్‌లను జయించి ప్రత్యక్ష మొఘల్ పరిపాల నను నెలకొల్పాలని ఆయన అభిలాష. ఈ రాజ్యాల ఉద్యోగులను రాజద్రోహులుగా చేయటం మొఘల్‌ల విధానము. ఔరంగజేబ్‌కు అందుకు తగిన అవకాశం త్వరలో లభించింది. గోల్కొండ ప్రధాన మంత్రి అయిన మీర్జుమ్లా ఒక పర్షియన్ సాహసికు డు. దక్షిణాదిన గోల్కొండ దండయాత్రలో అతను గణనీయమైన పాత్ర నిర్వహిం చాడు. మీర్జుమ్లా సైనిక ప్రతిభ అతని ఫిరంగి దళనిర్మాణం దేశ విదేశాలలో అతని వ్యాపార నిర్వహణ అతనికి ఘన సంపదను సమకూర్చి గోల్కొండ ఆస్థానంలో అత్యంత శక్తిమంతుడైన వ్యక్తిగా చేశాయి. సారవంతమైన కర్ణాటక రాష్ట్రాన్ని జయించి అక్కడ స్థావరాలను ఏర్పరచుకొని, గోల్కొండలో ప్రముఖుడయాడు.

గోల్కొండ సుల్తాను అబ్దుల్లా కుతుబ్షా శక్తిసంపన్నుడైన మంత్రిని శంకించసాగా డు. తనను కర్ణాటకలోని తన జాగీర్లను కాపాడుకొనడానికి వ్యాకులపడి తనకు సహాయ పడగలిగిన వారిని అన్వేషించసాగాడు. ఔరంగజేబ్ ఈ అవకాశాన్ని వినియోగించుకు ని, మీర్జుమ్లాను తన పక్షానికి త్రిప్పుకొన్నాడు.

మీర్జుమ్లా బీజాపూరు ఆస్థానంపట్ల షాజీకి గల విశ్వాసాన్ని చెరచడానికి మెల్ల మెల్లగా యత్నించాడు. జె. యస్. సర్కార్ వ్రాసిన మీర్జుమ్లా జీవితం లోని మాటలు ఇవి "అతను (మీర్జుమ్లా) అదిల్షా (బీజాపూరు) పట్ల క్లేశముగల మరాఠా నాయకుడు

షాజీ భోస్లేను. అతను తరపున ఔరంగజేబుతో ప్రాధేయపడి. తన పక్షంలో చేర్చుకో వడానికి ప్రయత్నించాడు మీర్జుమ్లా షాజీ కి చేయదలచిన ఉపకార వాగ్దానాలను ఔరంగజేబ్ అతి యోగ్యమైనవిగా పరిగణించి. షాజీ ఉద్దేశ్యాలేమిటో మీర్జుమ్లా ద్వారా కర్ణాటకలో ఉన్న తరుణంలోనే షాజీతో మీర్జుమ్లా సంప్రదింపులు ప్రారంభించి వుండ వచ్చు. ఔరంగజేబ్ అతని ప్రవర్తనను ఆమోదిస్తూ, 'తన యజమాని' పట్ల భయపడి ఈ (మొఘల్) ఆస్థాన సేవ చేయగోరిన వ్యక్తి (షాజీ) ని సమాధాన పరచడం నీకు అవశ్యకం"[1] అని వ్రాశాడు.

బికనీర్ రాజు రావుకరణ్ ఆయన కుమారుడు అనుప్‌సింగ్ సేవలో ఆస్థాన కవిగా ఉన్న 'సంకర్షణ్ సకల్ కాలే' అనె కవి రచించిన ప్రచారంలో లేని పద్య కావ్యం 'శివ కావ్య' ఇటీవల లభ్యమైనది.' అది ఒక అపురూపమైనగాధ. ఔరంగజేబ్ క్రింద దౌల తాబాదులో అధికార పదవిని నిర్వహిస్తున్న బికనీర్ పాలకుడు రావుకరణ్‌సాధు ధర్నీధర్ మహరాజ్ వేషంతో శివపూర్‌లోని శివాజీ శిబిరానికి పయనించినట్లు కవి తెలియజేస్తా డు ఆయన కుమారుడు అనుప్ సింగ్ ఆయనను అనుసరించాడు. శివాజీకి జావళీపై దండయాత్రచేసి మోరేలను తుదముట్టించాలని రావు కరణ్ ప్రేరేపించాడు శివాజీకి ఏ ప్రేరణ అక్కర లేదు. అతని ప్రణాళికలు అప్పటికే సిద్ధమయివున్నాయి. అయితే దక్కన్ రాజ్యాల మధ్య కలహ బీజాలను నాటి వాటిని దుర్బలం చేయడానికి మొఘు ల్‌లు చేసిన ప్రయత్నాలను ఆ పద్యకావ్యం స్పష్టీకరిస్తుంది.

మొఘల్‌ల పక్షంలో మీర్జుమ్లా చేరిపోగా, ఔరంగజేబ్ ఒక సాకుతో గోల్కొండపై దండెత్తాడు. ఆపైన జరిగిన ఒక చిన్న సంఘర్షణ ఆ రాజ్యాన్ని ఔరంగజేబ్ మీర్జుమ్లా కలసి తుదముట్టించి ఉండేవారు. నానాటికి పెరుగుతున్న ఔరంగజేబ్ బలం పట్ల అసూయాగ్రస్తుడైన షాజహాన్ జోక్యం గోల్కొండ పూర్తిగా నాశనం కాకుండా రక్షిం చింది. అయినప్పటికి ఔరంగజేబ్ తన బలాలను ఉపసంహరించే ముందు గోల్కొం డను అవమానకరమైన సంధిషరతులకు గురిచేశాడు. మీర్జుమ్లాను మొఘల్ సామ్రా జ్యానికి ప్రధాన మంత్రిగా షాజహాన్ నియమించాడు. గోల్కొండ పాలకుడు మీర్జుమ్లా కిచ్చిన కర్ణాటక జాగీర్దను అతనిస్వాధీనంలోనే ఉండటానికి అనుమతి లభించడం అపూర్వమైన విషయము. మొఘల్ ఆస్థానానికి బయలుదేరి వెళ్లిన మీర్జుమ్లా తరపున ఆ జాగీర్ద పట్ల శ్రద్ధ వహించడానికి ఔరంగజేబ్ అంగీకరించాడు. ఈ సంఘటనలు 1655-56లో జరిగాయి.

---

[1] జె.ఎన్. సర్కార్, దిలైఫ్ ఆఫ్ మీర్జుమ్లా, పుట 131.

శివాజీ, మోరేలు

శివాజీ, "నేను రాజును, శ్రీ శంభుమహాదేవుడు నాకు సార్వభౌమాధికారాన్ని ప్రసాదించాడు. భవిష్యత్తులో "నీవు రాజుగా నామము ధరించరాదు," అని సందేశం పంపగా, చంద్రారావు మోరే అలక్ష్య వైఖరితో, "నీవు రాజువు అయినది నిన్ననే. ఈ సార్వభౌమాధికారాన్ని నీకు ఇచ్చినది ఎవరు? నీవు ధైర్యశాలివి అయినట్లయితే ఈ నాడే మమ్మల్ని కలుసుకో, రేపటి వరకు ఆ సందర్శన కార్యకలాపాన్ని వాయిదా వెయ్యకు," అని జవాబు ఇచ్చాడు.

మోరేలకు వ్యతిరేకంగా శివాజీ దండయాత్ర తీవ్రంగా, చురుకుగా కొనసాగింది. అందుకు సంబంధించిన సంఘటనలను 'జేధేశాకావళి' 'జేధేకరిన' అనే జేధ కుటుంబ చరిత్రలలో క్లుప్తంగా నమోదు చేశాడు. "శివాజీ 1656 జనవరి 27న జావళీ వైపు పురోగమించి, వశపరచుకొన్నాడు. ఆ సమయంలో కన్హోజీ జేధే, బందాల్‌లు, సిలింకారులు, ఇతర మావళీ దేశ్‌ముఖ్‌లు సమకూర్చిన దళాలు ఆయనకు మద్దతు నిచ్చాయి."

శివాజీ క్రీ.శ. 1656 మే లో రెయిరీని స్వాధీన పరచుకొన్నాడు. ఈ బలమైన దుర్గం తరువాత రాయగడ్ అనే పేరు వహించి క్రీ.శ. 1670 లో శివాజీకి రాజధాని అయింది. జావళీ నుంచి పలాయితుడైన చంద్రారావు ఈ కోటలో తల దాచుకున్నాడు. కోటనుంచి దిగి వచ్చేట్లు అతనికి నచ్చజెప్పారు. మోరేలు అనేకమంది స్వపక్షీయులను కోల్పోయారు. వారి బంధువులలో ఒకడైన హన్మంతరావు హతుడయాడు. తర్వాతి కాలంలో చంద్రారావు కూడ బీజాపూర్‌తో జరిగిన రహస్య ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా దాని పరోక్ష అనుమతితో చంపబడి వుండవచ్చు.

'బఖార్లు' అనే చరిత్రకు బదులు కవి పరమానందను విశ్వసనీయుడైన ప్రమాణంగా స్వీకరించాలి. శివాజీ, బాజీరావును రణరంగంలో నిర్జించి జావళీని స్వాధీన పరచుకొన్నట్లు ఆయన తెలియచేశాడు. చంద్రారావు బంధువులను మద్దతుదారులను కూడ శివాజీ వధించాడు. ఈ సంఘటనతో చంద్రారావు కుటుంబానికి చెందిన ప్రతాపరావు అదిల్షా ఆశ్రయాన్ని పొందటానికి పలాయితుడయాడు.

జావళీనుంచి మోరే రక్తసంబంధీకులు అనేకులు పారిపోయారు. వారిలో కొందరు మొఘల్‌లతో చేరి శివాజీకి చీకాకు కల్గిస్తూ వుండేవారు. దీనికి ఉదాహరణగా ఆ మరాఠా వీర రాజనీతిజ్ఞునికి వ్యతిరేకంగా జయసింహుని దండయాత్రను తీసికొనవచ్చును.

శివాజీ మోరేల పోరాటం సూటి అయినది. అది నిస్సంశయంగా అతి కర్కశంగా కొనసాగింది. జావళీ ప్రాంతం నుంచి మోరేలను తొలగించి, దానిని, మనుగ

డకి పోరాడుతున్న మరాఠా రాజ్యంలో చేర్చడం శివాజీ లక్ష్యము. ఈ సందర్భంలో కట్టుదిట్టమైన, నమ్మక ద్రోహం జరిగిందని, ఉద్దేశ పూర్వకంగా హత్యలు జరిగాయని చేసిన నేరారోపణలకు ఆధారం లేదు. అటువంటి విషయాలలో 'బఖార్లు' అంటే విశ్వసనీయమైన ఆధారాలను మినహాయించి, వాటిని చారిత్రక వాస్తవ నిరూపణకు మార్గదర్శినులుగా స్వీకరించరాదు.

జావళీని కలుపుకొనిన తరువాత రాయగఢ్‌గా మారిని రెయిరీ దుర్గాన్ని లోబర్చుకోవడంతో శివాజీ మధ్య కొంకణ్‌కు చెందిన ఈనాటి కొలాబా జిల్లాలోనికి ప్రవేశించినట్లే. జంజీరాకు చెందిన సిద్దీలకు, తీరంలోని బీజాపూర్ నౌకాదళాధిపతులకు ఉత్తరాన వున్న బీజాపూర్ ప్రాంతం కళ్యాణ్ భివాండీకి లోగడ గోచరించిన బెదిరింపు దీనితో వాస్తవరూపం దార్చింది. బీజాపూర్‌కు కొంకణ్‌కు మధ్య వార్తాప్రయాణ సౌకర్యాలను అడ్డగించడానికి కొంకణ్‌కు దారితీసే పర్వత కనుమలను సంరక్షించడానికి శివాజీ ప్రతాపగఢ్ అనే భారీ దుర్గాన్ని నిర్మించాడు. ఆయన జీవితకాలంలో నిర్మించి మరమ్మత్తు చేసి పునరుద్ధరించిన అనేక దుర్గాలలో అది ఒకటి.

శివాజీ కల్పించిన విపత్తు నిజమైనదే. కాని బీజాపూరుకు అంతకంటే ఎక్కువ అపాయం అధికారదాహం గల ఔరంగజేబ్ రాకుమారునినుంచి సంభవించింది. మీర్జుమ్లా అతనికి గోల్కొండను వదలివేసి బీజాపూరుపై దాడిచేయునట్లుగా నచ్చచెప్పాడు. మొఘల్‌లు దంజడయాత్ర చేసేందుకు కల్పించిన కారణాలు ఏమాత్రము పసలేనివి. ఆలీ అతని తండ్రి మహమ్మద్ అదిల్షా మరణానంతరము బీజాపూరు సింహాసనాన్ని అధిష్ఠించగా అతను మహమ్మద్ అదిల్షాకు నిజమైన వారసుడుకాడని ఆరోపించాడు. ఆలీ సింహాసనాన్ని అధిష్ఠించినట్లు ప్రకటించడానికి పూర్వం మొఘల్ అధిష్ఠాన పీఠం నుంచి నేరారోపణ కూడా జరిగింది. ఆ నేరారోపణలు రెండూ సత్యదూరములే. బీజాపూర్ సింహాసనాన్ని అధిష్ఠించే విషయంలో నిర్ణయం చేయడానికి బీజాపూర్ మొఘల్ పూర్వానుమతిని పొందవలసిన అవసరంలేదు. ఈ పాకులను ప్రేరేపించిన అక్రమ స్వభావాన్ని షాజహాన్ కూడా గ్రహించాడు. గట్టిగా ఒత్తిడి చేసినందున అయిష్టతతో ఆ దండయాత్రకు అతను అంగీకరించాడు. అతి తక్కువ కాలంలో బీజాపూర్‌లో విజయాన్ని సాధించాలని షరతు విధించాడు. అది సాధ్యపడనట్లయితే 1636 లో బీజాపూర్‌కు అప్పగించిన నైజాంషాహీ భూభాగాన్ని తిరిగి ఆక్రమించవలసి ఉంటుంది. ఔరంగజేబ్, 1657 లో జనవరి 18 న దక్కన్‌కు వచ్చిన మీర్జుమ్లాతో కలసి బీదర్ వైపు పురోగమించి, దానిని ముట్టడించాడు. మొఘల్‌లు 1657 మార్చి 29 న బీదర్‌ను పట్టుకున్నారు. వారికి 1657 జూలై 31 న కళ్యాణి దుర్గం స్వాధీనమైంది. శివాజీ

కొన్ని రాయితీల కొరకు ఔరంగజేబుకు ప్రతిపాదనలు చేసినాడు. బీజాపూరును బల హీన పర్చడానికి నిత్యం సంసిద్ధంగా ఉండే ఔరంగజేబ్ శివాజీకి 1657 ఏప్రిల్ 22 న ఈ క్రింది విధంగా వ్రాశాడు. "వాస్తవానికి బీజాపూరుకు చెంది నీ స్వాధీనంలో ఉన్న అన్నిఅనుసరిస్తున్నదుర్గాలను మహల్‌లను లోగడవలెనే నీకు శాశ్వతంగా దఖలు పరుస్తున్నాను. నీవు కోరినట్లుగా దాభోల్ దుర్గం దాని అధీన ప్రాంతాల నుంచి వచ్చే ఆదాయాన్ని కూడా నీకు వదిలివేస్తున్నాను. నీ ఇతర అభ్యర్థనలను కూడా ఆమోదించగలను. నీవు ఊహించిన దానికంటే ఎక్కువగానే నా అనుగ్రహానికి కృపకు పాత్రునిగా చేయదలచినాను."

మొఘల్ విజయాలు శివాజీకి వెరపు పుట్టించాయి. అతని పూనా, చాకన్ ఆస్తుల భద్రత విషయమై కూడా అతను ఆందోళన చెందాడు. ఒకప్పుడు నైజాంషాహి రాజ్యంలో భాగమైన ఈ భూభాగాలు కూడా మొఘల్‌ల నియంత్రణలో చేరవలసిం దేనా? బీజాపూర్ మొఖాసా దారుగా ప్రభువర్గీయుడుగా అతను మొఘల్‌లకు వ్యతిరే కంగా వేరొక రణరంగాన్ని తయారు చేశాడు. అతను 1657 లో జున్నార్ పైకి, పురో గమించి, ఆ పట్టణాన్ని కొల్లగొట్టాడు. మొఘల్‌లకు చెందిన అహ్మద్ నగర్ జిల్లాపై దాడులు కొనసాగించాడు.

ఔరంగజేబ్ అమిత కోపంతో ఉడికిపోయాడు. శివాజీ తన పక్షానికి మరల్చడా నికి చేసిన ప్రయత్నాలకు అది ప్రత్యుత్తరమా? ఔరంగజేబ్ తన ఉద్యోగులకు ఇచ్చిన ఆదేశాలు అతని పగను వెల్లడిస్తాయి. అతను వ్రాసినది: "శివాజీ భూభాగాలపై దాడి చెయ్యండి, అక్కడి గ్రామాలను నాశనం చెయ్యండి. దాక్షిణ్యం లేకుండా ప్రజలను సంహరించండి, హద్దు ఆపులేకుండా వారిని కొల్లగొట్టండి, శివాజీకి చెందిన ప్రాంతాలు పూనా చాక్‌న్ పూర్తిగా ధ్వంసం కావాలి. అక్కడి ప్రజలను చంపి బానిసలుగా చేయు టలో ఏమాత్రము ఉపేక్షించకూడదు."

బీజాపూర్ ఆత్మరక్షణకై గట్టిగా పోరాడింది. కళ్యాణి పతనమైన తరువాత మొఘ ల్‌ల పురోగమనం మందగించింది. బీజాపూరుపై మొఘల్‌ల దాడి అన్యాయమన్న భావన అందరిలో వ్యక్తమైంది. మొఘల్ ఆస్థానంలో ఔరంగజేబ్‌కు వ్యతిరేకుల పక్షం ఆధిక్యం సంపాదించింది. షాజహాన్ యుద్ధాన్ని ఆపి, బీజపూర్‌తో సంధిచేసితీ రాలని ఔరంగజేబును ఆజ్ఞాపించాడు.

**ఆగస్టు 1657 నాటి సంధి**

ఆ సంధి షరతులు ఇవి : బీదర్, కళ్యాణి, పరేండా వాటి అధీన ప్రాంతాలను,

వాంగీ పరగణాను. నైజాంషాహీలకు చెందిన కొంకణ్‌లోని అన్ని దుర్గాలను, ఒక కోటి రూపాయల నష్టపరిహారంతో సహా (మొఘల్‌లకు) అప్పగించాలి.

ఆ షరతులు పూర్తిగా అమలుకాలేదు. బీదర్, కళ్యాణి మొఘల్‌ల స్వాధీనమయ్యాయి. మొఘల్‌లకు పరేండాను అప్పగించకుండా, బీజాపూర్ రాజ్యోద్యోగులు అడ్డుపడ్డాయి. పూనా జిల్లాలో శివాజీ సుస్థిరస్థానం ఏర్పరచుకున్నాడు. కళ్యాణ్ భివాండీ ప్రాంతాన్ని అప్పటి వరకు మొఘల్‌లు ఆక్రమించలేక పోయారు.

షాజహాను 1657 సెప్టెంబరులో దారుణ వ్యాధికి గురిఅయిన వార్త కలవరంకల్గించింది. కాగా ఉత్తరాధికారసమస్య పరిష్కారం కొరకు, ఔరంగజేబ్ ఉత్తర భారతానికి ససైన్యంగా వెళ్లడానికి ఏర్పాట్లు చేయవలసివచ్చింది. దక్కన్‌లో మొఘల్ వ్యవహారాలు గందరగోళపు స్థితిలో పడినవి.

ఈ గొప్ప అవకాశాన్ని వినియోగించుకొంటూ, 1657 అక్టోబర్ 24 న శివాజీ ఆకస్మాత్తుగా కళ్యాణ్ భివాండీలపైబడి వాటిని ఆక్రమించినాడు. అతడు 1658 జనవరిలో మాహులే దుర్గాన్ని పట్టుకొనినాడు. ఆ విధంగా గతంలో నైజాం షాహీలకు చెందిన కొంకణ్‌ను, తీరంనుండి పర్వతాలవరకు అతడు స్వాధీనపరచుకొనినాడు.

మొఘల్‌లతో శివాజీ ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగుతూ వచ్చినవి. అతనికి, 1657 ఆగస్టులో మొఘల్‌లకు బీజాపూరుకు మధ్య జరిగిన సంధి ప్రకారం, పూనా కళ్యాణ్ భివాండీ జిల్లాలు మొఘల్ సామ్రాజ్యంలో చేరినట్లు అవగతము. మొఘల్ సామ్రాజ్యానికి ఆధీనుడుగా శివాజీ మొఘల్‌లతో తన సంభంధాలను నిర్వచించవలసిన సమయం ఆసన్నమైంది. పూనాలోని జాగీర్లను వారు తన స్వాధీనంలో వదలి వేసినట్లు చేయుటయే అతనికోరిక. అతడు ఆక్రమించిన నైజాంషాహీల భూభాగం కళ్యాణ్-భివాండీని కూడా మొఘల్‌లతో బేరసారాలలో అతడు కాంక్షించినాడు. ఈ ప్రాంతాన్ని అయన పూనా జాగీర్లను అయనకు ప్రసాదించి వాటిపై అయన హక్కు భక్తులతో జోక్యం చేసుకోకుండా వదలివేసినట్లయితే మొఘల్‌తో అతను పూర్తిగా సహకరించి ఉండేవాడు. శివాజీ ఉద్దేశపూర్వకంగానే మొఘల్ భూభాగాలలో దాడులు చేయకుండా తన కార్యకలాపాలను కొంకణ్‌కు పరిమితం చేసినట్లు సంకర్షణ్ తన పద్య కావ్యం 'శివకావ్యం'లో తెలియచేశాడు.

ఔరంగజేబ్ అవమాన భారంతో క్రుంగిపోయాడు. అయితే ఉత్తర భారతానికి వెళ్లే తొందరలో ఉన్నందున కొంకణ్ ప్రాంతాన్ని ఆక్రమించడానికి అతను చేయగలిగింది ఏమీ లేక పోయింది.

బీజాపూర్‌తో అతను సమాధాన పూర్వకమైన ఒప్పదాందాన్ని కుదుర్చుకుని

యుద్ధాన్ని ప్రేరేపించినందుకు మీర్జుమ్లాను, నిందించినాడు. మార్పిడులు జరిగిన భూభాగాల విషయంలో పరిస్థితిని అనుసరిస్తున్న ఔరంగజేబ్ మాటలు స్పష్టం చేస్తాయి. "మొఘల్ సామ్రాజ్యంలో చేర్చిన పరెండాదుర్గం దాని అధీన ప్రాంతమైన కొంకణ్ వాంగీ అనే పేరుగల మహల్‌లు, కీర్తిశేషుడైన మహమ్మద్ అదిల్షాకు, దుర్గాలు, మహల్‌లు మినహా కర్ణాటకలో ప్రసాదించిన భూభాగంతో కలసి ఆయాదుర్గాలు మహల్‌లు, మీర్జుమ్లా సేవలు సామ్రాజ్యానికి బదిలీ అయిన తరువాత ప్రభుత్వం తన్నగా పన్నులు వసూలుచేయు భూభాగం పూర్వం సర్కార్‌లో చేరగా వాటిని ఎప్పటివలెనే అతనికి వదలి వేయవలసి ఉంటుంది."[1]

ఔరంగజేబ్ ఈవిధంగా శివాజీని గురించి ఆలీ ఆదిల్షాకు వ్రాశాడు. "ఈ ప్రదేశాన్ని రక్షించు ఈ భూభాగాంలోని కొన్ని కోటలను దొంగచాటుగా ఆక్రమించిన శివాజీని వెళ్ళగొట్టు. అతన్ని నీ కొలువులోకి తీసికొనగోలినట్లయితే సామ్రాజ్య భూభాగాలను అల్లకల్లోలం పాలు చేయకుండా వాటికి దూరంగా కర్ణాటకలో అతనికి జాగీర్లు ఇవ్వు."

ఔరంగజేబ్ 1658 ఫిబ్రవవి 24 న ఔరంగాబాదు వదలి ఉత్తర భారతానికి వెళ్ళుతున్న సందర్భంలో శివాజీకి ఈ విధంగా వ్రాశాడు. "నీవు నా పూర్వీకుల స్థిరాస్తులకు (వతన్) సంబంధించిన మహల్‌లను, పూర్వం నైజాంషాహీలకు ప్రస్తుతం ఆదిల్‌ఖాన్‌కు చెంది సామ్రాజ్యాధికారులు ఆక్రమించిన కొంకణ్ ప్రదేశం దుర్గాలతో సహా నాకు అనుగ్రహించిన సంతోషకరమైన వార్తను అందజేసినట్లయితే, నా యితర కోర్కెలను మన్నిస్తూ రాకుమారుని సాధికార ప్రకటన నాకు చేరిన తరువాత...ఉన్నతులైన మీ మకాంకు నా సేనానుల్‌లో ఒకరిని పంపుటయేగాక నేనే స్వయంగా దక్కన్‌లోని సామ్రాజ్య భూభాగాల సరిహద్దులను రక్షించుటకు సామ్రాజ్యోద్యోగులతో చేరి అక్కడ ఏ పక్షంనుంచి అల్లర్లు జరగకుండా నివారించ గలను. అని వ్రాశావు,' (దానికి) నా జవాబు ఇది, నీ కోర్కెలను మన్నించుటకుగాను వాటిని లిఖితపూర్వకంగా తెలియచేస్తూ సోనాజీని నా వద్దకు పంపు...ఏ పరిస్థితిలోనూ నిజమైన విధేయతతో విశ్వాసాలతో కూడిన రాజమార్గం నుంచి వైదొలగకు."

ఔరంగజేబ్ వ్యవహారాలను పరిష్కరించకుండా కేవలం కాలహరణం చేస్తున్నాడు. ఆ వ్యవధిలో శివాజీ కొంకణ్ ప్రాంతంలో తాను జయించిన భూభాగాలలో తన అధికారాన్ని పటిష్టం చేసికొన ఆరంభించాడు. తరువాత బీజాపూర్ కొలువులో ఉన్న జంజీరాకు చెందిన సిద్దీ ఫతేఖాన్ శివాజీ బలపరాక్రమాలను ఎదుర్కోవలసి వచ్చింది.

[1] జె. ఎన్. సర్కాల్, దిలైఫ్ ఆఫ్ మీర్జుమ్లా. పుట 131.

తరువాత రెండు సంవత్సరాలలో శివాజీ సిద్దీలనుంచి ముఖ్య భూభాగంలోని వారి కోటలు అనేకం జయించాడు అయినప్పటికీ సముద్రాంతర్గతమైన జంజీరా దుర్గాన్ని అతను సమర్థవంతంగా దిగ్బంధనం చేయలేక పోయాడు. శివాజీ అభ్యున్నతి పట్ల కలవరపడిన పోర్చుగీసువారు సిద్దీలకు సహాయపడినట్లు సుస్పష్టము. ఈ సంగతి శివాజీని గురించిన 1659 ఆగస్టు 6 న తేదీ నాటి ఒక పోర్చుగీసు ఉత్తరంలోని అనుసరిస్తున్న వాక్యాలలో సువిదితం..."అదిల్షాపై తిరుగుబాటుదారు అయిన షాజీ పుత్రుడు వాసై (బాస్సీన్), చౌల్ సమీపంలోని ప్రాంతాలను స్వాధీన పరచుకొన్నాడు. అతని బలం పెరిగింది. బాస్సీన్ ప్రాంతంలోని భివాండీ, కళ్యాణ్, పాన్వెల్ రేవులలో అతను కొన్ని యుద్ధనౌకలను నిర్మించాడు. కనుక మేము అప్రమత్తంగా ఉండవలసిన అవసరం ఏర్పడింది. ఆ నౌకలను రేవులనుంచి వెలికి రానివ్వరాదని, సముద్రయానం చేయనివ్వకుండా చూడవలసిందని పోర్చుగీసు దళనాయకుని ఆజ్ఞాపించాము."[1]

శివాజీ పాలనలోని కళ్యాణ్ నౌకా నిర్మాణ కార్యకలాపాల ధ్వనితో నిండిపోయింది. సుశిక్షితులైన పనివారి క్రింద ద్వాదశయుద్ధ నౌకా నిర్మాణం ఆరంభమైంది. పైమాటగా ఆ నౌకా దళాన్ని జంజీరాకు చెందిన సిద్ధీలపై ప్రయోగించడానికి ఉద్దేశించినప్పటికీ వాస్తవానికి అతని లక్ష్యాలు చాలా విస్తృతమైనవి. కొంకణ్ అంతకంతకూ అతని స్వాధీనంలోకి రాగా, తన తీర ప్రాంత నౌకాదళాన్ని, రక్షించడానికి పోర్చుగీసు వారి కార్యకలాపాలను కనిపెట్టి అదుపులో ఉంచడానికి శివాజీ పద్మాదుర్గ్, సువర్ణ దుర్గ్, సింధుదుర్గ్ వంటి చాలా దుర్గాలను సముద్రం దరిదాపుల్లో నిర్మించ నారంభించినాడు.

మొఘల్‌లు భూమిపై ఆధారపడిన శక్తి సంపన్నులు-వారు నౌకా నిర్మణాన్ని అలక్ష్యం చేశారు. వారి తీర్థయాత్రిక నౌకలు, వాణిజ్య నౌకలు వాటి రక్షణకు భద్రతకు తీరంలోని ఐరోపాజాతులు అమర్చిన హామీలపై ఆధారపడి ఉండెడిది. సముద్రయాన సౌకర్యాలను చిందరవందర చేస్తున్న ఓడ దొంగలకు వ్యతిరేకంగా రక్షణ కల్పించలేదు. ఎంతో కాలం గడిచిన పిదప జంజీరాకు చెందిన సిద్ధీలు మొఘల్‌లతో చేరి ఒక చిన్న నౌకాదళాన్ని పని చేయించనారంభించినారు.

ఆ పరిస్థితుల్లో నౌకాదళకార్యకలాపాలకు శివాజీ ఇచ్చిన ప్రాధాన్యం అతని దూరదృష్టిని ప్రకటిస్తున్నది. అతనిని "భారత నౌకాదళ వ్యవస్థాపకుడు"గా ప్రస్తుతించడం భావ్యంగా ఉంటుంది.

---

[1] పిస్సూర్‌లెంకార్, పోర్చుగీస్-మరాఠీ సంబంధ్, పుట 41.

# 2

## శివాజీ, అఫ్జల్ ఖాన్

ఔరంగజేబ్ రాజ్య వారసత్వ పోరాటంలో నిమగ్నుడుకాగా చిన్నవాడైన అతని కుమారుడు ముఅజ్జామ్ దక్కన్ వ్యవహారాలను నిర్వహిస్తుండగా మొఘల్ వీక్షణనుంచి బీజాపూర్‌కు విశ్రాంతి లభించింది. అది తాత్కాలిక విరామమేనని బీజాపూర్ గ్రహించి వుండవలసింది. ఔరంగజేబ్ తీసుకొన్న సమాధాన పూర్వకమైన చర్యను వాస్తవిక దృష్టితో పరిశీలించి వుండవలసింది. బీజాపూరుని ఆక్రమించవలయుననే మొఘల్‌ల లక్ష్యం తేటతెల్లంగా ప్రత్యక్షంగా ఉంది. ఉత్తర సరిహద్దు భద్రంగా వుండగా బీజాపూర్ తన దృష్టిని శివాజీ వైపు మరలించింది.

బీజాపూర్ శివాజీని నాశనం చెయ్యాలని యత్నించగా, అతను తన మనుగడకై పోరాడి నందున ఆ సంఘర్షణ పూర్తిగా రాజకీయమైనది. శివాజీ సమకాలీన జీవిత కథా రచయితలు, శివాజీకాలంనాటి కవులు, ఆయన పాలనా చరిత్రకారులు మొత్తం మీద ఆ సమస్యను మతపరమైనదిగా చిత్రించారు. భారతీయ ఇతిహాసాల పురాణాల సంప్రదాయంలో పుట్టిపెరిగినందున ఆ పోరాటాన్ని పురాణోచితమైన అవతార కథలుగా, మంచి చెడుల పోరాటాలుగా మాత్రమే వారు భావించారు. అందులో ఇమిడిన రాజకీయ, సామాజిక, ఆర్థిక కారణాలు వారికి అవగతం కాలేదు. బీజాపూర్‌లో భూస్వామ్య వ్యవస్థను అక్కడ పఠాన్, సిద్ధీ, దక్కన్ ముస్లిమ్ ముఠాల మధ్య కొనసాగుతున్న తరుణంలో బీజాపూర్‌నుంచి మొఘల్‌లు నిర్విరామంగా మేథాసంపదను భుజబలాన్ని వారు గుర్తించలేదు. మొఘల్‌ల రాజ్య స్వభావాన్ని దాని పునాదిని, దాని వ్యవస్థను, దాని లక్ష్యాలను, భారీగా విదేశాలనుంచి సమకూర్చుకున్న దాని సైనిక పౌరపాలనా సాధనాలను కూడ వారు గ్రహించలేదు. మొఘల్ బీజాపూరు ఆస్థాన చరిత్రలు కూడా (పైవాటికంటే) భిన్నంగా లేవు. ఈ చరిత్రలలో ప్రతి ద్వందులను దయ్యాలుగా అవిశ్వాసులుగా ప్రతి యుద్ధాన్ని అవిశ్వాసులకు వ్యతిరేకంగా సాగించే పవిత్ర సమరంగా చిత్రించడం సాధారణ రీతి అయింది. అందువలన ఆ సంఘర్షణలో పాల్గొన్న శత్రువులను అంచనా వేయడంలో నాటి చరిత్రకారుల కంటే నేటి చరిత్రకారులకు ఎక్కువ విమర్శనా దృష్టి వుండాలి, కొందరు చదువరులకు శివాజీకి వ్యతిరేకంగా బీజాపూర్

సాగించిన దండయాత్ర ఎంతో అనాలోచిత చర్యగా కనిపించవచ్చు. శివాజీ కొంకణ్‌లో పటిష్ఠ స్థానాన్ని పొందగోరాడు. అంతకు మునుపు మొఘల్ సామ్రాజ్యంలో చెరిన కళ్యాణ్-భివాండీ ప్రాంతం. పూనా జిల్లాల భవిష్యత్తు అనిశ్చితంగా దక్షిణ కొంకణ్‌లో వ్రేళ్ళూనవలచి ఉండవచ్చు. బీజాపూర్ శత్రువులు మొఘల్‌లే కాని శివాజీ కాదు. బీజాపూర్ సార్వభౌమాధికారాన్ని శివాజీ గుర్తించేందుకు నిరాకరించలేదు. బీజాపూరుకు ఏటేటా నిర్ణీత మొత్తం కప్పంగా చెల్లిస్తూ కొంకణ్ ప్రాంతాన్ని తన ప్రత్యక్ష ఆధీనంలోకి అతను తెచ్చుకొనదలచినట్లయితే, అతని వర్తన ఇతర బీజాపూర్ ప్రభువర్గీయుల కార్యకలాపాల కంటే భిన్నమైనదికాదు. ధార్వార్-బెల్గాం ప్రాంతాలలో పఠానులు కర్నూల్లో సిద్దీలు ఒక వంక, రైబాగ్ దక్షిణ కొంకణ్ కార్వార్‌లలోని ప్రభువర్గీయులు మరొక వంక. అదే రీతిలో వ్యవహరిస్తుండేవారు.

ఈ ప్రవృత్తి కొనసాగుతున్న తీరుపై డచ్చివారు ఈ క్రింది మాటల్లో వ్యాఖ్యానించారు. "రాజు ఉత్తర్వుల ఫర్మానాల ద్వారా విశాల భూభాగాలను ప్రభువర్గీయునికి అనుగ్రహిస్తాడు. అతని ఉద్యోగం అనువంశికమైనది గాక, రాజు దయా దాక్షిణ్యాలపై ఆధారపడి ఉంటుంది. కొందరు ప్రభువర్గీయులు వాస్తవానికి స్వతంత్రులవలె వ్యవహరిస్తున్నారు. ఇట్టి వారిలో బీజాపూర్ రాజమకుటానికి అధీనుడుగా చలామణీ అవుతున్న బహలూల్‌ఖాన్ ప్రభువు తక్కువవాడు కాదు."

ఔరంగజేబ్ మొఘల్ సామ్రాజ్యంలో చేర్చిన జిల్లాలనుంచి శివాజీ వైదొలగునట్లు చేయటం పట్ల తీవ్ర ఆసక్తిని కనబరచాడు. అదిల్షాకు వ్రాసిన లేఖలో శివాజీని ఆ ప్రాంతంనుంచి వెళ్ళగొట్టమని ఆదేశించాడు. ముందు ప్రకరణంలో దీనిని గురించిన ప్రస్తావన ఉంది. మొఘల్‌ల ఆదేశాలను అంగీకరించాలని బీజాపూర్ నిర్ణయించింది.

మొఘల్‌లకు శివాజీకి పరస్పరంగా ఉన్న వ్యవహారాలలో కచ్చితమైన తటస్థవైఖరిని అనుసరించి వుండవచ్చు. ఆక్రమిత ప్రాంతంలో శివాజీ పట్ల మొఘల్‌లు తీసుకున్న చర్యలు పూర్తిగా వారి వ్యవహారమే కాని, దానితో బీజాపూరుకు సంబంధం లేదని తుది మాటగా చెప్పుకోవాలి. మొఘల్‌లనుంచి ఎదురవుతున్న అంతిమ ప్రమాదాన్ని గ్రహించి బీజాపూర్ దాని యితర ప్రభువర్గీయులపట్ల అనుసరిస్తున్న పద్ధతులోనే దక్షిణ కొంకణ్‌లో శివాజీ ప్రయోజనాలను పదిలంగా ఉంచడానికి అతనితో అంగీకారానికి వచ్చి ఉండవచ్చు. దీని వలన మొఘల్‌లతో ఇచ్చిపుచ్చుకునే విషయంలో బీజాపూర్ స్థితి బలపడి ఉండేది. దీనికి బదులు మొఘల్‌లు కోరిన దానిని సాధించడానికి బీజాపూర్ పూనుకున్నది. వాస్తవానికి శివాజీకి వ్యతిరేకంగా పోరా

డించి బీజాపూర్ కాదు. ఉత్తర భారతంలోని కార్యకలాపాల్లో నిమగ్నమై ఉన్న మొఘల్‌లు ఇతరుల ద్వారా శివాజీతో పోరాడారు

శివాజీపై దండయాత్ర చెయడానికి నిశ్చయించి ఆ చర్యను సమర్థించడానికి బీజాపూర్ అనేక సాకులు కనుగొన్నది. వాటి సారాంశమైన లక్ష్యాలు రెండే: ఒకటి శివాజీని నాశనం చెయ్యడం, మరొకటి మొఘల్ ఆక్రమణలు సాఫీగా సుస్థిరంగా కొనసాగేటట్లు చూడటం. బీజాపూర్ సేనాని అఫ్జల్ ఖాన్‌కు ఇచ్చిన ఆదేశాలకు అందుకు భిన్నమైన భాష్యం చెప్పడానికి వీలులేదు.

అదిల్షా ఆస్థానంలోని ప్రభువర్గీయుడు, తారిఖే ఆలీ రచయిత అయిన నూరుల్లా వ్రాసినది ఇది:[1] "అఫ్జల్‌ఖాన్‌కు రాజాజ్ఞ ఇచ్చే సందర్భంలో అదిల్షా, బీజాపూరు సైన్యాల ఒత్తిడికి తట్టుకొనలేక శివాజీ తన సహజమైన కపట రీతిలో ప్రశాంతంగా తొలగిపోవడానికి అంగీకరించినట్లయితే అఫ్జల్ ఖాన్ అతని మాటలను వినకుండా అతని జీవితం అనే పంటపై మరణమనే నిప్పు విసరివేయటం తప్ప మరొక విధానాన్ని అనుసరించరాదని ఆదేశించాడు."

అంతకు మునుపు నూరుల్లా ఆ కాలంలోని చరిత్ర రచనా పద్ధతి ప్రమాణాలను వివరిస్తూ చేసిన వ్యాఖ్యలు అంతే ఆసక్తిదాయకంగా వుంటాయి. అతను చెప్పింది ఇది: "ఆలీ అదిల్షా అవిశ్వాసమనే ముళ్ళ పొదల్ని శత్రుసంహారణోద్యుక్తమైన ఖడ్గానలంతో కాల్చివేయకపోతే మహమ్మదీయ మత ప్రాబల్యం సాధ్యంకాదని గమనించి, దుర్మార్గుడైన శివాజీని శిక్షించి నిర్మూలించడానికి పదివేల అశ్విక దళంతో అఫ్జల్‌ఖాన్‌ను నియమించాడు."

అఫ్జల్‌ఖాన్ వెయ్ రాష్ట్రం గవర్నరుగా నియమితుడయాడు. మరాఠీ నాయకుడు కన్హోజీ దేధేకు 1659 జూన్ 16 నాడు అదిల్షా పంపిన ఫర్మానాధోరణిని నిదర్శనంగా తీసుకోవచ్చు. "శివాజీ సంకుచిత మనస్తత్వం, పాపిష్టి కాంక్షలతో నైజాం షాహీలకు చెందిన కొంకణ్ రాష్ట్రంలో నివసిస్తున్న మహమ్మదీయులను బాధించనారంభించాడు. అంతేకాక అతడు వారిని దోపిడీచేశాడు. పాద్షాహీ (సామ్రాజ్య) రాష్ట్రంలో అనేక దుర్గాలను కూడ అతను కైవసం చేసుకున్నాడు. అందుచేత అతనిని వెళ్ళగొట్టి జయించడానికిగాను మేము అఫ్జల్ ఖాన్‌ని నియోగించాము."

అఫ్జల్‌ఖాన్ 1659 ఏప్రిల్‌లో బీజాపూర్ నుంచి సైన్యంగా తరలాడు. అతని సైన్యంలో మరాఠా నాయకులు అనేకులు పాల్గొన్నారు. ఈ దండయాత్రలో అతను

---

[1] జె.ఎన్. సర్కార్, శివాజీ మూడవ ప్రకరణానికి అనుబంధం, పుట 73.

తుల్జాపూర్, పంఢర్‌పూర్ దేవాలయాలను నేలమట్టం చేశాడను ఆరోపణకు తగిన సాక్ష్యాధారాలు లేవు. తుల్జాపూర్ అతని ప్రయాణ మార్గంలోలేదు. అప్పట్లో సాధారణంగా జరిగినట్లు అతని దండయాత్రలకుగాను ఆ దేవళాలనుంచి నిధులు కోరడం. అవి సొమ్ము చెల్లించనట్లయితే వాటిని నాశనం చెయగలనని బెదిరించడం జరిగివుండవు. అటువంటి ప్రమాదకర పరిస్థితుల్లో దుష్టబుద్ధి కల వ్యక్తులకు అందకుండా దేవతా విగ్రహాలను దాచిపెట్టడం ఆనాటి ఆచారం. ఈ దండయాత్ర సందర్భంగా పంఢర్‌పూర్‌లో ఇట్టివి జరిగినట్లు సమకాలీన పత్రాలు వెల్లడిస్తున్నాయి. అఫ్జల్‌ఖాన్ చేతుల్లో తుల్జాపూర్‌కు ఏదైనా నష్టం పూర్వ దండాయాత్రలో జరిగి ఉండవచ్చు. తుల్జాపూర్‌లోని భవాని విగ్రహాన్ని ఆమె భక్తులు పశ్చిమానికి తరలించారని విస్తృతంగా విశ్వసిస్తున్నారు. ప్రతాప్‌గడ్‌లో ఉన్న విగ్రహం అదే అయిఉండవచ్చు. శివాజీ వేయ్‌కి చేరగా, అఫ్జల్‌ఖాన్ శివాజీ అధీన ప్రాంతంలోని పూనా జిల్లాను తిరిగి ఆక్రమించడానికి తన సైనికి దళాలను పంపాడు. అప్పుడే శివాజీకి వ్యతిరేకంగా తన దండయాత్ర వ్యూహరచనకు ఉపక్రమించాడు.

తన మనుగడకి దాపురించిన ఈ ప్రమాద స్వభావాన్ని శివాజీ పూర్తిగా గ్రహించాడు. ఈ క్లిష్టపరిస్థితి నడుమ రోగపీడితురాలైన శివాజీ భార్య అతని కుమారుడు వారసుడు శంభాజీ తల్లి అయిన శాయిభాయి 1659 సెప్టెంబరులో గతించింది. ఆమె మరణం శివాజీకి పెద్ద విఘాతమైంది. ఆ దుఃఖాన్ని అతను మనస్థైర్యంతో భరించాడు. అంతకు మునుపు 1659 జూలై 11 న పూనా సమీపంలోని అతని రాజధాని రాజగడ్‌ను వదలిపెట్టి, అతను వెయ్‌కు కొన్ని కిలోమీటర్ల దూరంలో మహాబలేశ్వర్ పర్వత పంక్తుల్లో గల ప్రతాపగఢ్‌ను తనకు బలమైన కేంద్రంగా రూపొందించాడు.

### అఫ్జల్‌ఖాన్ నుంచి ఆఖరి ప్రతిపాదన

రెండు లేఖలు, అఫ్జల్‌ఖాన్ శివాజీకి వ్రాసిన దొకటి, శివాజీ అఫ్జల్‌ఖాన్‌కు ఇచ్చిన జవాబు మరొకటి, సంస్కృతంలోకి అనువాదమై, కవీంద్ర పరమానంద్ సంస్కృత పద్యకావ్యం "శివభారత్" లో ఉద్దేశ్యరహితంగా భావి తరాలవారికొరకు నిక్షిప్తమైనవి.

శివాజీకి అఫ్జల్‌ఖాన్ పంపిన చివరి ప్రతిపాదన ఇలా వుంది:

(1) నైజాంషాలు అంతర్థితులైన తరువాత ఆదిలా స్వాధీనం చేసికొని శాంతి ప్రయోజనాలకై మొఘల్‌లు అతనికి ప్రసాదించిన పర్వత దుర్గమయమైన భూభాగాన్ని నువ్వు బలవంతంగా ఆక్రమించి స్వాధీనం చేసుకున్నావు.

(2) నీ నుంచి చాలాసార్లు ముట్టడికి భూభాగ అపహరణకు గురి అయిన రాజ పురి ప్రభువు (జంజీరాకు చెందిన సిద్దీలు) నీపై ఆగ్రహావేశుడుగా ఉన్నాడు.
(3) శత్రువులకు ఏమాత్రం చొరరాని విశాలమైన చంద్రారావు రాజ్యంపై నీవు దండెత్తి యుద్ధానంతరం దానిని బలత్కారంగా ఆక్రమించుకున్నావు.
(4) కళ్యాణ్-భివాండీలను కూడా నీవు ఆక్రమించి మసీదులను ధ్వంసంచేసిన ట్లుగా వినవస్తున్నది.
(5) మహమ్మదీయుల సర్వస్వాన్ని నీవు దోచుకుని వారిని అవమానించావు. వారు నీపట్ల కోపోద్రిక్తులుగా ఉన్నారు.
(6) నీ బలాన్ని సరిగా విచారింపక ఇస్లాం మతానికి చెందిన పవిత్రులను నిర్బం ధించి, ముస్లింల మతాచరణకు ప్రతిబంధకాలు కల్పించావు.
(7) సార్వభౌమాధికార చిహ్నాలను స్వేచ్ఛగా ధరించి, అక్రమంగా స్వర్ణసిం హాసనంపై ఆసీనుడవై స్వీయ అధికారంతో వ్యక్తులను కటాక్షిస్తూ, శిక్షిస్తూ విధే యతకు పాత్రులైన వారిపట్ల అలక్ష్య వైఖరితో ప్రవర్తిస్తూ స్వేచ్ఛగా సంచరిస్తూ నిర్భీతితో వ్యవహరిస్తున్నావు గనుక ఘనుడైన అదిల్షా నన్ను పంపాడు.
(8) నా వెంట వచ్చిన సైన్యం యుద్ధానికై నన్ను ఒత్తిడి చేస్తున్నది. యుద్ధాసక్తు లైన మూసే ఖాన్ నా ఇతర ఉద్యోగులు, జావళీని స్వాధీన పరచుకొనగోరు తున్న నాయకులు నీపై దాడి సాగించమనీ నన్ను ఒత్తిడి చేస్తున్నారు.
(9) కాబట్టి ఓ నాయకుడా! నా ఆజ్ఞలను మన్నించి శాంతికి ఒడంబడి అన్ని దుర్గాలను భూభాగాలను త్యజించు.
(10) అపార శక్తిసంపన్నుడైన ఢిల్లీ సమ్రాట్టుకు గొప్ప బలంతో అతిశయించిన సింహగఢ్, లోహగఢ్ దుర్గాలను అదే విధంగా పురందర్ దుర్గాన్ని, చాకన్ పట్ట ణాన్ని నీరా భీమాలకు మధ్యగల భూభాగాలను అన్నింటినీ సమర్పించు.
(11) చంద్రారావు నుంచి నీవు బలవంతంగా ఆక్రమించిన జావళి పరిస్థితిని గురించి ఆలీ అదిల్షా నీ నుంచి తెలిసికొన గోరుచున్నాడు."

డాక్టర్ ఫ్రెయర్ దినచర్య గ్రంథం ఒకటవ సంపుటం, పుట 309 ని చూసి నట్ల యితే మసీదుల విధ్వంస కాండకు సంబంధించిన భావన కేవలం ప్రచారం మాత్రమే. కొన్ని సంవత్సరాల తరువాత కళ్యాణ్‌ను సందర్శించిన డాక్టర్ ఫ్రైయర్ మత సంబం ధమైన కట్టడాల స్థితిని జాగ్రత్తగా గమనించాడు.

శివాజీకి వ్యతిరేకంగా బీజాపూర్ పోరాడుతున్నప్పటికి ఉత్తర భారత వ్యవహారా లలో నిమగ్నులైన మొఘల్‌లే పరోక్షంగా ఆ యుద్ధాన్ని సాగిస్తున్నట్లు స్పష్టమవు

తుంది. ఈ వ్యవహారంలో ఔరంగజేబ్ కోరికలను బీజాపూర్ నెరవేరుస్తున్నట్లు సుస్ప ష్టము.

శివాజీ సంకటస్థితిలో పడ్డాడు. లొంగుబాటు రాజకీయంగా ఆత్మహత్యా సదృ శం, ఆయన అత్యున్నత ఆత్మవిశ్వాసం, ధర్మయుద్ధాన్ని కొనసాగిస్తున్నట్లు, దైవకృప ఆయన పట్ల ఉన్నట్లు ఆయన నమ్మకం. ఈ విపత్కర పరిస్థితినుంచి ఆయన జయ ప్రదంగా బయట పడటానికి తోడ్పడింది.

శివాజీ తన అనుచరులతో భక్తి విశ్వాసాలను ప్రేరేపించగల అసాధారణ శక్తిగల వాడు. ఈ దండయాత్రలో ఆయన జీవిత పర్యంత సహచరులుగా ప్రముఖులైనవారి పేర్లు వెల్లడి అయ్యాయి. పీష్వా మోరోపంత్ పింగ్లే, ఆశ్విక దళాధిపతి నేతాజీ పాల్కర్ ఇతర సేనానాయకులు అనేకులు ఆయనతో కలిసి పోరాడారు. శివాజీ కొంకణ్ దళ కార్యకలాపాలు నెతాజీ పాల్కర్‌కు అప్పగించాడు. ప్రతాపగఢ్ చుట్టూ ఉన్న పర్వతాలలో గణనీయమైన మరాఠా సైనిక దళాలను నియోగించారు.

అఫ్జల్‌ఖాన్‌ను జావళీ దుర్గానికి ఎఱవేసి రప్పించడం శివాజీ లక్ష్యము. అఫ్జల్ ఖాన్‌కు అతను వ్రాసిన లేఖ దౌత్యనీతిలో నేర్పరితనానికి పరిపూర్ణ తార్కాణము.

అఫ్జల్‌ఖాన్ భ్రమలతో, శివాజీ భయ ఆతురతలతో సమంగా అది క్రీడిస్తుంది. ఆ లేఖ ఈ విధంగా వుంది:

"1. యుద్ధంలో కర్ణాటకలో గల రాజన్యుల నందరినీ తుదముట్టించిన నీవు నా పట్ల ఈ మాత్రం కృపను ప్రదర్శించడం అసాధారణ విషయము.

2. నీ ఆయుధబలం సాటిలేనిది. నీ సాహసం అగ్నివంటిది. నువ్వు భూతలానికి అలంకారానివి. నీ స్వభావంలో వంచన లేదు.

3. నీవు అరణ్యాల శోభను తిలకించదలచినట్లయితే ఈ జావళీకి విచ్చేసి తిల కించు.

4. ఇక్కడకు నీవు ఇప్పుడు రావడమే ఉచితంగా ఉంటుందని నా అభిప్రాయ ము. ఆ చర్య నన్ను పూర్తిగా భయవిముక్తుణ్ణి చేసి, నా పురోగతికి దోహదం చేయగలదు.

5. నాకు గర్విష్ఠులైన మొఘల్‌ల సైన్యం గురించియేగాక, నీ భయంకర శక్తి మినహా ఆదిల్‌షా సైనిక బలం పట్ల కూడా తృణీకారభావం తప్ప వేరొకటిలేదు.

6 సుఖంగా ప్రయాణం చేసి ఇక్కడకు విచ్చేయి. నేను దుర్గాలను, నువ్వు పేర్కొన్న ఈ జావళీ దుర్గాన్ని కూడా అప్పగించడానికి సంసిద్ధుడను.

7. చూసినంత మాత్రాన భయాన్ని కలిగించే నిన్ను చూసి నిర్భయంగా నా

కృపాణాన్ని నీ ముందుంచగలను
8. ఈ ప్రాచీన విశాల వనాన్ని చూడగానే సైన్యం అన్ని ప్రాపంచిక సుఖాల గాఢానుభూతిని పొందగలదు."

చాలా మెలకువతో వ్రాసిన ద్వంద్వార్థాలతో నిండిన ఆ లేఖ అఫ్జల్‌ఖాన్ పై ఆశించిన ప్రభావాన్ని చూపింది. రాయబారుల మార్పిడి అనంతరం తన సహచరుల సలహాకు వ్యతిరేకంగా అఫ్జల్ ఖాన్ జావళీకి వెళ్లి ప్రాణాంతకమైన కార్యంచేశాడు. అతని ఫిరంగిదళాన్ని వేయే దగ్గిరవున్న ప్రధాన శిబిరాన్ని వదలి పెట్టి తగుపాటి సైనికబలంతో జావళీవైపు తరలివెళ్లాడు. శివాజీ అఫ్జల్‌ఖానులు ప్రతాపగఢ్ దుర్గం వెలుపల గుడారంలో సమావేశం కావాలని నిశ్చయించారు. వారు పదిమంది అంగరక్షకులను తమతో ఉంచుకొని, ఆ అంగరక్షకులను సమావేశ స్థలానికి బాణం వేటు దూరంలో ఉంచగలరు. ఆయుధాలు ధరించిన శివాజీ అఫ్జల్‌ఖాన్‌లు గుడారంలో ఉన్నప్పుడు వారికి తోడుగా ఇద్దరు లేక ముగ్గురు సేవకులు మాత్రమే ఉండగలరు. అఫ్జల్‌ఖాన్ రాయబారి క్రిష్ణాజీ, శివాజీ రాయబారి పంత్‌జీ వెంటవుంటారు.

శివాజీ అంగరక్షకులలో పరమానంద్ కవి తన కావ్యంలో శంభాజీ కవ్‌జీ, కటోజీ ఇంగ్లే, సిద్ధీ ఇబ్రహీమ్ ఇతరుల పేర్లను ప్రస్తావించాడు. అఫ్జల్‌ఖాన్ అంగరక్షకులలోని వారు రహీంఖాన్, పహిల్వాన్ ఖాన్, శంకర్‌జీమొహితే ఇత్యాదులు. ఈ జాబితా ఆ సంఘర్షణ రాజకీయ స్వభావాన్ని నొక్కి వక్కాణిస్తున్నది. విరుద్ధ పక్షాలు వ్రాసిన మరాఠా పర్షియన్ చరిత్రలు సూచించినట్లు అది మతపరమైనది కాదు.

అది శివాజీ జీవితంలో తీవ్రసంకటస్థితి. దాని వలన దాదాపు సహించలేని ప్రయాస అతనికి కలిగిఉండవచ్చు. శివాజీ గొప్ప ఆధ్యాత్మిక బలంగల వ్యక్తి. తన మతానికి సంప్రదాయాలకు అంకితమై, తన తల్లి జీజాబాయి ఆశీర్వాదాలను ఎల్లప్పుడు అర్థిస్తున్నందుకు శివాజీ తన ప్రజల కొరకు తాను సాగిస్తున్న పోరాటంలో తనకు దైవ సంకల్పం మార్గ నిర్దేశం చేస్తున్నదనే స్థిరమైన విశ్వాసం కలవాడు. ప్రజల దృష్టిలో శివాజీ సహజ ఆధ్యాత్మికశక్తి సంపన్నుడుగా పేరొందినందుకు భవానీ మాత ప్రత్యక్షమై అతనిని ఆశీర్వదించినట్లు కథలు ప్రచారమయాయి.

శివాజీ 1659 నవంబర్ 10 న అఫ్జల్‌ఖాన్‌ను కలిశాడు. ఆయుధపాణులైన వారిరువురు రాయబార సమేతంగా గుడారంలో ప్రవేశించారు. శివాజీ పెద్ద పట్టాకత్తిని, నిడుపాటి బాకును కవి పరమానంద్ ప్రస్తావించకపోయినప్పటికీ అంగీ క్రింద పులిగోళ్ళను కొని తెచ్చి ఉండవచ్చు. భీమ్‌సేన్ సక్సేనా వంటి చరిత్రకారులు వంపుగల బాకును (బిచువా) పులిగోళ్ళుగా భ్రమించి వుండవచ్చు. కాని ఈ రెండు ఆయు

ధాలు పూర్తిగా భిన్నమైనవి.

అఫ్జల్‌ఖాన్ ఒక కరవాలాన్ని ఒక బాకుని తెచ్చాడు. శివాజీకి విశ్వాసాన్ని కల్గించ డానికి అతను తన కత్తిని తన సేవకునికి అందించాడు. శివాజీ అందుకు బదులుగా అదే విధమైన చర్యలో ప్రతిస్పందించినట్లు పరమానంద చెప్పినప్పటికీ ఇతర చరిత్రలు శివాజీ తన కత్తిని తనసేవకునికి అందించినట్లు చెపుతున్నాయి. ఇది సరి యైన సమాచారంగా తోస్తుంది.

పరమానంద్ వ్రాసినదాని ప్రకారం అఫ్జల్‌ఖాన్ శివాజీని కలిసినప్పుడు అతి గర్వభూయిష్టమైన తిరుగుబాటు ధోరణిని విడిచిపెట్టి, పూర్తిగా లొంగిపోవలసిందని ఆజ్ఞాపించాడు. అంతేకాక అఫ్జల్‌ఖాన్, ఇంకా ఇలా అన్నాడు. "నేను స్వయంగా నిన్ను బీజాపూర్‌కు కొనిపోయి రాజుసన్నిధిలో నీవు తలవంచునట్లు చేసి, ఆ శక్తి సంపన్నుడైన ప్రభువును ప్రాధేయపడి నీకు ఇతోధికమైన వైభవాన్ని సంపాదించగల ను, నీవు కలవరపడకు. నీ చేయితో కలిపి నన్ను ఆలింగనం చేసుకో." శివాజీ తన చేజిక్కినంతనే శత్రుసంహారం చేసే కోరిక అఫ్జల్‌ఖాన్‌కు పట్టరానిదిగా పరిణమించి ఉండవచ్చు. "ఆ విధంగా మాట్లాడి అతను శివాజీ కంఠాన్ని ఎడమచేతితో పట్టుకొని కుడిచేతిలోని బాకును లోతుగా గుచ్చాడు. మల్లయుద్ధప్రవీణుడైన శివాజీ త్వరగా తన కంఠాన్ని విడిపించుకొని తత్తరపాటు లేకుండా తన శరీరాన్ని కొద్దిగా ముడుచు కొని ఒక వైపు దిగనున్న బాకుని తప్పించుకొన్నాడు. వెంటనే శివాజీ తన బాకుతో అఫ్జల్‌ఖాన్‌ను లోతుగా పొడిచాడు. అఫ్జల్‌ఖాన్ ఆ దెబ్బకు తూలిపడి తడపడుతున్న అడుగులతో కాలుజారి పడి అతను నన్ను హతమార్చాడు. అతని శత్రువును వెంటనే చంపండి" అని అరిచాడని పరమానంద్ ( ఆ ఆకస్మిక సన్నివేశాన్ని) వర్ణించాడు.

శివాజీ వేదికనుంచి క్రిందికి దూకాడు ఆ లోపల (అఫ్జల్‌ఖాన్) భృత్యుడు శివాజీ పై కత్తి వ్రేటు వేశాడు. పరమానంద్ చెప్పిన దానిని బట్టి శివాజీ అఫ్జల్‌ఖాన్‌నే కాక ఆ సేవకుని కూడా చంపటం ద్వారా తగు ప్రతిచర్య తీసికొనినాడు. వారి తలలను శరీ రాలనుంచి వేరుచేశాడు.

పరమానంద్ కథనం ఇతర మరాఠా చరిత్రలకు నుంచి భిన్నంగా ఉంది. శివా జీపై దాడి జరిగిన సమయంలో అతను కృపాణాన్ని ధరించలేదు. అతను తన బాకును పులిగోళ్ళను వినియోగించాడు. అఫ్జల్‌ఖాన్‌ను ప్రాణాంతకమైన పనికి గురిచేశాడు. శివాజీ తన కత్తితో చివరి వ్రేటువేసి అఫ్జల్‌ఖాన్ తలను మొండెంనుంచి వేరు చేసినట్లు పరమానంద్ చెప్పిన మాటలను మనం విశ్వసించవలసి వుంటుంది. కాని సత్యదూ రం. అఫ్జల్‌ఖాన్ వెంటపడి అతనిని తుదముట్టించినవారు శివాజీ సహచరులే. అఫ్జల్

ఖాన్ అంగరక్షకులు వేగంగా రంగంలోకి దిగారు. అప్పుడు జరిగిన సంఘర్షణలో శివాజీపై కూడ దాడి జరిగింది. అతను నిబ్బరంగా ఆత్మరక్షణకు పూనుకొన్నాడు. అల్ప కాలంలోనే అఫ్జల్ రాయబారితో సహా అంగరక్షకులందరూ హతులుకావడం లేదా గాయ పడటం జరిగింది. శివాజీ దుర్గంలోకి తిరిగి వెళ్ళాడు.

పర్షియన్ చరిత్రలు శివాజీకి విశ్వాసఘాతుకత్వాన్ని అంటగట్టడాన్ని అర్థం చేసికో వచ్చు. మరాఠా చరిత్రలు అందుకు భిన్నంగా వుంటాయి. శివాజీ బుద్ధి సూక్ష్మతను ప్రదర్శించగా, అఫ్జల్‌ఖాన్ తన తొందరపాటు మితి మీరిన ఆత్మవిశ్వాసానికి తగిన మూల్యాన్ని చెల్లించినట్లుగా చరిత్రకారుడు తీర్మానించక తప్పదు.

శివాజీ నుంచి సంకేతం అందగానే, అతని సేవకులు అఫ్జల్‌ఖాన్ సైన్యంపై దాడిచేశా రు. ఆకస్మికమైన దాడి వలన అఫ్జల్‌ఖాన్ సైన్యం నాశనం అయింది. అప్పుడు మరాఠా లకు దోపిడీ ద్వారా లభించిన సొత్తు అపారమైనది. శివాజీ పరిపాలనా కాలం చివరి వరకు అతని సాహచర్యం పొంది శివాజీ జీవితచరిత్రను క్రీ. శ. 1696 లో వ్రాసిన సభా సద్, శివాజీ మరణించిన 16 సంవత్సరాల తరువాత ఆ దోపిడిని గురించి ఇలా వర్ణిం చాడు. "అరవై అయిదు ఏనుగులు, నాలుగు వేల అశ్వాలు, పన్నెండు వందల ఒంటె లు, మూడు లక్షల రూపాయల విలువగల జవ్హేరీ, రెండు వేల బేళ్ల దుస్తులు, ఏడు లక్షల రూపాయల నగదుకు తోడుగా రకరకాల ఫిరంగులు, తుపాకులు ఆయుధాలు, ఇతరసాధన సమగ్రి స్వాధీనమయాయి.

శేసించిన అఫ్జల్‌ఖాన్ సైన్యం బీజాపూర్‌కు పలాయనమయింది. వాస్తవానికి మొఘల్ మరాఠా వ్యవహారంలో బీజాపూర్ తెలివితక్కువగా తలదూర్చింది. అందుకు జరిగిన ప్రాయశ్చిత్తం ఎంత అసల్పమైనది!"

ఈ సంఘటన మరాఠాల సుస్థితికి గొప్ప ఉత్తేజాన్ని గలిగించింది. శివాజీ సైనిక దళాల్లో ఒకటి ఆధునిక సతారా సాంగ్లే జిల్లాలను పన్హాల వరకుపోయి. దాని దక్షిణ సరి హద్దుల వరకు పురోగమించింది.[1] చిన్నదైనప్పటికీ సుసంఘటితమైన మరాఠా రాజ్యము స్పష్టరూపం దాల్చనారంభించింది.

---

[1] 'పోర్చుగీస్ మరాఠా సంబంధ్' పుట 44లో శివాజీకి వ్యతిరేకంగా పోర్చుగీసు వారి పాత్రను గురించి పిస్సూర్ లెంకర్ ఇలా అన్నాడు. శివాజీ 1659 జూలై లో జంజీరాకు చెందిన సిద్దీ లకు వ్యతిరేకంగా అశ్వికదళాన్ని, కాల్బలాన్ని పంపినాడు. ఈ కాలంలో చౌల్‌బాసీన్ల లోని పోర్చుగీసు దళాధిపతులు సిద్దీకి భోజన పదార్థాలు, ఇతర సహాయం వారు సహస్యంగా సహాయంచేయ సాగాడు. సుదీర్ఘమైన సిద్దీ, శివాజీల సంఘర్షణలో పోర్చుగీసువారు సిద్దీ లకు తోడ్పడినట్లు కూడా పిస్సుర్ లెంకార్ వ్రాశాడు.

# 3

## శివాజీ, షయిస్త ఖాన్

శివాజీ 1659 నవంబరు 28 న బీజాపూర్‌కు గర్వకారణమైన పన్హాలా దుర్గాన్ని స్వాధీనపరచుకొన్నాడు.

అప్పుడు బీజాపూర్ ఆస్థానం భయకంపితమయింది. ఆదిల్షా తనకు సహాయంగా సైన్యాన్ని పంపమని మొఘల్‌లను అర్థించాడు. స్వయంగా ఒక సైనిక దళాన్ని ప్రోగు చేసి రుస్తుంజమాన్ ఆధ్వర్యంలో పంపాడు. అఫ్జల్‌ఖాన్ కుమారుడు ఫజల్‌ఖాన్, మాలిక్ ఇతబార్, అజీజ్‌ఖాన్ కుమారుడు ఫతే ఖాన్, మాన్లైరావు ఘోర్పడే వంటి ఇతర నాయకులను అతని క్రింద పనిచెయ్యమని ఆజ్ఞాపించాడు.

శివాజీ సైన్యంలో అప్పటికే పేరుప్రతిష్ఠలను ఆర్జిస్తున్న నాయకుల పేర్లు ఇలా వున్నాయి. నెతాజీ పాల్కర్, భీమాజీ, హీరాజీ వాగ్ ఇత్యాదులు.

శివాజీ స్వయంగా రుస్తుంజమాన్‌కు వ్యతిరేకంగా పోరాటాన్ని నిర్వహించాడు. పన్హాలా వద్ద సాయుధ సంఘర్షణ జరిగింది. బీజాపూర్ సైన్యాలు చెల్లాచెదురై పారిపోయాయి.[1] జేధే శాకావళిలో క్లుప్తంగా 1660 జనవరి 16 తేదీ న (మాఘశుద్ధ 14 శక సం॥ 1581) ఈ క్రింది విధంగా రాసివుంది. "రుస్తుంజమాన్, ఫజల్ ఖాను శివాజీ తొ కొల్హాపూర్ సమీపంలో యుద్ధానికి తలపడ్డారు. శివాజీ 12 ఏనుగులను 2,000 గుఱ్ఱములను స్వాధీన పరచుకోగా, శత్రువులు పలాయితులయారు."

కొంకణ్‌లో మరాఠాల ప్రాబల్యం విస్తరించింది. రాజపూర్‌లో రెవింగ్టన్ రాజపూర్ గవర్నర్ తప్పించుకోవడానికి తోడ్పడినప్పుడు వారికి బ్రిటిషు వారితో తొలి సంపర్కం కలిగింది. చాలామంది బ్రిటిషు వ్యాపార ప్రతినిధుల నిర్బంధానికి ఈ సంఘటన దారితీసింది. త్వరలోనే ఈ వ్యవహారం సంతృప్తికరంగా పరిష్కారం అయింది. కాని దక్షిణాన కుడాల్ వరకు కొనసాగిన ఈ కొంకణ్ దండయాత్ర భూభాగాల శాశ్వత ఆక్రమణ రూపంలో ఫలించలేదు. పడమటి కనుమలకు ఎగువన మరాఠాలు అతానీ (ప్రస్తుతం బెల్గాం జిల్లాలోనిది) వరకు దాడులు చేశారు. శివాజీ (కొల్హాపూర్ సమీపం

---

[1] పరమానంద్, శివ భారత్, ప్రకరణం 24, శ్లోకం 24.

లోని) మిరాజ్ దుర్గాన్ని ముట్టడించే వరకు కూడా పురోగమించాడు. దుర్గంలోని రక్షణాదళం మొక్కవోని ధైర్యంతో దానిని కాపాడింది

### శివాజీకి వ్యతిరేకంగా సిద్దీ జౌహార్

ఈ లోపు శివాజీకి వ్యతిరేకంగా బీజాపూర్ మరొక ప్రయత్నం చేసింది. బీజాపూర్ ప్రభువర్గీయుడు (సలబత్‌ఖాన్ అను బిరుదు పొందిన) సిద్దీ జౌహార్ నాయకత్వం క్రింద చక్కని యుద్ధ సాధన సంపత్తిగల సైన్యాన్ని సమకూర్చటం జరిగింది. బీజాపూర్ సైన్యం 16.000 నుంచి 20.000 వరకు అశ్వికదళం 35.000 నుంచి 40.000 వరకు కాల్బలం కలిగివుంది. ఆ సైన్యం పన్హాలాను ముట్టడించింది. శివాజీ తన సైన్యాలను బీజాపూర్‌ను ఆవరించిన ప్రాంతాలకు పంపి, వాటిని కొల్లగొట్టడం ద్వారా శత్రువును లక్ష్యం నుంచి మళ్ళించడానికి చేసిన యత్నాలు ఫలించలేదు. బీజాపూర్ సైన్యం ముట్టడిస్తున్న పన్హాలా దుర్గం ముట్టడి దాదాపు 6 నెలల పాటు కొనసాగింది

శత్రువును మళ్లించడం ద్వారా ఆ దిగ్బంధనాన్ని వదిలించడానికి నేతాజీ పాల్కార్ నాయకత్వంలో జరిగిన దాడి ప్రయోజన శూన్యమైనది. ఆ ముట్టడి కొనసాగింది. ఢిల్లీ సింహాసనాన్ని పదిలంగా అధిష్ఠించిన ఔరంగజేబ్ తాను సింహాసనారూఢుడైన విషయాన్ని ప్రకటిస్తూ శివాజీని "షయిస్తఖాన్ ఆజ్ఞల ప్రకారం నడుచుకోవలసిందని, అతని ఆదేశాల నుంచి ఎన్నాడూ వైదొలగరాదని. నీవు వాగ్దానం చేసిన చర్యలను ఉత్తమమైన మార్గంలో నిర్వర్తించడానికి, నీ కోర్కెలను మన్నించడానికి వీలుగా పాటు పడమని" ప్రబోధించాడు

'ఆలంగీర్‌నామా' ఔరంగజేబ్‌ను గురించిన సాధికార జీవిత చరిత్ర. దాని వ్రాత ప్రతులను ఔరంగజేబ్ స్వయంగా చూశాడు. అతని మానసిక ధోరణులను గురించి ఆ గ్రంథం చెప్పినది "క్రమంగా బలపడిన శివాజీ బీజాపూర్ వారి పట్ల భయాన్ని గుర్తింపును వదలి వేశాడు. అతను కొంకణ్ ప్రాంతంలో స్వేచ్ఛగా విహరించి ధ్వంసం చేయడానికి పూనుకొన్నాడు. కొన్ని సందర్భాలలో అవకాశం దొరికినప్పుడు అతను చక్రవర్తికి చెందిన కొన్ని మహల్‌లను కూడ కొల్లగొట్టాడు. ఈ వార్తలు అందగానే చక్రవర్తి దక్కన్ సుబేదార్‌గా ఉన్న ప్రభుశ్రేష్ఠుడు ఆమీర్-ఉల్-మరా షయిస్త ఖాన్ ను పటిష్టమైన సైన్యంతో పురోగమించి, ఆ దుష్టుని అణచివేయుడానికి శ్రమించి, అతని భూభాగాన్ని కోటలను స్వాధీనం చేసికొని, ఆ ప్రాంతంలో ఎటువంటి అలజడులు లేకుండా చేయవలసిందని ఆజ్ఞాపించి ఆ ఆజ్ఞలను అనుసరించి ప్రభు శ్రేష్ఠుడు

అమీర్-ఉల్-ఉమరా జమాదిలాఖర్ 1660, ఫిబ్రవరి ఔరంగాబాద్‌ను వదలి పెట్టాడు. నాందేర్ సైన్యాన్ని ఫౌజ్‌దార్ అయిన ముఖ్తార్‌ఖాన్‌ను ఔరంగాబాద్ నగర గవర్నరుగా అతను నియమించాడు. జమాదిలాఖర్ నెల తొమ్మిదవనాడు 1660 ఫిబ్రవరి 11) అతను అహ్మద్‌నగర్ చేరాడు. ఫిబ్రవరి 25 న అహ్మద్‌నగర్‌ను వదలిపెట్టి అతను దక్షిణ దిశగా పురోగమించాడు. షయిస్తఖాన్ అప్పటికే బీజాపూర్‌తో సంపర్కం, పెట్టుకొన్నాడు. బీజాపూర్ ఆస్థానంలోని (మొఘల్) రాయబారి అమాన్, పదవీ భ్రష్టుడయాడు. అతని స్థానంలో షయిస్త ఖాన్ విశ్వాసాన్ని చూరగొన్న ఉద్యోగి మహ్మద్ సాదిక్ నియమితుడయాడు. అంతేకాక షయిస్తఖాన్ సిద్ధీ జౌహార్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగిస్తున్నాడు. అహ్మద్‌నగర్ నుంచి దక్షిణ దిశగా మరాఠాలు అడ్డగించారు. దౌండు, బారామతి, సుపా, సాస్వాద్ వద్ద ఒకరికొకరు తీసిపోని విధంగా యుద్ధానికి తలపడ్డారు. మొఘల్‌లు ముందుకు చొచ్చుకొనిపోగా షయిస్తఖాన్ 1660 మే 9 న పూనా చేరాడు. మొఘల్‌లు శీఘ్రంగా కొంకణ్ ప్రాంతాన్ని స్వాధీన పరచుకొన్నారు. కళ్యాణ్, భివాండీలు 1661 మే లో వారి చేజిక్కాయి. సలాబత్‌ఖాన్ ఆ ప్రాంతం పరిపాలనలో అతనికి తోడ్పడటానికి సామర్థ్యంగా అనేక ఉద్యోగులతో సహా తాల్ కొంకణ్ ప్రాంతానికి సైన్యాధికారి ఫౌజ్‌దార్‌గా నియమితుడయాడు. పడమటి కనుమలకు ఎగువన పూనా ప్రాంతం అదివరకే మొఘల్‌ల ఆధీనంలో చేరింది.

శివాజీతో ఎట్టి ఒప్పందాన్నీ, కుదుర్చుకోవలసిన ప్రశ్న ఉత్పన్నం కాలేదు. ఆ భూభాగం మొఘల్‌ల ఆక్రమణకు ప్రత్యక్షపాలనకు గురికానున్నది. బీజాపూర్ నుంచి స్వాధీన పరచుకొన్న పూనా కొంకణ్ ప్రాంతాలలో మొఘల్‌లు పాదుకొనిపోయి, వాటిని సుస్థిరంగా తమ ఆక్రమణ క్రిందికి తెచ్చుకోదలచారు. షయిస్తఖాన్ పూనాలో నివాసమేర్పరచుకొని ఆ ప్రాంతాన్ని పరిపాలించడం ఆరంభించాడు.

మొఘల్‌లు మైదాన ప్రాంతాలను భద్రంగా స్వాధీన పరచుకోగా దుర్గాలు అంతే పటిష్ఠంగా శివాజీ వశమయ్యాయి. ఆ దుర్గాలను స్వాధీనపరచుకొనువరకు మొఘల్‌ల ఆక్రమణ పూర్తిగాదు. పూనాకు ఉత్తరాన గల శివాజీ తాలూకు ముఖ్యమైన దుర్గం చాకన్‌ను పట్టుకోవడానికి షయిస్త ఖాన్ ససైన్యంగా వెళ్ళాడు. అది పర్వతదుర్గం కూడా కాదు. నేల కోటగా కూడా తక్కిన వాటితో పోల్చినప్పుడు, అది చిన్నది . మొఘల్ సైన్యం యావత్తూ దానికి వ్యతిరేకంగా గుమికూడింది. షయిస్తఖాన్ కూడా

---

[1] వై.కె. బుఖారీ, అన్‌నోన్ హిస్టారికల్, లెటర్స్ అఫ్‌షయిస్తఖాన్, జర్నల్ ఆఫ్ ది మధ్య ప్రదేశ్ ఇతహాస్ పరిషద్, సంపుటం 7, 1969.

ఆ ముట్టడిలో పాల్గొన్నాడు. అయినప్పటికీ, మరాఠాలు రెండు నెలలపాటు లొంగకుండా మహావీరుడైన ఫిరంగోజీ నర్సాలే నాయకత్వానికి రుణపడిపోరాడారు. ప్రతిపక్షంలో షయిస్తఖాన్ నాయకత్వం క్రింద భాసిస్తున్న మొఘల్ దళవాయీ సమూహము ముట్టడిలో నిమగ్నమైంది. మొఘల్ పక్షానికి చెందిన 268 మంది సైనికులు గాయపడటం, 640 మంది చనిపోవటం వంటి నష్టాలు కలిగిన తరువాత కోట ఈశాన్య మూల గల బురుజు తుపాకీ మందుప్రేలుడు వలన ధ్వంసమైన తరువాతనే దుర్గరక్షణ సైన్యం 1660 ఆగస్టు 15 వ తేదీన లొంగిపోవడానికి సిద్ధపడింది. వారు సగౌరవంగా వెళ్ళి పోవడానికి అనుమతి లభించింది. ఒకే ముట్టడిలో కలిగిన భారీ నష్టాల అనుభవం షయిస్త ఖాన్ ధృతిని చెఱచింది. ఆ గుణపాఠాన్ని నేర్చుకొనిన అతను ఇతర శివాజీ దుర్గాలపై దాడులు చేయకుండా పూనాకు మరలిపోయాడు.

జౌహార్ పన్హాల దుర్గంలో శివాజీని 1660 మార్చి నుంచి సిద్దీ ముట్టడించాడు. అది ఎటూ కదలడానికి వీలులేని దిగ్బంధనము. పరమానంద్ తన శివభారత్ కావ్యంలో మొఘల్‌ల చాకన్ ముట్టడి అదిల్షాకు సంతృప్తి కలిగించినప్పటికీ, అతని పన్హాలా ముట్టడి కోసరం ఒత్తిడి చేసినట్లు సూచించాడు. మొఘల్ బీజాపూర్ పక్షాల మధ్య అవగాహన సమన్వయం ఉన్నట్లు స్పష్టమవుతుంది. శివాజీ పన్హాలాను వదిలి పెట్టి రాజగఢ్‌కు వెళ్లడానికి నిర్ణయించాడు. మొఘల్ బీజాపూర్ పక్షాలు రెండుంటితోనూ ఏక కాలంలో పోరాడే స్థితిలో అతను లేడు. సిద్దీజౌహార్ యుద్ధకార్యకలాపాలనుంచి విరమించుకొన్నట్లు చేసేందుకు ఎఱవేసినట్లుగా, అతనితో సంప్రదింపులు ప్రారంభించాడు. వర్ష ఋతువును చీకటి రాత్రులను అవకాశంగా తీసుకొని 1660 జూలై 13 న శివాజీ పన్హాలానుంచి తప్పించుకొని పోయి, దానికి 64 కి.మీ. దూరంలో గల విశాలగఢ్ దుర్గానికి తిన్నగా వెళ్ళాడు. అతని 600 మంది సైనికులతో కూడిన చిన్నదళం అనుసరించింది.

శివాజీ తప్పించుకొని పోయిన సంగతి సిద్దీ జౌహార్‌కు తెలియగానే, అతను శత్రువును వెంబడించడానికి గణనీయమైన సైన్యాన్ని పంపాడు. విశాలగఢ్ దుర్గానికి వెళ్లే మార్గం సుమారు 9 కి.మీ. నిడివి వెడల్పు గల పీఠభూమి ప్రాంతం. దాని ప్రసిద్ధ నామం గజపూర్ ఖిండ్ లేక ఘోడ్ ఖిండ్ బీజాపూర్ సైన్యాలు తన వెంటపడకుండా నివారించడానికి ఆ పీఠభూమిపైన దృఢకాయులైన తన సైనికులను నిలబెట్టి శివాజీ విశాలఘడ్ వైపు వేగంగా సాగిపోయాడు. మరాఠా సైనికులు బీజాపూర్ సైన్యాలను ధైర్యంతో ప్రతిఘటించారు. వారి నాయకుడు బాజీ దేశ్‌పాండే ఆయుద్ధంలో ఘన కీర్తి ఆర్జించి, యుద్ధంచేస్తూ మరణించాడు. శివాజీ విశాల గఢ్‌చేరే వరకు బీజాపూర్

సైన్యాలను ఎదిరించినది. అతనే బాజీదేశ్‌పాండే పేరు మహారాష్ట్రలో ప్రతి ఇంటా తెలుసును. ఖిండ్‌పీతభూమి ఈనాడు సాధారణంగా, పావన్‌ఖిండ్ లేక పవిత్ర పీఠభూమిగా ప్రసిద్ధి చెందింది.

అదిల్షా తాలూకు కొంకణ్ మరాఠా నాయకులు శివాజీ విశాలఘడ్‌లో ప్రవేశించకుండా చేయడానికి యత్నించారు కాని, అతను వారిని తేలికగా ప్రక్కకు వదిలేసినాడు. ఆ దుర్గం సమీపం వరకు పురోగమించిన బీజాపూర్ సైన్యాలు భయపడి వెనుతిరిగాయి. తరువాత త్వరలోనే శివాజీ రాజగఢ్‌కు తిరిగి వెళ్ళాడు. అతను మొఘల్ లకు సంధి ప్రతిపాదనలు పంపినా ప్రయోజనంలేకపోయింది. కొంతకాలం తర్వాత శివాజీతో పోరాడిన రాజా జయసింగ్ ఆ ప్రతిపాదనలను తిరస్కరించి ఉండకూడదని భావించాడు. బీజాపూరుకు వ్యతిరేకంగా మొఘల్ కార్యకలాపాల్లో శివాజీ సేవలను వినియోగించి ఉండవలసింది. ఔరంగజేబ్‌కు జయసింగ్ వ్రాసిన లేఖ మొఘల్‌ల పట్ల శివాజీ అనుసరించిన వైఖరిని మనకు తెలియజేస్తుంది[1] "అతను (శివాజీ) పన్హాలా (పనాలా) దుర్గాన్ని స్వాధీన పరచుకొనేప్పుడు, అతను బీజాపూర్‌కు చెందిన అదిల్ ఖాన్ ఇరువురూ (మొఘల్) ఆస్థాన భృత్యులతో సంప్రదింపులు ఆరంభించగా, రాజ్యావసరాలు శివాజీ ముందుకు రావడానికి అనుకూలించినట్లయితే ఆదిల్‌ఖాన్ వ్యవహారాల నిర్వహణ సాధ్యపడేది."

ఆ విధంగా తిరస్కృతుడైన శివాజీ 1660 సెప్టెంబర్‌లో పన్హాలా దుర్గాన్ని అలీ ఆదిల్‌ఖాన్‌కు తిరిగి అప్పగించడం ద్వారా అతనిని సమాధాన పరచాడు. అయితే ఆదిల్షా రాజ్యం మధ్య దక్షిణ కొంకణ్ భూభాగాలపై శివాజీ కన్ను వేశాడు. మొఘల్‌ల ఒత్తిడి క్రమంగా పెరుగుతున్నందుకు యుద్ధాన్ని కొనసాగించడానికి గాను శివాజీ, ఆర్థిక వనరులను విధిగా సమకూర్చు కోవలసిన అవసరం కలిగింది.

బీజాపూర్ మొఘల్‌లకు పరెండా తదితర దుర్గాలను అప్పగించడానికై 1657 ఆగస్టు నాటి సంధిలో పేర్కొన్నట్లుగా అంగీకరించడమైంది. ఔరంగజేబ్ ఉత్తర భారత వ్యవహారాలలో నిమగ్నంకాగా దుర్గాల అప్పగింతను బీజాపూర్ వాయిదా వేసింది. ఇప్పుడు షయిస్త ఖాన్ పరెండా దుర్గపు బీజాపూర్ సైన్యాధికారిని అవినీతిగా లోబరచుకొని 1660 నవంబరు 20 న దానిని స్వాధీనపరచుకొన్నాడు. మొఘల్‌లు పరెండాను ఆక్రమించడం పట్ల ఆదిల్షా నిరాశచెంది వుండక మానదు.

---

[1] జగదీష్ నారాయన్ సర్కార్, ది మిలటరీ డిస్పాచస్ ఆఫ్ సెవెన్‌టీన్త్ సెంచరీ ఇండియన్ జనరల్, పుట 76, సైంటిఫిక్ బుక్ ఏజన్సీ, కలకత్తా, 1969.

## కొంకణ్ జైత్రయాత్ర

పశ్చిమ కనుమలకు ఎగువన మొఘల్‌లు మైదాన ప్రాంతాలను ఆక్రమించుకున్నారు. ఆ కనుమలకు దిగువనగల కోటలు శివాజీ వశమయ్యాయి. మొఘల్‌లు కల్యాణ్-భివాండీ ప్రాంతంలోని ఒక భాగాన్ని స్వాధీనం చేసికోగలిగారు. ఈ ప్రాంతానికి దక్షిణంగా రాయగఢ్ దుర్గం కలుపుకొని, (ప్రస్తుతం కొలాబా జిల్లాలోని) శివాజీ అధీన ప్రాంతాలు ఉండేవి. మొఘల్‌లు శివాజీని మరింత దక్షిణదిశగా నెట్టివేసేందుకు ప్రయత్నించారు. అట్టి దండయాత్ర ఒకదానికి షయిస్తఖాన్ సైనికోద్యోగి కర్తాలాబ్ ఖాన్ నాయకత్వం వహించాడు. కర్తలాబ్ ఖాన్ 1660 చివరి భాగంలో గణనీయమైన సైన్యసమేతంగా లొనావాల సమీపంలో పడమట కనుమల నుంచి క్రిందికి దిగాడు. వారు దట్టమైన అరణ్యంలో ప్రవేశించేవరకు శివాజీ మిన్నకున్నాడు. ఆ అడవి తొమ్మిది కిలో మీటర్ల పొడవుగలది. ఆ ప్రాంతంలో గల అంబర్ అనే గ్రామం పేరును బట్టి ఆ పర్వత కనుమకు అంబర్‌ఖిండ్ అనే నామం కలిగింది.

కవి పరమానంద్ అంబర్‌ఖిండ్ వద్ద జరిగిన యుద్ధాన్ని సవిస్తరంగా వర్ణించాడు. శివాజినాయకత్వంలోని మరాఠాలు దాగి ఉండి, అకస్మాత్తుగా మొఘల్‌ల పై దాడిచేశారు. ఇరు పక్షాలు పట్టువదలకుండా పోరాడాయి. ముందుకు సాగడానికి లేక వెనుకకు మళ్ళడానికి వీలులేని పరిస్థితులలో కర్తలాబ్ ఖాన్ దయచూపమని అర్థించాడు. శివాజీ కర్తలాబ్ ఖాన్ సైన్యాల తాలూకు యావత్తూ ఆయుధ సామాగ్రిని స్వాధీనపరచుకొని, (రణరంగంనుంచి) వెళ్లిపోయేందుకు అనుమతించాడు.

ఆ దండయాత్ర మొఘల్‌లకు అపజయంగా, పరిణమించింది. 'మరాఠా చరిత్ర' జేధేశాఖావళి, ఆ యుద్ధం 1661 ఫిబ్రవరి ప్రారంభంలో జరిగినట్లు తెలియజేస్తున్నది. ఆ యుద్ధాన్ని గురించి పర్షియన్ చరిత్రలు ప్రస్తావించలేదు. అవి దానిని మొఘల్ దండయాత్రలలో మొఘల్‌లకు స్వల్ప సంఘటనగా పరిగణించి వుండవచ్చు. తరువాత శివాజీ తన సైన్యాలను రెండుగా విభజించాడు. నేతాజీ పాల్కర్ నాయకత్వంలోని ఒక సైనికవి భాగం మొఘల్‌లకు పని కల్పించింది. మరొక సైనిక దళం శివాజీ స్వీయ నాయకత్వంలో దక్షిణదిశగా అదిల్షాకు చెందిన కొంకణ్ భూభాగంవైపు పురోగమించింది.

శివాజీ పురోగతి వర్ణనాతీతమైనది. దాభోల్, పాలీ, సంగమేశ్వర్, చిప్లాన్, రాజపూర్ ఇత్యాది ముఖ్య పట్టణాలు అతని హస్తగతం కాగా, వాటి నుంచి మొఘల్‌లతో యుద్ధం కొనసాగించడానికి అవసరమైన గణనీయమైన సంపద లభించింది. చిన్న మరాఠా మొఖాసాలు పాళి, శృంగార్‌పూర్‌లను తుడిచిపెట్టి, వాటిని శివాజీ తన రాజ్యంలో

చేర్చుకున్నాడు. శృంగార్ పూర్ 1661 ఏప్రిల్ 29 న పతనమైంది అతను 1661 నాటి గ్రీష్మఋతువును కొంకణ్‌లోని వర్ధన్‌గఢ్‌లో గడిపాడు.

రాజపూర్ వద్ద బ్రిటిషు వారి జోక్యం శివాజీ అననుకూల దృష్టిని ఆకర్షించింది. వారు అవివేకంగా పన్హాలా ముట్టడిలో సిద్దీ జౌహారుకు మందుగుండు సామాగ్రిని సరఫరా చేశారు. అందుకుగాను హెన్రీ రెవింగ్టన్, రిచర్డ్ టేలర్, రాండాల్ఫ్ టేలర్, ఫిలిప్ గిఫ్ఫర్డ్‌లను నిర్బంధించి. వారిని మొదట వాసోటాలో, (ప్రస్తుతం సతారా జిల్లాలోనిది) తరువాత (కొలాబా జిల్లాలోని) సోన్‌గడ్ దుర్గంలోని కారాగారంలో వుంచారు. వారు 1663 ఫిబ్రవరిలోనే విడుదలయారు.

షయిస్తఖాన్ దక్కన్‌కు విచ్చేసిన తర్వాత త్వరలోనే పశ్చిమ కనుమలకు దిగువనగల కొంకణ్ ప్రాంతానికి దండయాత్రగా సైన్యాలు బయలుదేరాయి మైదాన ప్రాంతాలను మొఘల్‌లు ఆక్రమించగా, కళ్యాణ్-భివాండీ ప్రాంతంలోని పట్టణాలు స్వాధీనంకాకుండా పోరాడాయి. అవి 1661 మే లో లొంగిపోయాయి. మరాఠాల అధీనంలోని మాహులీ, కర్నాల వంటి దుర్గాలను శత్రువులు స్వాధీనంచేసుకోలేకపోయారు. వారు (కొలాబా జిల్లాలోని) దేవ్రీసి 1661 ఆగస్టులో ముట్టడించారు. కాని ఘోరమైన పోరాటం జరిగిన తరువాత వారు యుద్ధరంగం నుంచి వెనుకకు మరలి పోవలసి వచ్చింది.

ఆదిల్షాకు చెందిన కొంకణ్‌లోని అధికభాగాన్ని శివాజీ సమర్థవంతంగా ఆక్రమించిన వాస్తవాన్ని అలక్ష్యం చెయ్యడానికి వీలులేకపోయింది. మొఘల్‌లు తన సరిహద్దులకు సమీపించటాన్ని గురించి ఆదిల్షా పునరాలోచన చేశాడు. శివాజీ కొంకణ్‌ను ఆక్రమించడాన్ని గురించి సాధ్యమైనంత మర్యాదగా వ్యవహరించవలసివచ్చింది. శివాజీ గవర్నర్ పిలాజీ నీల్‌కంఠ్ 1661 ఆగస్టు 3వ తేదీన వ్రాసిన లేఖ కొంకణ్ పై శివాజీ హక్కులకు గుర్తింపులభించినట్లు తెలియజేస్తున్నది. రాజపూర్ నుంచి బ్రిటిష్ వారు 1662 ఫిబ్రవరిలో సూరత్‌కు వ్రాసిన లేఖలు ఇలా వెల్లడిస్తాయి. "రాజు శివాజీకి ఉత్తర్వు (ఫర్మాన్) ద్వారా అతని స్వాధీనంలో గల రాజపూర్ మొదలైన జనపదాలను వాటి నుంచి చేకూరే ప్రయోజనాలను అనుభవించేందుకు ఇచ్చివేసినట్లు నిశ్చయమైనది. ఇది ఇంకనూ రాజు అధీన ప్రాంతాలలోనిదే. శివాజీ అతని అధీనుడే?"

మొఘల్‌లు 1662 నాటికి మైదాన ప్రాంతాలను సమర్థవంతంగా తమ ఆక్రమణ క్రిందకు తెచ్చుకోగలిగారు. దుర్గాలు భద్రంగా శివాజీ ఆధీనంలోకి వచ్చాయి. మొఘల్‌లు మైదాన ప్రాంతాలలోను, శివాజీ దుర్గాలలోనూ నెలకొన్నందున విజయం ఎవరికీ సిద్ధించని స్థితి ఏర్పడింది. షయిస్త ఖాన్, చక్రవర్తికి తీవ్ర అసంతృప్తిని కల్గించ

నట్లుగా, తగిన మేరకు పాటుపడటం లేదని సుస్పష్టమైనది. అతనికి తోడ్పడటానికి 1661 లో మహరాజా జస్వంత్ సింగ్ విచ్చేసినప్పటికీ, పరిస్థితుల్లో గణనీయమైన మార్పు రాలేదు.

మరాఠా దుర్గాలను తాకకుండా మొఘల్‌లు ప్రయోజనశూన్యమైన దాడులు చేయ సాగారు. ఒక చక్కని ఉదాహరణను 1662 జనవరి 26 వ తేదీనాటి వార్తల నుంచి ఇక్కడ పొందుపరచవచ్చు: "పూనాకు 40 మైళ్ళ దూరంలో గల లోహగఢ్, ఇతర దుర్గాలకు దిగువభాగంలో ఆ నీచుడైన శత్రువుకు చెందిన గ్రామాలు ఉన్నట్లు వార్తలు అందాయి. సుబేదార్ (షయిస్తఖాన్) 11వ తేదీ గురువారం నాడు ఈ గ్రామాల వైపు నామ్‌దర్‌ఖాన్ తదితర మన్సబ్‌దార్‌లను పంపినాడు. నాందర్ ఖాన్ అదే రోజున ఈ గ్రామాలను సమీపించాడు. దారి ప్రక్కల ఉన్న సుమారు 70 లేక 80 గ్రామాలను అతను తగుల బెట్టాడు. ధాన్యం ఇతర వస్తువులను అతను నాశనం చేశాడు. తర్వాత తికోనా దుర్గం దిగువున అతను మజిలీ చేశాడు. గ్రామాల ప్రజలు వారి పశువులను వస్తుసామాగ్రినీ, పర్వత ప్రదేశాలకు చేరవేశారు. నామ్‌దర్ ఖాన్ మరునాడు కూడా ఆ స్థలంలో బసచేశాడు. గ్రామీణులు వెంటపడటానికి తన సహాయకులను అతను పంపా డు. వారు పర్వతాలపైకి వెళ్లి ఒక వేయి పశుగణాన్ని 300 మంది స్త్రీ,పురుషులను వశపరచుకొన్నారు. మూడవరోజున నామ్‌దర్ ఖాన్ ఆ స్థలాన్ని వదలి పెట్టాడు. లోహగఢ్, ఐశాపూర్ తికోనా, తుంగి దుర్గాల మధ్యగల గ్రామాలను అతను తగులబె ట్టాడు. తరువాత అతను తిరిగి పోయాడు."

శివాజీ మొఘల్‌లతో నిర్విరామమైన పోరాటాన్ని కొనసాగించాడు. తన ప్రాణా లను మొఘల్‌ల నుంచి కాపాడటానికి ఆయన తీసుకొన్న ముందు జాగ్రత్తలు 1662, అక్టోబర్ 23 తేదీనాటి ఈ క్రింది లేఖలో విశదమయాయి. "రోహిద్‌ఖోర్‌కు చెందిన సర్జేరావ్‌జేధే దేశ్‌ముఖ్‌కు : మొఘల్ దాడులు నీ ప్రాంతంలో సంభవమని వార్త అందిం ది. ఈ ఉత్తరం చేరినవెంటనే, తాపాలోని అన్ని గ్రామాలకు నువ్వు హెచ్చరిక జారీ చేయాలి. రైతుల (ప్రజలు) నందర్ని పశ్చిమ కనుమలకు దిగువనగల సురక్షిత స్థలా లకి పంపివేయి. శత్రువు వారికి హాని చేయలేని స్థలాలకు వారిని పంపు. ఈ విష యాల్లో ఆలస్యం చేయరాదు. ఈ లేఖ ప్రకారం వెంటనే నడచుకో. నీ కర్తవ్య నిర్వహణలో లోపం జరిగి, మొఘల్‌లు ప్రజలను నిర్బంధించి వెంట తీసుకొనిపోయి నట్లయితే, ఆ నింద అంతా నీపైన పడగలదు. నీ గ్రామాలను అహోరాత్రులు సంద ర్శించి కనుమలకు దిగువనగల తగు ప్రదేశాలకు. ప్రజలను పంపు. ఈ పనులను. నెరవేర్చుటలో ఒక గంటకాలం కూడా ఆలస్యం చేయరాదు. మెలకువగా ఉండవల

సింది. పొలాలను కాపలా కాయుటకు కొందరు ప్రజలు ఉండిపోవచ్చు. వారిని కొండలలోని సురక్షిత స్థలాల్లో ఉండమని చెప్పు. మొఘల్‌లను వారు దూరాన చూపినట్లయితే దాడిజరిగే మార్గం నుంచి వారు పారిపోవాలి. మెలకువగా ఉండుము."

శివాజీ కొంకణ్‌ను పటిష్టంగా ఆక్రమించినట్లు ఇంగ్లీష్ (వ్యాపార కేంద్రాల) పట్టీ పుస్తకాలు మనకు తెలియజేస్తాయి. "దండారాజపురి (కొలాబా జిల్లాలోని జంజీరా) నుంచి దక్షిణాన గల ఖరేపటాన్ వరకుగల భూభాగానికి అతను ప్రమాదాన్ని కలిగించి, మరుసటి వర్షఋతువులో గోవా వరకు గల ప్రాంతాన్ని వశపరచుకొనడం ద్వారా (దానిని) పరిష్కరించాడు."

బీజాపూర్ తన సరిహద్దుల వద్ద అధిక సంఖ్యలో మొఘల్ సైన్యం ఉనికిపట్ల హెచ్చుగా సంతసింపలేదను దానికి సాక్ష్యం 1663 మార్చి నెల 30 నాటి ఇంగ్లీషు పట్టీ పుస్తకాలలో నమోదై ఉన్నది. శివాజీ సేనాని నేతాజీ పాల్కర్‌ను తరుముతూ మొఘల్‌లు బీజాపూర్‌కు కొద్ది మీటర్ల దూరం వరకు వచ్చి చేరారు. కాగా అదిల్షా భయపడి బంకాపూర్‌కు తరలి పోగా అప్పుడు రుస్తుంజమాన్ మొఘల్‌లు వెనుకకు తిరిగిపోయేటట్లు నచ్చచెప్పి, నేతాజీ సురక్షిత స్థలం చేరుకొనునట్లు చేయగలిగాడు. అతని కదలికలను నిశితంగా, శివాజీ మొఘల్‌లకు వ్యతిరేకంగా కొనసాగిస్తున్న పోరాటాన్ని ఎంతో సానుభూతి పూర్వకంగా బీజాపూర్ గమనిస్తున్నట్లు సుస్పష్టం.

ఈ బాభాగంలో గల మరాఠా దుర్గాలను పట్టుకోవడంలో షయిస్తఖాన్‌కు కలిగిన వైఫల్యం ఒక గొప్ప పొరపాటు. మొఘల్‌ల బంగారాన్ని వినియోగించి శివాజీ అనుచర వర్గాలలో విశ్వాసఘాతుకత్వాన్ని ప్రేరేపించడంపై అతను ఆధారపడ్డాడు. కానీ అతని ప్రయత్నాలు గుర్తింపతగిన మేరకు జయప్రదం కాలేదు. కనుక ఆ విధంగా ఆధారపడటం తప్పు. మొత్తం మీద పీష్వా మోరోపంత్ నుంచి సామాన్య సైనికుని వరకు విశ్వసనీయులైన మరాఠాలు హృదయపూర్వకంగా శివాజీని సేవిస్తూనే ఉన్నారు. అతని పక్షాన్ని త్యజించిన సంఘటనలు లేకపోలేదు. కానీ అవి స్వల్పంగా, చెదురుమదురుగా మాత్రమే సంభవించాయి.

షయిస్తఖాన్ పరిపాలకుడుగా ఉత్తమ గుణ శీలుడు. దయ ధర్మబుద్ధి, భావౌన్నత్యం, ప్రజా శ్రేయస్సుపట్ల శ్రద్ధ అతనికి గల మంచి లక్షణాలు. ఔరంగాబాదు వద్దగల మొఘల్ ఫిరంగీ దళంలో గణకోద్యోగి కుమారుడు సమకాలీన రచయితయిన భీమసేన్ సక్సేనా 'తారీఖే దిల్‌కుషా' అనే తన స్వీయచరిత్రలో మనకు తెలియజేస్తున్నాడు: "షయిస్త ఖాన్ పూనాలో నివాసం ఏర్పరచుకొన్నాడు. ఆ ప్రాంతంలో శాంతిని నెలకొల్పి దానిని యథాస్థితికి తెచ్చేందుకు అతను కృషి చేశాడు. ధాన్యం

ఇతర వస్తువులు ఆ ప్రాంతంలో అతి చౌకగా లభ్యమయ్యేవి. రెండు, షాజహానీ మణుగుల గోధుమ ఒక రూపాయకే అమ్మేవారు. సైనికులు రైతులు సంతుష్ట జీవనం గడిపారు. షయిస్తఖాన్ ఉద్యోగులు ఎంతో మర్యాదతో ప్రవర్తించే వారు కనుక, షయిస్త ఖాన్ ఉదారగుణాలను తేలికగా ఊహించ వచ్చు... ఇదే కాలంలో పూనాలో (షయిస్తఖాన్ మేనల్లుడు) జాఫర్‌ఖాన్ కుమారుడు అయిన కామ్‌గర్ ఖాన్‌కు పరీబేగంతో వైభవోపేతంగా వివాహ నిశ్చయం అయింది. వివాహ వేడుకలు ముగిసిన తరువాత జాఫర్‌ఖాన్ పూనా వదలి వెళ్లాడు. అతనితో షయిస్తఖాన్, 'ఫిరంగిదళం ముషారఫ్ (భీమసేన్ తండ్రి) ఔరంగాబాద్‌లో సైనిక దళాలను సమకూర్చాడు. నీవు వాటిని తనిఖీచేసి, పూనాకు పంపు' అని చెప్పాడు. షయిస్తఖాన్ పూనాలోనే ఉన్నాడు. స్వీయ నివాసానికి అతను ఒక పెద్ద భవనాన్ని నిర్మించుకున్నాడు. శివాజీ తెలివితేటలను, బుద్ధి సూక్ష్మతను ఎత్తుగడలను గురించి షయిస్త ఖాన్‌కు ఏ మాత్రం అవగాహన లేదు. అతను అలక్ష్య వైఖరితో కాలం గడుపసాగాడు. శివాజీ వనరులు పరిమితమైనప్పటికీ అతను మొఘల్‌లతో పోరాడుతునే ఉన్నాడు. అతని వనరుల దృష్ట్యా తలపెట్టి గలవాటికంటె అతని దాడులు సాహసోపేతమైనవి. తన వేగుల ద్వారా శివాజీ షయిస్తఖాన్ విడిదికి, ఆ విడిదికి చెందిన అంగడి వీధులకు, రహదారులకు ప్రక్కదార్లకు సంబంధించిన సమాచారాన్ని వీలైన మేరకు శివాజీ సంపాదించాడు."

భీమ్‌సేన్ షయిస్తఖాన్‌కు మేనల్లుడు, పురోగామి దళాధిపతి అయిన నామ్ దర్ ఖాన్ మధ్య జరిగిన సంభాషణలను, పూసగుచ్చినట్లు చెప్పాడు. దానికి భీమ్ సేన్, తరువాత నాందర్‌ఖాన్ జస్వంత్ సింగ్‌లతో పరిచయాన్ని సంపాదించాడు. కనుక ప్రామాణికమైన ఆధారాల ద్వారా సేకరించి వుండవచ్చు. భీమ్‌సేన్ నమోదుచేసిన సంభాషణ ఈ విధంగా ఉంది: "మంత్రి జాఫర్ ఖాన్ కుమారుడు నామ్‌దర్ ఖాన్ షయిస్తఖాన్ పురోగామి దళంలో ఒక అధికారి. అతను షయిస్త ఖాన్‌తో మన సైన్యం నిస్సహాయస్థితిలో పడినట్లుగా శివాజీకీ లేవు. నా ఆధ్వర్యంలో గణనీయమైన సైన్యాన్ని ఉంచినట్లయితే నేను, శివాజీని పట్టుకోగలను."

"షయిస్తఖాన్ (అందుకు), 'నేను శివాజీకి వ్యతిరేకపోరాటాన్ని ముగించినట్లయితే, చక్రవర్తి చేతుల్లో కాందహార్ దండయాత్ర మాత్రమే మిగిలిఉంటుంది. కాందహార్ దండయాత్రలో పాల్గొనడానికి నీవు సిద్ధంగా ఉన్నట్లయితే శివాజీ వ్యతిరేక పోరాటాన్ని ముగించటానికి నాకు అభ్యంతరం లేదు. ఈ పోరాటం స్వల్పకాలంలోనే ముగించవచ్చు కాని కాందహార్‌పై దండయాత్రను తలపెట్టినట్లయితే, ఈ సైన్యాన్ని తగ్గించాలి. మనం ఈ బాధ్యతను ఎందుకు తీసుకోవాలి? (శివాజీకి వ్యతిరేక) పోరా

టాన్ని త్వరగా ముగించకుండా కొనసాగించటమే మంచిది. మన కార్యకలాపాలు ఈ మార్గంలో కొనసాగాలి "

పైన పేర్కొన్న దానిపై వ్యాఖ్యానించడం అనవసరం.

శివాజీ స్థితి ఏమాత్రం సంతోషప్రదంగా లేదు. అతను మొఘల్‌లు పూనా ప్రాంతం నుంచి వైదొలగునట్లు చేయాలి. లేదా వారితో రాజీపడి పూనా ప్రాంత దుర్గాలనుంచి తన బలాలను ఉపసంహరించి దక్షిణ కొంకణ్‌ను భవిష్యత్తులో తన (కార్యకలాపాల కు) ఆధారం చేసుకోవాలి పోరాటం లేకుండా అతనాపనిని చేయాలి శివాజీ అనుచ రులలో ద్రోహాన్ని విశ్వాసఘాతుకత్వాన్ని మొఘల్‌లు ప్రోత్సహించసాగారు. సింహ గడ్ వద్దగల మరాఠా దుర్గరక్షణ దళంలో ఒక భాగం మొఘల్‌ల ప్రభావానికి లొంగి పోయి నాదర్ ఖాన్ దండయాత్రను ఎదుర్కొనడానికి, కొంకణ్‌లో శివాజీ పురోగ మనం వాయిదా పడడానికి కారణమైనట్లు సాక్ష్యంవుంది.

## ఒకసాహస కృత్యం

ఆ సమయంలో మొఘల్‌లను గందరగోళ స్థితిలో పడవేయగల ఒక సాహసకృ త్యాన్ని చేయవలసిన అవసరం కలిగింది. కాగా 1663, ఏప్రిల్ 5 నాటి నిశీథంలో శివాజీ షయిస్త ఖాన్ శిబిరంపై సాహసవంతమైన దాడి చేశాడు ఆ దాడి జయప్రద మైనది. షయిస్త ఖాన్ తన చేతి వ్రేళ్ళను పోగొట్టుకొని ప్రాణాలతో బయటపడటం గగనమయిపోయింది. అతని కుమారుడు అబుల్‌ఫతా హతుడయాడు. (మొఘల్ పక్షం లో) చనిపోయిన, గాయపడిన వారి సంఖ్య 50 దాటింది. శివాజీ కూడా షయిస్తఖాన్ శిబిరంనుంచి బయటపడ్డాడు.

ఈ సాహస కృత్యం దేశంలో నలుమూలలా మరువరాని సంచలనాన్ని కల్గించి నది. సాధికార పర్షియన్ చరిత్ర "అలంగీర్‌నామా" ఆ రాత్రి జరిగిన దాడి గురించి షయిస్త ఖాన్ జాగ్రత్తగా వ్యవహరించనందుకు చక్రవర్తికి కల్గిన ఆగ్రహాన్ని గురించి సూచన ప్రాయంగా తెలియజేసింది. భీమ్‌సేన్ సక్సేనా పినతండ్రి శ్యాందాస్, షయిస్త ఖాన్ జీతభత్యాల అధికారి బక్షీకి వ్యక్తిగతమైన గుమస్తాగా ఉన్నందున దాడి జరిగిన రాత్రి షయిస్తఖాన్ శిబిరంలోనే ఉన్నాడు. భీమ్‌సెన్ తండ్రి ఔరంగాబాద్‌లో రాజోద్యో గి. మరొక చరిత్రకారుడు క్వాఫీ ఖాన్ ఆ సంఘటన వృత్తాంతాన్ని తన తండ్రి చెప్పిన విధంగా నమోదు చేశాడు. ఆ సమయంలో క్వాఫీ ఖాన్ తండ్రి పూనాలో ఉండటం సంశయాస్పదమైనప్పటికీ క్వాఫీ ఖాన్ వ్రాసిన వృత్తాంతం మరాఠీ చరిత్రలో బేధే చరిత్ర, సభాసద్ వ్రాసిన జీవిత చరిత్ర గమనార్హమైనవి మిగతా ఆధారాలు అతిశ

యోక్తులతో నిండివున్నాయి. యూరోపియన్ల పట్టీ పుస్తకాలు పుక్కిటి పురాణాలపై ఆధారపడ్డాయి. భీమ్ సేన్ తన స్వీయచరిత్రలో రాసినది ఇలా ఉంది. "ఒక రోజు (1663, ఏప్రిల్, 5 ) శివాజీ యుద్ధానుభవంలో 200 సైనికులతో కూడిన దళం వెంట రాగా కాలినడకన 40 మైళ్ళు పయనించాడు. రాత్రివేళ (షయిస్తఖాన్) శిబిరాన్ని సమీపించాడు. జస్వంత్‌సింగ్ శిబిరానికిసంబంధించిన బజార్ ప్రక్కగా వెళ్ళి, షయిస్త ఖాన్ ఉన్న స్థలాన్ని సమీపించాడు. అంతః పురంలో ఖాన్ (జనానా) ఉండే భవనం గోడను బద్దలు కొట్టాడు అతని సహచరులలో ఇద్దరు ముగ్గురు భవనంలోకి ప్రవేశించారు. శివాజీ వారిని అనుసరించగా, 10 మంది సైనికులు అతని వెంట వెళ్ళారు. గోడను కూలద్రోసి కొందరు వ్యక్తులు భవనంలోకి ప్రవేశించినట్లు ఒక దాసి షయిస్త ఖాన్‌కు తెలియజేసింది. అప్పుడు షయిస్త ఖాన్ తన పడక గదిని వదలి వరండాలోకి వెళ్ళాడు. అది చీకటి రాత్రి. లోపల ఎవరు ప్రవేశించాలో తెలిసికోవడం సాధ్యపడలేదు. లోన చొరబడిన వారు షయిస్త ఖాన్‌పై దాడి చేసినారు. అతనికి రెండు గాయాలు తగిలాయి. ప్రక్కన ఉన్న కచేరీ గదిలో దీపాలు వెలుగుతున్నాయి. షయిస్త ఖాన్ తమ్ముడు అబుల్‌ఫతా అక్కడ నిద్రపోతున్నాడు. అతనిని షయిస్త ఖాన్‌గా తలచి, దాడిలో పాల్గొన్నవారు ఆ యువకుని పైబడి అతనిని హతమార్చారు. వారు అతని తలను మొండెం నుంచి వేరుచేసి వెంట తీసుకొని పోయారు."

ఆ సమయంలో షయిస్తఖాన్ కలత చెందిన మనస్సుతో కచేరీ గది ఆవరణంలోకి వెళ్ళాడు అతను కొంతమంది సైనికులను భవనంలోకి పంపాడు. కొంత సేపు పోరాటం జరిగింది. శివాజీ సురక్షితంగా వెనుకకి మరలాడు."

భీమ్‌సేన్ తరువాత చెప్పినది: "అప్పటి వరకు ఏ రాజు కూడా మొఘల్ సేనానులకు వ్యతిరేకంగా ఈ విధంగా పోరాడలేదు. అట్టి సాహసాన్ని ప్రదర్శించలేదు." శివాజీ సాహసానికి అనుకోని విధంగా లభించిన ఈ పొగడ్త దేశంలో వ్యాపించిన అభిప్రాయానికి మచ్చుతునక అనడంలో సందేహంలేదు. ఈ వ్యవహారంలో జోధ్‌పూర్ మహారాజు జస్వంత్ సింగ్ పాత్రను గురించి తర్వాత కొలది కాలం అతని సేవలో ఉన్న భీమ్‌సేన్ జాగ్రత్త వహించడాన్ని అర్థం చేసికోవచ్చు. అతను చెప్పిన మాటలు పేర్కొనదగినవి: "శివాజీ సాహసం వెనుక జస్వంత్ సింగ్ ప్రోద్బలం ఉండి ఉంటుందని జనులు భావించారు. ప్రజాభిప్రాయానికి కారణం ఇది: షయిస్త ఖాన్ షాజహాన్ ఆస్థానంలో ఉండేవాడు. అప్పటి నుంచి మొఘల్ ఆస్థానంలో జరుగుతున్న వాటికి గురించి అతను ఔరంగజేబ్‌కు నివేదికను పంపుతుండేవాడు. ఔరంగజేబ్ సింహాసనారూఢుడు కావటానికి దారి తీసిన పరిస్థితులు షయిస్త ఖాన్ సృష్టిం

చినవే. జస్వంత్‌సింగ్. తనను షాజహాన్ శ్రేయోభిలాషిగా. పరిగణించు కొంటుండే
వాడు అందుచేత. తన స్వభావాన్ని ప్రదర్శించుకొని అతను షయిస్తఖాన్‌కు అవ
మానాన్ని తెచ్చి పెట్టాడు" భీమసేన్ వివేక వంతమైన వ్యాఖ్యానం ఇది: "నిజం
భగవంతునికే ఎరుక!" జస్వంత్ సింగ్‌కు శివాజీతో గల సంబంధాలను పరిగణించి
నట్లయితే. (ఈ వ్యవహారంలో) ప్రేరణకు. లేక కుట్రకు అవకాశంలేదు. కానీ శిబిరం
భద్రత విషయంలో జస్వంత్‌సింగ్ అపరాధంగా ఎన్నదగిన అలక్ష్యాన్ని చూపించా
డనే నిందకు పాత్రుడు.

షయిస్తఖాన్ ఔరంగబాద్‌కు తిరిగిపోయాడు. అయితే సైన్యం జస్వంత్‌సింగ్
ఆధిపత్యంలో పూనాలోనే ఉండిపోయింది విజయోత్సాహంతో నిండిన శివాజీ 1663
ఏప్రిల్ మధ్య భాగంలో దక్షిణ కొంకణ్ లోకి ససైన్యంగా వెళ్ళాడు. మే నెల ప్రారం
భంలో, అతను కుడాల్‌ను వశపరచుకొన్నాడు డచ్‌వారి సమాచారం ప్రకారం ఈ
దండయాత్రలో అతను 4.000 అశ్విక దళాన్ని. 10.000 కాల్బలాన్ని వెంట తీసు
కొని వెళ్లాడు దక్షిణ కొంకణ్‌లోని ఫోండా వద్దగల బీజాపూర్ అధికారులు స్థానిక
పాలకుల సహాయంతో. కుడాల్ నుంచి సావంత్ వాడీ అనే ప్రభువుకు చెందిన కుడాల్
పరిసర ప్రాంతాలనుంచి శివాజీని వెళ్ళగొట్టేందుకు ప్రయత్నాలు చేశాడు. కానీ అవి
ఫలించలేదు. జూన్ మాసాంతానికి శివాజీ తన రాజధాని రాజగఢ్‌ను చేరుకొన్నాడు

మొఘల్‌లకు వ్యతిరేకంగా శివాజీ ధైర్యంతో సాగించిన పోరాటం అతని పొరుగు
వారి మనస్సుల్లో నాటుకొని పోయింది శివాజీతో సత్సంబంధాలు కలిగిఉండటం
రాజనీతి సమ్మతంగా ఉంటుందని భావించసాగారు. గోవాలోని పోర్చుగీసు రాజప్రతి
నిధి ఉత్తర కొంకణ్‌లోని తన గవర్నర్‌కు 1663 మే 5 వ తేదీన ఈ క్రింది విధంగా
లేఖను వ్రాయటం గమనార్హం: "కొద్ది రోజుల క్రితం రాజా శివాజీ నుంచి నాకు లేఖ
వచ్చింది. దానిలో అతను, మొఘల్ చక్రవర్తి అధీనులకు ఆహార పదార్థాలు పశువుల
మేత వంటివి సరఫరా చేయించరాదని, ఈ రాజ్యం ఉత్తరానగల దాని కోటల దళాధి
పతులను హెచ్చరిస్తూ ఉన్నంతకాలం, సత్సంబంధాలు కలిగిఉండటానికి నాకు వాగ్దానం
చేశాడు. ఈ కారణం వలన ఆ శివాజీతో అతని ప్రజలతో అతను మనకు వాగ్దానం
చేసిన సంబంధాల వంటివి కలిగి ఉండేటట్లు చూడాల్సిందిగా నిన్ను ఆజ్ఞాపించాలనే
భావం నాకు కల్గింది మొఘల్ శిబిరానికి ఎటువంటి ఆహార పదార్థం చేరకుండా
చేస్తున్నట్లు సర్వవిధాలా నటించడం మొఘల్ చక్రవర్తిఈ పొరుగును వదిలిపెట్టి వెళ్ళిపోగా,
శివాజీ శత్రువుకు హాని కలిగించే తన ఉద్దేశ్యాన్ని నెరవేర్చుకునే అవకాశం పొందగ
లడు ఆ శత్రువు చాలా శక్తిమంతుడైనందున పొరుగు వాడుగా ఉండటంకంటే, దూరంగా

ఉండుటయే మంచిది."

## సింహగఢ్‌పై మొఘల్‌ల దాడి

జస్వంత్‌సింగ్ నాయకత్వం క్రింద మొఘల్‌లు 1663 నవంబర్‌లో సింహగఢ్‌పై దాడి చేశారు. వారు అవమానంతో వెనుతిరిగిపోవలసి వచ్చింది. భీమ్‌సేన్ వ్రాసినది. ఇలా వుంది: "జస్వంత్‌సింగ్ కొండనా దుర్గాన్ని ముట్టడించాడు. మొఘల్‌లు కోట గోడలను బలప్రయోగాలతో స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నించారు. ఆ దాడిలో మొఘల్‌లు, రాజపుత్రులు అనేకులు తమ ప్రాణాలను కోల్పోయారు. తుపాకీ మందు ప్రేలుడు వలన కూడా అనేక ప్రాణాలు పోయాయి. ఆ దుర్గాన్ని జయించడం అసాధ్యంగా పరిణమించింది. విజయాన్ని సాధించే ఆశను కోల్పోయింది. మహారాజా జస్వంత్‌సింగ్, రావ్ భావ్ సింగ్ హడా 1664 మే 28 న కొండనా ముట్టడిని ఎత్తివేసి, ఔరంగాబాదుకు తిరిగి వెళ్ళారు."

'అలంగీర్‌నామా' విషాదంతో ఇలా వ్యాఖ్యానించింది.[1] "ఏ ఒక్క దుర్గం కూడా స్వాధీనం కాలేదు. శివాజీకి వ్యతిరేకంగా సాగిన దండయాత్ర చిక్కుల్లో పడి క్షీణ దశకు చేరుకుంది."

శివాజీ శక్తి, సంకల్పబలం, ఉత్సాహం మొఘల్ అధికారులను ఉద్దేశించి వ్రాసిన ఈ ప్రసిద్ధ లేఖలో చక్కగా బహిర్గతమయాయి.[2] "గత మూడేండ్లలో ప్రసిద్ధ సేనాధిపతులు అనుభవజ్ఞులైన అధికారులు చక్రవర్తి పంపగా ఈ ప్రాంతానికి వచ్చినట్లు దూర దృష్టిగలవారికి తెలుసును. నా కోటలను భూభాగాన్ని వశపరచుకోమని చక్రవర్తి వారిని ఆజ్ఞాపించాడు. చక్రవర్తికి పంపిన సమాచార లేఖల్లో వారు నా భూబాగం కోటలు త్వరలో స్వాధీనం చేసుకోగలమని వ్రాశారు. ఈ ప్రాంతాన్ని జయించడం చాలా కష్టం. ఇది వారికి తెలియదు చక్రవర్తికి సత్యదూరమైన నివేదికలు పంపడానికి వారు సిగ్గు పడటంలేదు. నా దేశం కళ్యాణి, బీదర్ వంటి మైదాన ప్రాంతాలలో ఉండి దౌర్జన్య పూరితమైన దాడులకు లొంగి పోగల స్థలాలతో కూడినది కాదు. అది పర్వత శ్రేణులతో నిండివుంది. ఈ ప్రాంతంలో 60 దుర్గాలున్నాయి. వాటిలో కొన్ని సముద్ర తీరంలోవున్నాయి. అఫ్జల్ ఖాన్ బలమైన సైన్యంతో వచ్చాడు కానీ అతను నిస్సహాయుడై నాశనమయాడు.

[1] మీర్జా మహమ్మద్ కాజీమ్, అలంగీర్ నామా.

[2] ఖుటూటే శివాజీ, వ్రాతప్రతి నకలు బొంబాయిలోని రాష్ట్ర పురాతన పత్ర భాండాగారంలో వుంది.

అఫ్జల్ ఖాన్ మరణానంతరం (ప్రభుశ్రేష్టుడు అమీర్-ఉల్-ఉమారా) షయిస్తఖాన్ ఎత్తయిన పర్వతాలు సుదీర్ఘమైన కనుమలతో నిండిన నాదేశంలోకి ససైన్యంగా వచ్చాడు. అతను యథాశక్తిగా మూడు సంవత్సరాలపాటు కృషి చేశాడు. నా భూభాగాన్ని స్వల్పకాలంలో జయించగలనని అతను చక్రవర్తికి వ్రాశాడు. అట్టి కపటధోరణి అంతం కాగలదని ముందుగా ఊహించటం సాధ్యమే. అతను అవమానానికి గురిఅయి తిరిగి వెళ్లిపోవలసి వచ్చింది.

"నా మాతృభూమిని సంరక్షించడం నా కర్తవ్యం మీ ప్రతిష్ఠను కాపాడుకోవడానికి మీరు చక్రవర్తికి సత్యదూరమైన నివేదికలు పంపిస్తున్నారు కాని నాకు భగవదాశీర్వచనం ఉంది ఈ భూభాగాలపై దండయాత్ర చేసినవాడు ఎవ్వరైనప్పటికీ విజయాన్ని పొందలేడు."

## సూరత్ దోపిడి

దక్కన్ రాజప్రతినిధిగా షయిస్త ఖాన్ స్థానే చక్రవర్తి పుత్రుడు మూ అజామ్ నియమితుడయాడు. షయిస్తఖాన్ (మొఘల్) ఆ స్థానానికి బయలుదేరి వెళ్లాడు ఆ పాలనా నిర్వహణలో మార్పు, జరుగుతూ ఉండగా శివాజీ తన విజయ పరంపరకు మరొక సాహసకృత్యాన్ని జోడించాడు. వ్యాపార కార్యకలాపాలతో సందడిగా ఉండే సౌభాగ్య వంతమైన సూరత్ రేవు పట్టణంపై దాడి చేసి దానిని వశపరచుకున్నాడు

శివాజీ నార్‌దుర్గ్, మహూలీ, కొహాజ్ (కొంకణ్) ల ద్వారా తన పొరుగు ప్రాంతంలోని జమీందారీలలో గుండా రామ్‌నగర్ ద్వారా ప్రయాణం చేశాడు. కళ్యాణ్-భివాండీ మొఘల్ అధికారులు అతి నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. తరువాత తన నిర్లక్ష్యాన్ని కప్పిపుచ్చుకోవడానికి, కళ్యాణ్‌కు మొఘల్ గవర్నరైన లోడిఖాన్ పోర్చుగీసు కేంద్రాలపై దాడిచేశాడు. అందుకు పోర్చుగీసువారు శివాజీ సూరత్‌కు వెళ్లడాన్ని అనుమతించడం ద్వారా అతను తగినంత శ్రద్ధను, లేక ఉత్సాహాన్ని ప్రదర్శించ లేదనే వాస్తవాన్ని ప్రపంచం నుంచి ఈ చర్య మరుగు పరచలేదు. పోర్చుగీసు వారిని ఈ పరిణామానికి నిందించడం సబబుకాదు అని తమ తీవ్ర అసమ్మతిని ప్రకటించినారు.

తాపీ నదిపై గల సూరత్, సముద్రం నుంచి కొన్ని మీటర్ల దూరంలోని అంతర్గత భూభాగంలో, మంచికోటకలిగి నగరము దానికి రక్షణ ఏర్పాట్లు లేవు. శివాజీ సైన్యం సమీపించగానే గవర్నర్ నగరాన్ని మరాఠాలకు వదలివేసి కోటకు పారిపోయాడు. బ్రిటీషువారు డచ్చివారు తమ వ్యాపార కేంద్రాలను రక్షించుకొన్నారు.

శివాజీ సైన్యం 10,000 సంఖ్యాబలంకలది, అతను నగరంలో అతి సంపన్న వర్తకులతో బేరం కుదుర్చుకోవాలని ఆశించాడు, కానీ వారినుంచి ప్రతిస్పందన లేనందుకు అతని సైన్యాలు నగరంలో ప్రవేశించి దానిని కొల్లగొట్టాయి. కోటలోని మొఘల్ రక్షక దళం పిరంగులు ప్రేలుస్తూ ఉన్నప్పటికీ, దాని వలన సిద్ధించిన ఫలితం, నగరంలో చాలా చోట్ల అగ్ని జ్వాలలు చెలరేగి వందలాది ఇళ్ళు బూడిద అయ్యాయి.

శివాజీ 1664 జనవరి 6 నుంచి 9 వరకు నగరాన్ని తాపీగా కొల్లగొట్టాడు. నగరం నుంచి అతను తీసుకొని పోయిన దోపిడీ సొత్తు నగదు వస్తు రూపాల్లో ఇంచుమించు కోటిరూపాయల వరకు ఉండి ఉంటుంది. ఆ నగరం నుంచి దోపిడీ సొత్తును సంపాదించడంలో శివాజీ కఠిన చర్యలు తీసుకొన్నాడు. ఫ్రెంచి యాత్రికుడు బెర్నియర్ ఈ సంతోషకరమైన సంఘటనను నమోదు చేశాడు: "శివాజీ పవిత్రుడుగా, కపూచియన్ మత ప్రబోధకుడు పూజనీయ పిత అంబ్రోస్ నివాసాన్ని గౌరవభావంతో చూశాడు. 'ఫ్రెంచ్ మతాచార్యులు గుణవంతులు వారికి హానిచేయరాదు' అని అతను అన్నాడు."

అదే విధంగా కీర్తిశేషుడైన డచ్చివారి భారతీయ దళారి జీవించి వుండగా ఎంతో దానశీలుడని రూఢీగా శివాజీకి తెలియవచ్చినందున ఆ దళారి గృహాన్ని కొల్లగొట్టకుండా విడిచి పెట్టాడు.

మరొక ఫ్రెంచ్ జాతీయుడు ధెవనోట్ శివాజీ దాడి జరిగిన 2 సం. తరువాత 1666 జనవరి 10 న సూరత్‌లో ఉన్నాడు. అతను విన్నదాని బట్టి శివాజీ: "పొట్టివాడనీ కపిల వర్ణ దేహం కలవాడనీ,అసామాన్య బుద్ధి విశేషాన్ని చాటిచెప్పే నేత్రాలు కలవాడనీ" వర్ణించాడు.

ఆంగ్ల జాతీయుడు ఎస్కాలియట్, "శివాజీని చూసిన వారు వర్ణించిన దానిని బట్టి అతను హ్రస్వదేహుడు, నా కంటే తక్కువ నిటారైన శరీరం కలవాడు, అతి పొందికైన అవయవ నిర్మాణంగల వ్యక్తి, పనిలో చురుకైనవాడు. మాట్లాడుతున్నప్పుడు నవ్వుముఖంతో కనపడేవాడు, చురుకైన తీక్షణమైన దృక్కులు కలవాడు. తన ప్రజలందరికంటే శ్వేతవర్ణుడు కూడ" అని తెలియపరిచాడు

శివాజీ సూరత్‌ను జనవరి 10 వ తేదీన వదలి వెళ్ళాడు. ఏడు రోజుల తర్వాత మొఘల్ సైన్యాలు సూరత్ చేరాయి. నగర గవర్నర్ తాను తలదాచుకున్న కోట నుంచి అప్పుడు వెలికి వచ్చాడు. "కోటనుంచి అతని రాకను చూచి ప్రజలు అతణ్ణి వెక్కిరించి, అతనిపై అపరిశుద్ధ వస్తువులను విసిరారు." అతను సమయానికి, అదు

[1] శివాజీ పై ఇంగ్లీషు రికార్డులు

కోకుండా వారిని అతి నిస్సహాయ స్థితిలో పడవేసినట్లు వారు నిశ్చయించి ఉండ వచ్చు.

శివాజీ సూరత్ నుంచి తిరిగి వెళ్ళాడు. ఇదే సమయంలో దక్షిణ దేశంలో తండ్రి మరణించిన వార్త అతనికి అందింది. షాజీ అతని తరంవారిలో ఘనత వహించిన పాత్ర నిర్వహించాడు. నైజాం షాహీ సింహాసనంపై ఒక రాజును ప్రతిష్ఠించి, మొఘల్‌లను తీవ్రంగా ప్రతిఘటించిన మహా వీరుడు ఆయన. అతని పోరాటం నిస్సంశయంగా శివాజీని ప్రభావితం చేసింది. మొఘల్‌లు అజేయులు కారని అతను విశ్వసించాడు. ఒక జాతిని సృజించుటలో, ఒక స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించుటలో శివాజీ సాధించిన విజయం కేవలం అతని ఆవేశం, అవిరళ కృషిఫలితమే షాజీకి ఆ కార్య కలాపాల్లో భాగం లేదు.

శివాజీ సూరత్‌ను కొల్లగొట్టడం ఔరంగజేబ్‌కు తీరని అవమానం కల్గించింది. ఈ సారి మునుపటి వారికంటే సమర్థుడైన సేనానాయకుని ఆధ్వర్యంలో శివాజీపై కొత్త దండయాత్ర సాగించే నిర్ణయం చేయవలసి ఉంది. ఆ లోపల శివాజీపై యుద్ధంచేయమని ఔరంగజేబ్ బీజాపూర్‌కు విజ్ఞప్తి చేశాడు. దానికి ప్రతిఫలంగా 30,000 హనుల (సుమారు రూ 1,20,000) మేరకు తనకు రావలసిన కప్పాన్ని రాబట్టకుండా వదలుకోగలనని అతను ప్రతి పాదించాడు. శివాజీ కూడా బీజాపూరుకు సమాధాన పూర్వకమైన సంకేతాలు పంపాడు. కాని మొఘల్‌ల ఒత్తిడి అధికముయింది. బీజాపూర్ సేనాని అజీజ్ ఖాన్ ఆక్రమించాడు. శివాజీ బీజాపూర్ స్వాధీనంలోని వెనిగుర్లా పట్టణంపై 1664 అక్టోబర్‌లో దాడి చేసి, కొల్లగొట్టాడు.

మరాఠాలు అప్పుడు ఖవాస్ ఖాన్‌పై దాడి చేశారు. ఎంతో రక్త పాతంతో యుద్ధం జరిగిన తరువాత చెందిన మరాఠా దళనాయకుడు బాజీఘోర్పడే ఖవాస్ ఖాన్‌కు తోడ్పడటానికి వేగంగా వెళ్ళాడు. శివాజీ ఘోర్పడేతో యుద్ధానికి దిగాడు. షాజీ బాజీఘోర్పడేల మధ్య ఎడతెగని వైషమ్యం ఉంది. ఈ మధోల్ ప్రభువు 1648లో జింజీ సమీపంలో శివాజీని నిర్బంధించడానికి సాధనంగా ఉపయోగించినాడు. శివాజీ దాడివెంట జరిగిన తీవ్ర పోరాటంలో బాజీ మరణించాాడు. ఖవాస్‌ఖాన్ అధీనంలోని సైనిక దళానికి జీత భత్యాలు చెల్లించే నిమిత్తం లెక్కించ దగిన సొమ్మును అతను తన వెంట తీసుకు వచ్చాడు. ఆ సొమ్ము శివాజీ హస్తగతమైంది.

బాజీ ఘోర్పడే మరణం వలస ధైర్య విహీనుడై మరాఠాల తీవ్రమైన ఒత్తిడిని తట్టుకోలేక, ఖవాస్ ఖాన్ 1664 నవంబర్‌లో వేగంగా కొంకణ్ నుంచి సైన్యాన్ని ఉప పంహరించాడు వెంటనే శివాజీ కుడాల్‌వరకు పురోగమించి ఆ ప్రాంతాన్ని తన అధీనం

క్రిందకు తెచ్చుకొన్నాడు. బీజాపూర్‌తో పొత్తు కలిపిన దేశాయిలు, స్థానిక ప్రభువులు, పోర్చుగీసు భూభాగంలో తల దాచు కొనడానికి పారిపోయారు. శివాజీ వారిని సరిహద్దుల వరకు తరిమాడు. అదే సమయంలో అతను బీజాపూర్‌పై దాడి చేశాడు. ఆ విధంగా శివాజీ దక్షిణ కొంకణ్‌లో తిరిగి తన పాలనను స్థాపించాడు. అటు తర్వాత ఆ ప్రాంతం మరాఠాల పాలనలో వుండి పోయింది.

### శివాజీ నౌకాదళం

శివాజీ 1664 డిశంబర్ 5 న సముద్ర తీరంలోని మల్వాన్ సమీపంలో సింధ్ దుర్గ్ అనే కోటకు పునాది వేశాడు. తీరంలోని ఘేరియా (విజయదుర్గ్) సువర్ణ దుర్గ్ వంటి కోటలు కూడా పటిష్టం చేశాడు. శివాజీ నౌకాదళానికి రక్షణ కల్పించి, జంజీరా తాలూకు సిద్దీలను పోర్చుగీసువారిని ఇతర రాజకీయ శక్తులను అదుపులో ఉంచడానికి వాటిని ఉద్దేశించాడు.

శివాజీ నౌకాదళం తగుమాత్రమైనప్పటికీ, అతని రక్షణ దళాలలో మిక్కిలి ఉపయుక్తమైన భాగము. సమకాలీన చరిత్రల ప్రకారం దానిలో చిన్న పెద్ద నౌకలు 400 నుంచి 500 వరకు ఉండేవి. "వాటి పేర్లలోనివే 'గురాబ్,' 'తరాండే' 'గల్‌బాట్,' 'ముబార్' 'సిహాద్' 'పాగర్' 'మచ్‌వా' 'తీర్‌కటి' 'పాల్' కాల్బల ఆశ్విక దళాల వలె నౌకాబలం సమాన హోదాగల ముఖ్యమైన ప్రత్యేక రక్షణ దళంగా రూపొందింది. ఈ నౌకాబలానికి దర్యాసారంగ్, మైనక్ భండారీ అధికారులుగా నియమితులయారు. వారి ఆధ్వర్యంలో సముద్రంపై పయనించి పోరాడగలవారు, కోలీలు, సైనిక-నావికులు పని చేస్తుండేవారు."

శివాజీ నౌకాదళ కార్యకలాపాలు అనేక పోర్చుగీస్ డచ్, బ్రిటిష్ పట్టీ పుస్తకాలలో చోటు చేసుకున్నాయి. జంజీరాకు చెందిన సిద్దీలు అతని శాశ్వత శత్రువులుకాగా, వారితో అతను నిర్విరామ సంఘర్షణ సాగిస్తుండేవాడు.

శివాజీ 1665 ఫిబ్రవరిలో స్వయంగా బస్రూర్‌కు నౌకాదళ దండయాత్రను నిర్వహించాడు. ఆ నౌకాబలంలో 4,000 మంది సైనికులతో పాటు 50 చిన్న యుద్ధనౌకలు, మూడు చిన్న నౌకలు కొన్ని చిన్న ఓడలు అంతర్భాగాలు. అతను ఫిబ్రవరి 13న బస్రూర్ చేరి ఉండవచ్చు. కన్నడ తీరంపై నెలకొనిన బస్రూర్ (బారెక్లూర్) బిద్నూర్ సంస్థానానికి చెందినది. ఆ పట్టణం దోపిడికి గురి అయినది. కొల్లగొట్టిన సొమ్ము విలువ 3 లక్షల గిల్డర్లని డచ్చివారు వేసిన అంచనా సరిఅయినది కావచ్చు. మరాఠీ చరిత్రలు ఆ మొత్తాన్ని 2 కోట్ల హన్లు (8 కోట్ల రూపాయలు) గా వెల్లడించాయి. కానీ

అది నమ్మశక్యంగాని ధనరాశి!

తిరుగు ప్రయాణంలో శివాజీ కొంత కాలంపాటు (గొప్ప ప్రాముఖ్యం గల పుణ్య స్థలం) గోకర్ణ మహాబలేశ్వర్, కార్వార్‌ల వద్ద మజిలీ చేశాడు. అతను భూమార్గం గుండా 1665 మార్చి మూడవ వారంలో వేగిరంగా తన రాజధాని రాజఘడ్ తిరిగి చేరాడు.

శివాజీకి వ్యతిరేకంగా దండయాత్రను నిర్వహించడానికి అనుభవజ్ఞుడైన ఔరంగజేబ్ సేనాని మీర్జా రాజా జయసింగ్ 1665 మార్చి 3 న పూనాకు విచ్చేశాడు.

# 4
## శివాజీ, జయసింగ్

శివాజీకి వ్యతిరేకంగా జయసింగ్ నిర్వహించిన దండయాత్రను గురించి పూర్తి లిఖిత పూర్వక వివరాలు లభ్యమవుతున్నాయి. సాధికార ఔరంగజేబ్ చరిత్ర "అలంగీర్‌నామా", జయసింగ్ ఔరంగజేబ్‌ల ఉత్తర ప్రత్యుత్తరాలతో కూడిన 'హఫ్త్ అంజుమాన్,' జయసింగ్ క్రింద పనిచేసిన రాజపుత్ర అధికారుల లేఖలతో కూడిన రాజస్తానీ పట్టీ పుస్తకాలు ఇతర మరాఠీ బ్రిటిష్ పోర్చుగీస్ పట్టీ పుస్తకాలు ఆ దండయాత్రను గురించి స్పష్టమైన వర్ణనను మనకు అందివ్వగలవు. నికలోమానుచీ ఆ సమయంలో జయసింగ్ ఫిరంగిదళంలో ఒక దళవాయిగా పనిచేసేవాడు. 'మొఘల్‌ల కథ' అనే అతని స్వీయ చరిత్ర చాలా విలువైన సమాచారాన్ని అందజేస్తుంది.

కాకలుతీరిన సేనాని జయసింగ్‌ను షయిస్తఖాన్ వంటి వ్యక్తిగా పగణించకూడదు. అతను శివాజీని తక్కువగా అంచనా వేయలేదు. శివాజీని అతని పొరుగువాడైన బీజాపూర్ పాలకుడు అదిల్షాతో, పోర్చుగీసువారితో సంబంధం లేకుండా ఏకాకిని చేయడానికి స్వల్పకాల శీఘ్ర దండయాత్రను సాగించడం అతని వ్యూహం. అంతే కాక అతను శివాజీని అతని భూభాగం నుంచి కదలకుండా నివారించడానికి కళ్యాణ్, లోహగడ్, పూనా వంటి కీలక స్థలాలలో పటిష్ఠంగా రక్షితమైన సైనిక కేంద్రాలను నెలకొల్పాలని, శివాజీ భూభాగం పై దాడిచేసి అగ్నినీ కత్తినీ ప్రయోగించి పూర్తిగా దానిని నాశనంచేయాలని, శివాజీకి మొఘల్‌లకు లొంగడం తప్ప అన్యమార్గం లేకుండా చెయ్యాలనీ తలపెట్టాడు. జయసింగ్ చక్రవర్తికి వ్రాసిన లేఖలో —

1. దండయాత్ర విషయాలలో సమైక్య ఏియంత్రణ ఉండాలని,

2. సైన్యంపై పాలనానియంత్రణ ఔరంగాబాద్‌లోని మూఅజ్జామ్ రాకుమారునికి కాక తనకే చెందాలనీ,

3. పరెండా, అహ్మద్‌నగర్ వంటి దుర్గాలకు చక్రవర్తి రక్షణ ధళాధిపతులుగా నియమించిన వారిపై తనకు ఆధిపత్యం లభించాలనీ,

4. శివాజీ అనుచరులను (సామ్రాజ్య పక్షానికి) ఆకర్షించడానికి ఔరంగాబాద్

లోని సామ్రాజ్య కోశాగారం నుంచి నిధులు పొందే స్వేచ్ఛ కావాలనీ కోరిక వెల్లడించాడు.

అతను తన కోర్కెలను సాధించుకొన్నాడు. పై పెచ్చు తాల్-కొంకణ్‌లో మకాం పెట్టమని అతనికి ఔరంగజేబ్ చేసిన సూచనను, తానావిధంగా చేసినట్లయితే శివాజీ అదిల్షాలు తనకు వ్యతిరేకంగా సమైక్యం కాగలరనే సాకుతో జయసింగ్ త్రోసిప్పుచ్చాడు.

జయసింగ్ దండయాత్ర రచనలో అమలులో ఘనంగా కొనసాగింది. పోర్చుగీసు వారు శివాజీకి తాము ఎన్నడూ (ఉదా: శివాజీ సూరత్ దండయాత్రలో) తోడ్పడలేదని మొఘల్‌లకు భవిష్యత్తులో ఎటువంటి భయం ఉండనవసరం లేదని లిఖిత పూర్వకంగా తెలియజేశారు. ఈ సమస్యపై వారికి కొన్ని మానసిక సంకోచాలు ఉన్నట్లు వారి ఉత్తరాలు వెల్లడిస్తున్నాయి. ఉత్తర కొంకణ్ గవర్నర్‌కు పోర్చుగీసు వారు వ్రాసిన లేఖలనుంచి గ్రహించిన భాగం ఇలా వుంది: "ఏమైనప్పటికీ శివాజీకి ఆయుధాల లేక ఆహారపదార్థాల రూపేణా సహాయన్ని, అనుమానాన్ని రేకెత్తించే ప్రమాదం లేకుండా రహస్యంగా ఇవ్వగలిగినట్లయితే, నువ్వు డబ్బుకొరకు ఆ పని చేయాలి. ఎందుకంటే అతణ్ణి అతని భూభాగాల నుంచి వెళ్ళగొట్టినట్లయితే మొఘల్‌లు వాటికి పాలకులు కావటం వాంఛనీయం కాదు."

బీజాపూర్ సుల్తాన్ అదిల్షా కూడా భయభ్రాంతుడయాడు. దక్షిణ కొంకణ్‌లోకి చొచ్చుకొని పోవడానికి అతను దుర్బల ప్రయత్నాన్ని చేశాడు. అయితే ఈ చర్య బీజాపూర్ స్వంతంత్ర రాజ్య ప్రతిపత్తిని పూర్తిగా హరించే దీర్ఘకాలిక విధానంగల సంశయాలను ఉపశమింప చేయలేదు.

శివాజీని ఏకాకి చేయడానికి జయసింగ్ చేసిన యత్నాలు ఫలించాయి. జాహర్, రామ్‌నగర్ రాజుల వంటి చిన్న ప్రభువులు జావళీకి చెందిన మోరేలవంటి మొఖాసాలను కోల్పోయి అసంతృప్తి చెందినవారు సామ్రాజ్య సేవను అపేక్షిస్తున్న బీజాపూర్ అధికారులు జయసింగ్ పతాకాల క్రింద గుమికూడారు. బీజాపూర్‌కు చెందిన ప్రముఖ ప్రభువర్గీయుడు ముల్లా అహ్మద్ స్వపక్షాన్ని త్యజించడం జయసింగ్ సాధించిన గమనార్హమైన విజయము. జంజీరాకు చెందిన సిద్దీలు వెంటనే మొఘల్‌ల సేవలో ప్రవేశించారు.

జయసింగ్ పూనా చేరగానే పురందర్ దుర్గంవైపు ససైన్యంగా పురోగమించాడు. ఇహ్‌తెషాన్‌ఖాన్‌ను, అతని మరణానంతరం కుబాద్ ఖాన్‌ను నాలుగు వేల అశ్వికదళంతో పూనాలో నియోగించారు. జయసింగ్ 1665 మార్చి 14న పూనాను

వదలిపెట్టాడు. నిర్భేద్య పురందర్ దుర్గానికి అతి సమీపంలోని సస్వాద్‌కు అతను మార్చి 29 న చేరాడు. సైన్యాధికార వర్గంలో అతని తర్వాత వాడైన దిలేర్ ఖాన్ పురోగామి సైనిక దళాలతో, ఫిరంగిదళంతో అప్పటికే ముందంజవేశాడు. పురందర్ ముట్టడి 1665 మార్చి 30 న ప్రారంభమయింది. మరాఠా దాడులు ప్రబలంగా ఉన్నప్పటికీ మొఘల్‌లు పురందర్ రుద్రమల్ దుర్గాల మధ్య జయప్రదంగా తిష్టవేశారు. మొఘల్‌ల సంచార దళాలు శివాజీ అధీన ప్రాంతంలో తిరుగాడుతూ ప్రతిచోటా విధ్వంసకాండకు పాల్పడ్డారు. మరాఠాలు తీవ్ర సంఘర్షణకు ఉద్యుక్తులయ్యారు. నేతాజీ పాల్కర్ పరెండా ప్రాంతంపై దాడిచేశాడు. "వారు (మరాఠాలు) ఆకస్మికంగా దాడులు చేయటమేగాక రాత్రి దండయాత్రలు కొనసాగించారు. రహదారులలో ప్రతిబంధకాలు కల్పించి, ప్రవేశించడానికి అనువుకాని పర్వత కనుమలను స్వాధీనపరచుకొన్నారు. అంతే కాక వారు అడవులను కాల్చివేయసాగారు. ఈ కార్యకలాపాల వలన ఇస్లాం సైన్యం సంకటస్థితిలో పడింది. ఆ సైన్యం తాలూకు జంతువులు గణనీయమైన సంఖ్యలో మృతినొందాయి."

సంచార దళాలుగా 7,000 సంఖ్యగల అశ్వికదళం అధిపతిగా ఖండేష్ గవర్నర్ దావూద్ ఖాన్‌ను జయసింగ్ నియమించాడు. రాజా రైసింగ్, షర్జాఖాన్, అమర్ సింగ్ చంద్రావత్, మహమ్మద్ సలే వంటి కాకలుదీరిన దళవాయిలను దావూద్‌ఖాన్ ఆధ్వర్యంలో పనిచేసేందుకు నియుక్తులయ్యారు. వారు మరాఠా భూభాగంలో సాగించిన విధ్వంసకాండకు ఒక తార్కాణం వారి కార్యకలాపాల స్వభావాన్ని తగినంతగా తెలియచెప్పగలదు. "దావూద్ ఖాన్, రాజా రైసింగ్ ఇత్యాది మొఘల్ అధికారులు రోహిడా దుర్గం పరిసరాలలోకి ఏప్రిల్ 27న చేరారు. సుమారు 50 గ్రామాలకు వారు నిప్పంటించారు. పర్వత శ్రేణులలో ఉన్న నాలుగు గ్రామాలు నేలమట్టమయాయి. గ్రామీణులనేకులు బందీలయారు. పశుగణాలు ఇతర వస్తువులు శత్రువుల చేజిక్కాయి. కొండ పరిసరాలలోని గ్రామాలు మే 2 న ధ్వంసమయాయి. కింవారీ దుర్గం వైపు కుత్బుద్దీన్ ఖాన్ సైన్యాలతో పురోగమించాడు. ఆ ప్రాంతంలోని గ్రామాలను మొఘల్‌లు మే 5 న కాల్చివేశారు.

గ్రామాలకు నిప్పంటించడం, స్త్రీ పురుషులను, పశువులను, స్వాధీనం చేసుకోవడం దాడి చేసే మొఘల్ దళాల వాడుక కార్యకలాపంగా పరిణమించింది.

**పురందర్ ముట్టడి**

'హఫ్తంజుమాన్' లో గల జయసింగ్ ఉత్తరాలు పురందర్ ముట్టడిని సవివ

రంగా వర్ణించాయి. భయంకరమైన మొఘల్ దాడులను, అదే స్థాయిలో కొనసాగిన మరాఠాల ఆత్మ సంరక్షణ కార్యకలాపాలను అవి సోదాహరణంగా తెలియచేస్తాయి. భారతదేశ చరిత్రలో చిరస్మరణీయమైన ముట్టడులలో అది ఒకటి. మొఘల్‌లు ఏర్పాటుచేసుకున్న కందకాలపై దుర్గం వెలుపలికి వచ్చి మరాఠాలు పదేపదే దాడి చేశారు. బహాబాహీ పోరాటాలు అప్పట్లో పరిపాటిఅయాయి. అటువంటి పోరాటాలు ఒకదానిలో మరాఠా వీరుడైన పురందర్ దుర్గ రక్షణ దళాధిపతి మురార్ బాజీ ప్రాణ త్యాగం చేశాడు. మారాఠా చరిత్ర పుటల్లో అతను అమరుడయాడు.

మొఘల్‌లు ఏప్రిల్ 14 న రుద్రమాల్‌ను పట్టుకొన్నారు. పురందర్ తాలూకు దిగువ దుర్గం వెంటనే ముట్టడికి గురిఅయింది. దుర్గం ఈశాన్యభాగాన గల ఖడ్కలా బురుజువైపు మొఘల్ కందకాలను మళ్లించారు. మొఘల్‌లు వెదలి డమ్‌డమ్‌లను నిర్మించి వానిపై తుపాకులను అమర్చారు. ఆ వేదికలను ధ్వంసంచేయడానికి మారాఠాలు చేసిన ప్రయత్నాలు విఫలంచేశారు. కోట తాలూకు 5 బురుజులను మొఘల్‌లు స్వాధీనపరచుకున్నారు. దుర్గం లోపలి గోడల వెనుకకు మరాఠాల ఉపసంహరణ అనివార్యమయింది.

అయినప్పటికీ తీవ్ర క్లిష్టస్థితిలో ఉన్న మరాఠా దుర్గ రక్షణదళం మొక్కవోని ధైర్యంతో నిలిచింది. పరిస్థితి 1665 మే మాసాంతానికి ఆ విధంగా ఉండగా దేశానికి వినాశకరంగా తయారైన యుద్ధాన్ని సమాప్తం చేయాలని శివాజీ భావించాడు.

భవిష్యత్తులో మొఘల్‌లకు బీజాపూర్‌తో సంఘర్షణ జరిగినప్పుడు తన సహకారాన్ని అందజేయగలనని లేఖల ద్వారా ప్రతిపాదిస్తూ జయసింగ్ సమ్ముఖానికి అభ్యర్థన పంపాడు. జయసింగ్ లేఖల ద్వారా ఈ విషయం వెల్లడి అవుతుంది. కానీ ఈ ప్రతిపాదన వెంటనే తృణీకారానికి గురి అయింది. పూర్తిలొంగుబాటు కంటే తక్కువైన దానిని అంగీకరించడానికి జయసింగ్ సిద్ధపడలేదు.

పురందర్ శత్రువుల చేజిక్కనున్నందున తాను అన్యుల తోడ్పాడు లేని ఏకాకిగా మిగిలిపోయాడు కనుక జయసింగ్‌ని కలుసుకొని యుద్ధ విరమణను కోరడం ఒక్కటే తన దుస్థితిని తొలగించుకొనే మార్గమని శివాజీ గ్రహింపవలసి వచ్చింది.

చక్రవర్తికి జయసింగ్ ఈ విధంగా నివేదించాడు : "జిల్‌హిజ్జ 7 వ తేదీ (1665 జూన్ 11) ఆదివారంనాడు, ఆ రోజులో ఒక జాము ప్రహార్ గడిచిన తరువాత నేను దుర్బార్ నిర్వహిస్తుండగా, ఆరుగురు బ్రాహ్మణులతో కొందరు పల్లకీ బోయాలతో కూడి శివాజీ సమీపిస్తున్న వైనాన్ని అతను (రాయబారి) వార్తగా తెచ్చినాడు. ఉదైరాజ్ మున్షీ, ఉగ్రసేన్ కఛ్‌వాహలను మార్గం మధ్యలోనే అతన్ని కలుసుకొని కోటల

నన్నింటినీ అప్పగించడానికి అతను అంగీకరించినట్లయితేనే రావచ్చునని చెప్పడానికి, నేను పంపాను. ఈ సందేశంవిని శివాజీ, 'నేను సామ్రాజ్యసేవలో ప్రవేశించాను. సామ్రాజ్యాధీనప్రాంతాంలో నా కోటలలో చాలాభాగం చేరగలవు అన్నాడు,' ఆవిధంగా చెప్పిన తరువాత నేను పంపిన వ్యక్తుల సాహచర్యంలో అతను పోయాడు. శివాజీని తీసుకుని రావడానికి గుడారం ద్వారంవద్దకు జానీబేగ్ బషీని నేను పంపాను. పురందర్‌ను స్వాధీన పరచుకొనే స్థితిలో మొఘల్‌లు ఉన్నప్పటికీ శివాజీ వెలిబుచ్చిన కోరిక ప్రకారం ఆ దుర్గం లొంగిపోవడానికి, ఆ దుర్గం రక్షణ దళం దానిని విడిచిపెట్టి వెళ్ళడానికి అనుమతి లభించింది. 'అలంగీర్‌నామా' లో వ్రాసిన దాని ప్రకారం పురందర్‌కోటలోని స్త్రీపురుషులు కలసి 7,000 సంఖ్యలో ఉండగా, వారిలో 4,000 మంది యుద్ధవీరులు.

పురందర్ ముట్టడి చిరస్మరణీయమైనది. తరువాత జరిగిన సంధి సంప్రదింపులు బెట్టుగా కొనసాగాయి. శివాజీ కోటలన్నీ లొంగిపోవాలని జయసింగ్ కోరాడు. జయసింగ్ దృష్టిని బీజాపూర్ వైపుకు మరల్చి అతనినుంచి ఉదారమైన షరతులను పొందటానికి వీలుగా అతనిని ప్రభావితం చేయడానికి శివాజీ ప్రయత్నించాడు.

(అందుకు) జయసింగ్ నిరాకరించినాడు. అయితే శివాజీని మితిమీరి ఒత్తిడి చేయరాదని అతను నిర్ణయించాడు. దీనికి కారణమేమంటే ఆస్థితిలో కేవలం తెగింపుతో బీజాపూర్‌తో పొత్తు కలిపి అంతిమదశ వరకు మొఘల్‌లను ప్రతిఘటించవచ్చు. శివాజీకి బీజాపూర్ ప్రతిపాదన పంపనే పంపింది. కానీ అది ఆలస్యంగా అందింది. మొఘల్‌లకు వ్యతిరేకంగా అతను సాగించిన పోరాటంలో బీజాపూర్ మద్దతు ఇవ్వకపోవటం పట్ల శివాజీలో చెలరేగిన పరుషభావాలను అది తగ్గించలేకపోయింది. మొఘల్‌లకు వ్యతిరేకంగా బీజాపూర్ శివాజీ ఏకమైనట్లయితే జయసింగ్ దండయాత్ర గతిని సులభంగా ఊహించవచ్చు.

చివరకు అంగీకరించిన సంధి షరతులు ఇవి: "శివాజీకి చెందిన 23 దుర్గాలు పెద్దవి, చిన్నవి, నాలుగు లక్షల హోన్లు (సుమారు 16 లక్షల రూపాయల) ఆదాయం ఇవ్వగలవి మొఘల్ సామ్రాజ్యంలో లీనం కావలెను.

2. రాజగఢ్‌తోసహా ఒక లక్ష హోన్ల (సుమారు 4,00,000 రూపాయల) ఖచ్చితమైన ఆదాయం ఇవ్వగల శివాజీకి చెందిన 12 దుర్గాలు సామ్రాజ్య ప్రభుత్వం పట్ల విశ్వాసం కలిగి సేవచేసే షరతుపై శివాజీ అధీనంలో ఉండాలి."

3. అయితే అతని కుమారుడు శంభాజీ అయిదు వేల (అశ్వికదళ) హోదాకలిగిన మన్సబ్‌దార్ కాగలడు.

4. తన విషయమై శివాజీ "మనసబ్‌నుంచి సేపనుంచి నన్ను మినహాయించండి. దక్కన్‌లో మీరు చేసే యుద్ధాలలో ఎక్కడైనా కర్తవ్యనిర్వహణకు నన్ను నియోగించినట్లయితే, కాలహరణం లేకుండా నేను కర్తవ్య నిర్వహణ చేయగలను" అని కోరాడు.

5. బీజాపూర్ భూభాగాలకు సంబంధించి, "బీజాపూర్ భూభాగంలోని నాలుగు లక్షల హొన్ల ఆదాయాన్ని ఇవ్వగల బీజాపూర్ తాల్-కొంకణ్ నా స్వాధీనంలో ఉండగా, అయిదు లక్షల హొన్ల స్థూల ఆదాయాన్ని ఇవ్వగల కొన్ని బాలాఘాట్ ప్రాంత మహల్‌లను నాకు దయతో ఇచ్చినట్లయితే, బీజాపూర్ ఆక్రమణకు సామ్రాజ్య దేశాన్ని ఎప్పుడైనా పంపినప్పుడు, పైన పేర్కొన్న తాలూకాలను నాకు వదలి వేసేటట్లు సామ్రాజ్య ఉత్తర్వును జారీ చేసినట్లయితే, నేను సంవత్సరానికి మూడు లక్షల చొప్పున వాయిదాలుగా చక్రవర్తికి నలభై లక్షల హొన్లు కప్పంగా చెల్లించడానికి నేను అంగీకరిస్తున్నాను."

మొఘల్‌లు స్వాధీన పరచుకొన్న దుర్గాలలో పురందర్, కొండన (సింహగఢ్), రోహిదా, లోహఘఢ్, మాహులీ వంటి బలమైన రక్షణ కేంద్రాలు వున్నాయి. కేవలం (రాజఘఢ్, తోర్నా) ప్రధానమైనవిగా పరిగణింపదగిన దుర్గాలతో కలిపి పన్నెండు కోటలు శివాజీకి వదలి పెట్టారు. పూనా మైదాన ప్రాంతాలను కళ్యాణ్-భివాండీ తీర ప్రాంతాన్ని మొఘల్‌లు స్వాధీన పరచుకున్నారు.

పూనా ప్రాంతంలోని శివాజీ వారసత్వపు ఆస్తిలో 4 లక్షల వార్షిక ఆదాయాన్ని ఇవ్వగల స్వల్పభూభాగం మాత్రమే అతనికి మిగిలింది. బీజాపూర్ నుంచి స్వాధీన పరచుకొన్న మధ్య కొంకణ్ భూభాగాలు, ప్రతాపగఢ్ దుర్గం జావళీ తాలూకాతోకూడిన ప్రస్తుత సతారాజిల్లాలోని స్వల్ప భూభాగం ఆ పిత్రార్జితానికి తోడయింది. ఆధునిక పదాల్లో చెప్పవలెనంటే శివాజీ రాజ్యం సుమారు రెండు జిల్లాలకు పరిమితమైంది. మొఘల్‌లు సిద్ధీలను సామ్రాజ్య సేవలోకి చేర్చుకోవడం ద్వారా జంజీరాపై తమ ఆధిపత్యాన్ని విస్తరించారు. జంజీరా శివాజీ ప్రాబల్యానికి గురిఅయిన మండలంలో ఉన్నందున, మొఘల్‌ల చర్యను అతను గట్టిగా నిరసించాడు. అది మ్రింగుడు పడని చేదుమాత్ర. ఈ అవమానాన్ని గొప్ప ఓర్పుతో మనస్థైర్యంతో భరించడంలో శివాజీ ఘనత వ్యక్తమవుతుంది. అతను పోరాడటానికి (అంతేకాదు) జయప్రదంగా పోరాడటానికి జీవించాడు.

ఈ దండయాత్రలో జయసింగ్ క్రింద పనిచేస్తున్న, 'మొఘల్‌ల కథ' (స్టోరియా-డి-మొగోరె) రచయిత అయిన మానుచీ శివాజీతో అతని సమావేశం గురించి

ఒక సంక్షిప్త వృత్తాంతాన్ని అందించాడు. అతని మాటలలో : "నేను వచ్చిన కొద్ది రోజుల తరువాత శివాజీ లొంగిపోయి మా శిబిరానికి వచ్చాడు. నేను రాత్రి వేళ రాజా (జయసింగ్) కోరినప్పుడల్లా వెళ్లి అతనితో మాట్లాడి ఆడుతుండేవాడిని. ఈ కాలంలో ఒకనాటి రాత్రి రాజా అతని బ్రాహ్మణుడు నేను కలసి ఆడుకొంటుండగా శివాజీ ప్రవేశించాడు. శిబిరంలోని ఇతరులవలె నాకు పర్షియన్, హిందూస్థానీ భాషలు తెలుసు కనుక శివాజీతో అనేకసార్లు మాట్లాడటానికి అవకాశం కలిగింది. అతను యూరప్‌లో పోర్చుగీసురాజు తప్ప మరొకరాజు లేడని అభిప్రాయపడుతుండగా, ఐరోపా రాజుల ఘనతను గురించిన సమాచారం నేను అతనికి అందించాను. మన మతాన్ని గురించి కూడా నేనతనితో మాట్లాడాను."

ఔరంగజేబ్ సంధిషరతుల పట్ల అంత చూపలేదు ఉత్సాహం. శివాజీకి అతని కోటలన్నీ లేకుండా చేయాలని అతను ఉద్దేశపడ్డాడు. 'హఫ్త్ అంజుమాన్' లోని లేఖలు వెల్లడించినట్లు ఈవిషయలలో జయసింగ్ వాదనలు బలమైనవి, తిరుగులేనివి, నచ్చజెప్పగలవి. ఔరంగజేబ్ వాటిని మానసిక సంక్షోభాలతోనే ఆమోదించినట్లు, ఆగ్రాలో శివాజీ పట్ల అతను చూపిన ఆదరణ రీతి తెలియజేస్తుంది.

జయసింగ్ వాదనలు ఖండితంగా చెప్పిన విరుద్ధాభిప్రాయాలుగా తోస్తున్నాయి. శివాజీ బీజాపూర్ చేతులు కలిపి, తద్వారా మొఘల్‌లకు సమస్యలు సృష్టించగల ప్రమాదం ఏర్పడింది. శివాజీకి కోరలు తీసినప్పటికీ, బీజాపూర్ పై దండయాత్రలో మొఘల్‌లతో చేరేటట్లు నచ్చచెప్పారు. బీజాపూర్ గోల్కొండ వంశ పారంపర్య పాలకులవలె కాక శివాజీ ఉద్యోగి వర్గం నుంచి ప్రభవించిన జమీందారు మాత్రమే! అతని పాలనాధికారం ఒక దశాబ్దాన్ని మించి కొనసాగక పోవచ్చు. మొదటిసారిగా బీజాపూర్‌పై దండయాత్రలో శివాజీని ఉపయోగించవచ్చు. మొఘల్‌లతో అదిల్షా కుతుబ్షాల, మరాఠాల ప్రమేయంగల దక్కన్ సమస్యాపరిష్కారంలో ఇది ఒక అవశ్యకమైన చర్యగా ఉండజాలదు.

జయసింగ్ వాదనలు ఆ విధంగా సాగాయి. శివాజీ పట్ల జయసింగ్‌కు సానుభూతి ఉన్నట్లు ఆ వాక్యాలమధ్య చదివినట్లయితే, ఎవరైనా గ్రహించగలరు. మొఘల్‌లకు నిజమైన విశ్వాసపాత్రుడైన సైనికునివలె అతడు తన ఆలోచనలను పూర్తిగా మార్చుకున్నట్లు కనిపిస్తున్నది. అతని లేఖలలో శివాజీని నిరసిస్తూ చేసిన వ్యాఖ్యానాలు ఔరంగజేబ్ ఉపయోగం కొరకే ఉద్దేశించి వుండవచ్చు. సంధి షరతులు శివాజీ విషయంలో పరుషంగా ఉన్నప్పటికీ, జయసింగ్ వాదనలు లేనట్లయితే అవి మరింత కఠినంగా వుండేవి

శివాజీపై జయసింగ్ సాధించిన విజయాన్ని పురస్కరించుకొని మొఘల్‌లు బీజాపూర్ పై దాడికి ఉపక్రమించారు. బీజాపూర్ పై దండయాత్ర ఔరంగజేబ్ ఇచ్చిన ఆజ్ఞల ప్రకారం జరిగినట్లు జయసింగ్ మాటలనుబట్టి వెల్లడవుతుంది. "ఈ వ్యవహారంలో నేను చొరవ తీసుకోలేదు" ఈ దండయాత్రను సానుకూల పరచగల ఫిరంగిదళం రవాణా సౌకర్యాలు తగినంతగా జయసింగ్‌కి లేని సందర్భంలో శివాజీ మొఘల్‌లకు విలువైన సేవ చేశాడు. ముఖ్యంగా మరాఠాల సహకారం వల్లనే ఫల్టాన్, తాతివాడే. మంగల్‌వేఢా దుర్గాలు (మొఘల్‌ల) స్వాధీనమయాయి

కానీ బీజాపూర్ వైపు పురోగమిస్తుండగా మొఘల్‌లకు అనుకోకుండా గట్టి ప్రతిఘటన ఎదురైంది. వారికి 1665 డిసెంబర్, 25, 28 తేదీలలో తీవ్రయుద్ధాలు తటస్థించాయి. బీజాపూర్ పొలిమేరల్లో నగరంనుంచి సుమారు 16 కి. మీ. దూరం వరకు జయసింగ్ పురోగమించాడు. బీజాపూర్ సైన్యం నిర్దాక్షిణ్యమైన విధ్వంసకర విధానాన్ని అమలు చేసింది. (బీజాపూర్) దుర్గాన్ని 30,000 సంఖ్యా బలంగల కర్ణాటక కాల్బలం సంరక్షణలో చక్కని సంసిద్ధ స్థితిలో ఉంచారు. అంతేకాక గోల్కొండనుంచి అదనపు బలాలు బీజాపూర్ చేరాయి. శత్రువుతో నిర్విరామ పోరాటాలు ఎదుర్కొన్న జయసింగ్ తన బలాలను ఉపసంహరింపక తప్పిందికాదు. అతను 1666 జనవరి 5 న బీజాపూర్ నుంచి వెనక్కు మళ్ళాడు. బీజాపూర్ సైన్యం జనవరి 11 న అతను భీమానదిని సమీపించే వరకు ఎడతెగకుండా అతన్ని వేధించింది.

## సెలవు పుచ్చుకొన్న శివాజీ

అప్పుడే శివాజీ జయసింగ్ నుంచి సెలవు తీసికొన్నాడు. పశ్చిమ దిశనుంచి బీజాపూర్ రాజ్యంపై అతను దాడిచేసి పన్హాలాను పట్టుకోవాలని నిర్ణయమయింది. జయసింగ్ అతనికి అప్పగించిన కర్తవ్యం ఇదే. ఆ సమయంలో జయసింగ్ శిబిరంలో గల మానుచీ ఒక ఆశ్చర్యకరమైన కథను చెప్పగలిగాడు. అతని మాటల్లో "విశ్వాస ఘాతుకానికి అలవాటుపడిన దిలేర్‌ఖాన్ పలుమార్లు శివాజీని చంపగోరాడు. ఈ ఉద్దేశ్యంతో శివాజీని చంపుమనీ లేదా ఆ పని చేయడానికి తనకు అనుమతి నివ్వమని రాజా జయసింగ్‌ను అర్థించాడు. అందుకు పూర్తి బాధ్యతను తాను వహించగలననీ, రాజా ఎట్టి నిందలపాలు కాకుండా చూడగలననీ హామీ ఇచ్చాడు. శివాజీ ధైర్యపరాక్రమాలు మొఘల్‌లకు విశ్రాంతినివ్వలేవు గనుక ఆ పరిణామం పట్ల చక్రవర్తి సంతోషించగలడని అతను అభిప్రాయపడ్డాడు. కాని రాజా జయసింగ్ శివాజీని

హత్య చేయడానికి అనుమతించలేదు. దిలేర్‌ఖాన్ మాటలకు చెవియొగ్గలేదు"

శివాజీ జనవరి 16 న పన్హాలా చేరి ఆ దుర్గం ముట్టడికి పూనుకొన్నాడు. అతని సేనాని నేతాజీ పాల్కర్ సకాలంలో (ఆ ముట్టడిలో) పాల్గొనడానికి రాలేక పోవటం వల్ల అది జయప్రదం కాలేదు. కాగా తీవ్ర విమర్శకు గురి అయిన నేతాజీ, శివాజీ కొలువు విడిచి పెట్టి మొఘల్‌లు తనకు అనుగ్రహించిన మన్సబ్ తనకు తగినదికాదని భావించి బీజాపూర్ రాజ్యసేవలో చేరాడు. తరువాత అతను మునుపటికంటే మిన్న అయిన మన్సబ్‌ను ఇవ్వజూపినందున మొఘల్‌ల కొలువులోకి ఆకర్షితుడయాడు"

నేతాజీ స్వపక్ష త్యాగం శివాజీకి సన్నిహితులైన ఉద్యోగులు కూడా అతను కొనసాగిస్తున్న పోరాట ప్రాముఖ్యాన్ని సరిగా గ్రహించలేకపోయిన వాస్తవానికి తార్కాణంగా నిలుస్తుంది

బీజాపూర్‌పై దండయాత్రలో భాగంగా శివాజీ కొంకణ్‌లోకి చొచ్చుకొని పోయి ఫోండాను ముట్టడించాడు పోర్చుగీసువారి నిగూఢ సహకారంతో బీజాపూర్ రాజ్యంసేవలోని దుర్గ రక్షణదళం ఆ ముట్టడినుంచి అతను విరమించుకొనేట్టుగా చేయగలిగింది ఫోండాకు ఉత్తరంగా ఉన్న భూభాగాన్ని తిరిగి స్వాధీనపరచుకోవటం జరిగింది

బీజాపూరుపై దండయాత్ర జయసింగ్‌కు దుర్దశగా పరిణమించింది. చాలినంత ఫిరంగిదళం తోడ్పాటు లేకుండా చక్రవర్తి ఆజ్ఞప్రకారం అతను బీజాపూర్‌పై దాడి చేశాడు. అతను వెనుకంజవేయగా, దండయాత్ర వైఫల్యానికి ఔరంగజేబ్ అతనినే ఆక్షేపించాడు.

పై పెచ్చు, బీజాపూర్ విషయంలో మొఘల్‌లకు కలిగిన అపజయం శివాజీని, బీజాపూర్ వారితో కలిసి (1965 నాటి ) సంధి షరతుల ప్రకారం స్వాధీనం చేసుకోవడానికి ప్రేరేపించవచ్చునని జయసింగ్ భయపడ్డాడు.

కాగా శివాజీని మొఘల్ ఆస్థానానికి ఆహ్వానించమని చక్రవర్తికి సూచించినవాడు జయసింగ్. అతను ఇలా వ్రాశాడు : "ప్రస్తుతం దుర్బుద్ధితో ఆదిల్షా, కుతుబ్షాలు ఏకమయ్యారు. కనుక, అన్ని విధాలా శివాజీ హృదయాన్ని చూరగొనడం, సార్వభౌమ సన్నిధికి అతను చేరేటట్లుగా అతనిని ఉత్తరభారతం పంపడం తప్పనిసరి."

ఆగ్రా పోయేటట్లుగా శివాజీకి నచ్చచెప్పటంలో జయసింగ్ తన నేర్పరితనాన్నంతా వినియోగించి ఉండవచ్చు. భూభాగాల లబ్ధి, కలిగినట్టి ఆశనూ అతను చూపెంచి ఉంటాడు. అతను నచ్చచెప్పిన తీరు మర్యాద పూర్వకంగానే గాక ఖండితంగా కూడ ఉండి ఉంటుంది. శివాజీ (మొఘల్) ఆస్థానానికి వెళ్ళక తప్పింది

కాదు. బహుశా మిత్రుడుగా అతని విలువను. ఔరంగజేబ్ గుర్తించి అతని వారసత్వపు ఆస్తిని తిరిగి అప్పగించే మార్గాన్ని అన్వేషించగలడని శివాజీ ఆశించాడు.

# 5

## ఆగ్రా సందర్శనం, నిర్బంధ విముక్తి

శివాజీ 1666 మార్చి 5 న ఆగ్రాకు పయనమయాడు. ఒకవారం పాటు అతను ఔరంగాబాద్‌లో మజీలీ చేశాడు. ఔరంగజేబ్ అతనికి ఇలా వ్రాశాడు. "నా కృపపై పూర్తి విశ్వాసం కలిగి సంపూర్ణ స్థిరచిత్తంతో ఆలసించకుండా ఇక్కడకు రా. నా సమక్షాన్ని పొందిన తరువాత నేను అనుగ్రహించిన వాటితో నీవు ఘనత నొంది, స్వగృహానికి తిరిగి పోయేందుకు అనుమతి పొందగలవు."

శివాజీ 1666 12 న ఆగ్రా చేరాడు. శివాజీ, అతని పరివారాన్ని గురించిన చక్కని వర్ణనకు జయసింగ్ కుమారుడైన రామ్‌సింగ్ తాలూకు రాజ పుత్ర అధికారులు వ్రాసిన లేఖలకు మనము ఋణపడి ఉన్నాము. రాజస్థానీ పత్రాల్లో[1] పొందుపరచిన లేఖలు ఇలా ఉన్నాయి. "అతను ఒక వంద మంది భృత్యులతో మాత్రమే స్వయంగా వచ్చాడు. అతని రక్షణార్థం వెంట వచ్చే వారి సంఖ్య మొత్తం మీద 200 నుంచి సుమారు 550 వరకు ఉంటుంది. శివాజీ పల్లకీలో సవారీ చేస్తున్నప్పుడు, తురుష్కులు అనేకులు అతని ముందు నడుస్తుంటారు. స్వర్ణాలంకార భూషితమైన అతని జెండా నారింజ సింధూర వర్ణ మయమయింది...చూపులకు శివాజీ శరీరం బక్క పలుచగా పొట్టిగా కన్పిస్తుంది. అతని ఆకారం అద్భుత సౌందర్యమనదగిన వర్చస్సుగలిగి, అతనెవరో తెలుసుకొనకుండానే అతను ప్రజాపాలకుడని ఎవరైనా సహజంగానే భావించవచ్చు. (దీల్ సో హకీర్ పార్ అజబ్ గోరో, ఆప్ హీ రాజసీ దిసొజో). అతను చాలా సాహసం, ఆత్మోన్నత్యంతో కూడిన వ్యక్తిత్వం కలిగి చుబుకాన్ని ధరించి ఉంటాడు. నవ వర్ష ప్రాయుడైన అతని కుమారుడు చాలా అద్భుత సౌందర్యంగల ఆకారం చక్కని శరీరం వర్ణం కలవాడు."

'రాజస్థానీ పట్టీ పుస్తకాలు, ఔరంగజేబ్‌తో శివాజీ సమావేశాన్ని గురించి ప్రత్యక్ష కథనాన్ని మనకు అందజేస్తాయి. మొఘల్-మరాఠా సంబంధాలలో గుర్తుంచుకొనద

---

[1] జె. ఎన్. సర్కార్, రఘుబీర్‌సింగ్, రాజస్థానీ పత్రాలు, ఆగ్రాలో ఉన్న ఔరంగజేబ్ దగ్గరికి శివాజీ ఆగమనం, కలకత్తా, 1963.

గిన ఆ దృశ్యాన్ని ఇలా వర్ణించడమైంది.[1] "కుమార్ (జయసింగ్ కుమారుడు రామ్ సింగ్), ముఖ్లిస్‌ఖాన్ శివాజీని తోడ్కొని తెస్తున్నారు. అంతలో చక్రవర్తి దివాన్-ఇ-ఆమ్ (ప్రజాసమావేశ మందిరం) ను వదలిపెట్టి 'ఘుసాల్‌ఖానా' అను జనప్రియ నామంగల శిష్ట సమావేశ మందిరం దివాన్ ఇ-ఖాస్ లో ఆసీనుడయ్యాడు. శివాజీ రెండవ మందిరం వద్దకు వెళ్ళాడు. చక్రవర్తి శివాజీని తన సమక్షానికి కొనితెచ్చి పరస్పర సంభాషణకు సమర్పించ వలసిందిగా అసద్‌ఖాన్ బక్షిని ఆజ్ఞాపించాడు. అసద్ ఖాన్ అతనిని చక్రవర్తి సమ్ముఖానికి తీసుకుని వెళ్లాడు. వెయ్యి మొహర్లను రెండువేల రూపాయలను కానుకగా అయిదు వేల రూపాయలను ముడుపుగా చక్రవర్తికి సమర్పించాడు.

"తర్వాత చక్రవర్తికి శివాజీ కుమారుడు శంభాజీని సమర్పించగా, అతను అయిదువందల మొహర్లను, వెయ్యిరూపాయలను కానుకగా, రెండు వేల రూపాయలను ముడుపుగా సమర్పించాడు. శివాజీ తాహిర్ ఖాన్ స్థానంలో రాజా రామ్ సింగ్ ముందు వరుసలో నిలువవలసి వచ్చింది "

"అది చక్రవర్తి జన్మదినము. తమలపాకులు రాకుమారులకు ప్రభువర్గీయులకు పంచినందున శివాజీకి కూడా ఒకటి లభించింది. తరువాత ఆసంతోష సమయంలో రాకుమారులకు, జాఫర్‌ఖాన్‌కు, రాజా జస్వంత్ సింగ్‌కు పట్టు అంగీలను సమర్పించారు. ఈ విషయమై శివాజీ విషణ్ణుడై తర్వాత చిరాకు పడ్డాడు. కోపోద్రిక్తుడైన తరువాత ఆయన కన్నులు అశ్రువులతో నిండాయి. చక్రవర్తి దీనిని గమనించి కుమార్ (రామ్‌సింగ్)కు, 'శివాజీ ఏ విషయమై నొచ్చుకున్నాడో తెలుసుకో' అన్నాడు. అప్పుడు కుమార్ శివాజీ పక్కకు రాగా అతను. 'నేను ఎటువంటి వాడినో నీవు చూస్తున్నావు. నీ తండ్రి చూసివున్నాడు. మీ చక్రవర్తి చూశాడు. అయినా నన్ను మీరు ఇంతసేపు ఉద్దేశపూర్వకంగా నిలబెట్టారు. మీ మన్సబ్‌ను విసర్జిస్తున్నాను. నన్ను నిలబెట్టాలని మీరు తలచినట్లయితే సరియైన హోదాల క్రమంలో మీరు ఆ విధంగా చేసి వుండవలసింది' అని అన్నాడు. వెంటనే అతను వెనక్కి తిరిగి, ప్రభువర్గీయులలోని తన స్థానంనుంచి విసురుగా నడిచిపోసాగాడు. అప్పుడు కుమార్ అతని చేతిని పట్టుకొన్నాడు. కానీ శివాజీ బలవంతంగా పట్టు వదిలించు కొని ఒక ప్రక్కకు వచ్చి, నేలపై కూర్చున్నాడు. కుమార్ అతనిని అనుసరిస్తూ ఆ ప్రదేశానికి వచ్చి మరొకసారి అతన్ని

---

[1] ఇతను ఈ సమావేశానికి పక్షం రోజుల పూర్వం 5,000 అశ్వికదళ మన్సబ్‌దార్‌గా మాత్రమే పదోన్నతి పొందాడు

అనునయించేందుకు ప్రయత్నించాడు. కానీ అతను కుమార్ మాటలను చెవినపెట్టక గట్టిగా ఇలా అన్నాడు. 'నా మరణం సమీపించింది. నన్ను నీ వైనా చంపు లేదా నన్ను నేనే చంపుకొంటాను. నీ ఇష్టమైతే నాతల నరికి దానిని అక్కడికి తీసికొనిపో, కానీ నేను మాత్రం చక్రవర్తి సన్నిధికి తిరిగి రాను' శివాజీని ఒప్పించడం సాధ్యపడలేదు కనుక, కుమార్ చక్రవర్తి వద్దకు పోయి ఆ సమాచారాన్ని అందజేశాడు. చక్రవర్తి ముల్తాఫత్‌ఖాన్‌ను అఖిల్‌ఖాన్‌ను ముఖ్లీస్ ఖాన్‌ను వెళ్లి. శివాజీని ఓదార్చి, అతనికి ఒక పట్టు అంగీని ధరింప చెసి, అతన్ని సింహాసం వద్దకు కొనిరావలసినదిగా, ఆజ్ఞాపించాడు. ఆ ముగ్గురు ప్రభువులూ వచ్చి పట్టుఅంగీని ధరింపుమని శివాజీని కోరారు. 'పట్టు అంగీని పుచ్చు కోవడానికి నేను అంగీకరించను. చక్రవర్తి ఉద్దేశపూర్వకంగానే జస్వంత్‌సింగ్‌కు దిగువన నన్ను నిలబెట్టాడు. నేను అటువంటి (ఉన్నతహోదాగల) వ్యక్తిని అయినప్పటికీ, నన్ను ఉద్దేశ పూర్వకంగా నిలబెట్టారు. చక్రవర్తి మన్సబ్‌ను నేను తిరస్కరిస్తున్నాను నే నాయన భృత్యుడను కాబోను. మీరు కావాలంటె నన్ను చంపివేయండి, నిర్బంధించండి కాని, ఆ పట్టు అంగీని నేను వేసుకోను, అని సమాధానం చెప్పాడు. వారు తిరిగి వెళ్ళి జరిగిన దానిని అంతటినీ చక్రవర్తికి నివేదించారు. చక్రవర్తి కుమార్ (రామ్‌సింగ్)ను అతని స్వగృహానికి శివాజీని వెంట తీసికొని వెళ్లి నచ్చ జెప్పటానికి ప్రయత్నం చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు కుమార్ శివాజీని తన స్వగృహానికి వెంటతీసుకొని వెళ్ళి ఏకాంత మందిరంలో కూర్చుండబెట్టి, అతనితో చర్చించాడు. కానీ అతను వినిపించుకోలేదు.

పైన వ్రాసిన దానికి భిన్నంగా మహమ్మద్ కజామ్ వ్రాసిన 'అలంగీర్‌నామా' మాటలలో: "పుట్టినరోజు వేడుకలనాడు చక్రవర్తి కుమార్ రామ్‌సింగ్‌ను, ముఖ్లాస్‌ఖాన్‌ను అతనికి స్వాగతం చెప్పి, ఆస్థానానికి కొని తేవలసిందిగా ఉత్తర్వు చేశాడు. శివాజీ ఆస్థానానికి వచ్చి, తన వందనాలు సమర్పించాడు. అతను చక్రవర్తి సన్నిధికి వచ్చాడు. సింహాసనానికి సన్నిహితులైన వారికి యోగ్యమైన స్థలంలో ఉన్నత ప్రభువర్గీయులతో సమాన స్థాయిలో అతను నిలబడ్డాడు. ఆ రోజున అతనికి ఘన మర్యాదలు లభించాలని నిర్ణయమయింది. కొన్ని రోజులపాటు అతను ఆస్థానంలో అణకువతో ఉంటూ చక్రవర్తినుంచి కనికరంతో కూడిన ఉపకారాలను పొందుతూ అతని లక్ష్యాలను, కోర్కెలను, సాధించుకొన్న తరువాత వెళ్ళిపోవడానికి శీఘ్రంగా అనుమతి పొందగలడు. కానీ విచిత్రభావాలను కలిగిన సామ్రాజ్య ఆస్థాన మర్యాదలను తెలియని, మనసులో మితిమీరిన ఆశలనూ విపరీతమైన లక్ష్యాలను దాచుకొనిన (తవా

క్కోటీ బేజా, వామఖాసిద్ దూర్ అజకార్, వా ఖయాలతీఖమ్) అజ్ఞానం నిండిన ఈ మచ్చికకు లొంగని జంతువు తన స్థానంలో నిలుచుండిపోయాడు. చక్రవర్తి అతని పట్ల దయగా ఉన్నప్పటికి, ఒక పిచ్చి భ్రమ అజ్ఞానం, అవివేకం కలిగించిన ఆవేశం అతని బుద్ధిలేని తలనుంచి పోలేదు. ఆతను ఒక మూలకు వెళ్ళిపోయి తన రోషాన్ని ప్రదర్శించసాగాడు. అనుచితమైన ఫిర్యాదులు చేసి అయోగ్యమైన కోర్కెలను వెలిబుచ్చినాడు."

"ఈ విషయం వెల్లడికాగానే సార్వభౌముడు శివాజీ తన సముఖంలో ఉండటానికి అర్హుడు కాడని నిర్ణయించాడు. ఆతనిని తన విడిదికి తిరిగి వెళ్ళమని ఆజ్ఞాపించగా, ఈ కారణంగా ఆ రోజున అతని కోసం కేటాయించిన ఉపకారాలను, బహుమానాలను అన్నింటినీ వాయిదా వేయవలసి వచ్చింది. అవివేకి, పాపిష్ఠుడు అయిన ఆ వ్యక్తి చక్రవర్తి కృపాపరిధి నుంచి పతనమయాడు. ఆ నాటి నుంచి అతను ఆస్థానానికి రావటం అనుమతించ కూడదని ఆజ్ఞ జారీ అయినది"

అధికారక ధనం శివాజీకి చెందవలసిన, అతను ఆశించిన మర్యాదలను పూర్తిగా ఉపేక్షించినందుకు దాదాపు క్షమార్పణ వలె చదువతగినది. రాజస్థానీ పట్టీ పుస్తకాలు ఈ సంఘటన ఆగ్రాలో కలిగించిన సంచలనాన్ని కొంత వరకు మనకు తెలియ చేస్తాయి. "ప్రజలు అంతకు పూర్వమే శివాజీ ఉత్కృష్ట ధైర్యసాహసాలను ప్రశంశించారు. ఇప్పుడు చక్రవర్తి సన్నిధికి వచ్చిన తర్వాత అతను అట్టి సాహసాన్ని చూపించి, అట్టి పరుషమైన శక్తిపూర్ణమైన జవాబులు చెప్పినందుకు, ప్రజలు అతని ధైర్యాన్ని ఇతోధికంగా పొగడుతున్నారు"[1] అని 1666 మే 29 నాటి లేఖలో వ్రాసి వుంది.

జాఫర్ ఖాన్ ఇతర మొఘల్ ప్రభువర్గీయులకు 'దివాన్-ఇ-ఖాస్' లోని శివాజీ ప్రవర్తన చక్రవర్తికి గట్టిగా అసమ్మతిని తెలియచేయడానికి అవకాశం కలిగించింది. 'రాజస్థానీ లేఖలు' వారి మాటలను ఉటంకిస్తున్నాయి. "మీ రాజ సన్నిధిలో అటువంటి అవిధేయ అహంకార పూరిత చర్యలకు దిగటానికి ఈ శివాజీ ఎవరు? అయినను సార్వభౌములైన మీరు వాటిని (మందలించకుండా) విడిచి పెట్టారు. ఈ విధంగా అనేక భూస్వాములు ఇక్కడకు వచ్చి అనాగరికంగా ప్రవర్తించగలరు. అప్పుడు పరిపాలన ఏ విధంగా కొనసాగుతుంది? ఆ హిందువుసాహసం ప్రదర్శించాడననే ఈ వార్త ప్రతిదేశానికి చేరుతుంది. అందరు అదే విధంగా ప్రవర్తించగలరు. అప్పుడు

---

[1] రాజస్థానీ లేఖలు, 15 నుండి 16 మే, 1666.

శివాజీని చంపాలి లేదా ఏదైనా దుర్గంలో లేక కారాగారంలో నిర్బంధించాలి అని చక్రవర్తి మనస్సుకు తోచింది. లేదా ఆ నిర్ణయం జరిగింది సిద్దీఫులాద్‌కు శివాజీని (ఆగ్రా దుర్గ రక్షణ దళాధిపతి) రాద్ అందాజ్ ఖాన్ నివాసగృహానికి కొనిపొమ్మని ఆజ్ఞా జారీ అయింది."

**శివాజీ ప్రాణానికి ప్రమాదము**

రామ్‌సింగ్ శిబిరం వద్దగల అతని విడిది నుంచి శివాజీని తరలించే యోచన శివాజీ ప్రాణానికి చాలా హానికరంగా కనబడింది. రాంసింగ్‌కు తండ్రి జయసింగ్, శివాజీ ఆగ్రాలో బస చేసిన కాలంలో అతనికి ఎట్టి హానీ కలగకుండా చూడవలసిం దనే స్పష్టమైన బాధ్యతను అప్పగించాడు. ఈ సంతోషప్రదం కాని యోచన కార్య రూపం దాల్చకుండా చూడడానికి అతను సత్వర చర్యలు తీసుకొన్నాడు. అతను సామ్రాజ్య గణకుడు (బక్షీ) మహమ్మద్ అమీన్ ఖాన్ వద్దకు వెళ్ళి, "చక్రవర్తి చంప తలపెట్టాడు. కానీ అతను (శివాజీ) నాతండ్రి నుండి భద్రతకు హామీ పొంది ఇక్క డకు వచ్చాడు. కాగా చక్రవర్తి ముందు నన్ను చంపి నా కుమారుని పిలిపించి, అత నిని కూడా హతమార్చడం భావ్యంగా ఉంటుంది. మమ్మల్ని చంపిన తర్వాతనే ఆయన శివాజీని చంపాలి లేదా ఆయన ఇష్ట ప్రకారం ఏదైనా చేయవచ్చు." అని చెప్పాడు.

చక్రవర్తి, రామ్‌సింగ్ శివాజీకి హామీగా ఉండగలడా అని తెలుసుకున్నాడు. శివా జీని సంప్రదించిన తరువాత రామ్‌సింగ్ ఒక హామీ పత్రాన్ని (జమాన్‌గిరీ) వ్రాసి ఇచ్చాడు.

తక్షణ ప్రమాదం తప్పింది కానీ మే 16 నాటి అదే (రాజస్థానీ) ఉత్తరం రామ్‌సింగ్‌ను కాబూల్‌లో నియోగించమని చక్రవర్తి ఆజ్ఞాపించాడు. శివాజీని అతని వెంట తీసు కొని వెళ్ళవలసి వుంది. రాద్ అందాజ్ ఖాన్ రామ్ సింగ్‌కు పురోగామిగా ఉండటం గమనార్హము. శివాజీని అటవిక ప్రాంతంలో హతమార్చి, తరువాత శివాజీ అటవికుల దాడిలో మరణించినట్లు, ప్రపంచానికి చాటటం కంటె సులభమైనపని ఉండబోదు. ఆ ఉత్తరం ఇలా పేర్కొన్నది. "శివాజీని చంపదలచినప్పుడు అందాజ్‌ఖాన్ రాంసింగ్ తో కన్వార్‌జీ, నీకు పురోగామిగా నన్ను నియమించారు అని చెప్పాడు."

రామ్‌సింగ్‌తో పాటు తాను కాబూల్ వెళ్ళవలసిఉంటుందని గ్రహించగానే శివాజీ ఆ విధంగా చేయుడానికి నిరాకరించాడు. ఇంతలో అతను సామ్రాజ్య ప్రధానమంత్రి జాఫర్‌ఖాన్‌తో సంబంధం పెట్టుకొన్నాడు జాఫర్‌ఖాన్ ఇతర ప్రభువర్గీయుల మధ్య

తును సంపాదించడానికి శివాజీ వారికి గణనీయమైన మొత్తాలతో సొమ్ము చెల్లించనట్టు కనబడుతున్నది. మే 24 నాటి రాజస్తానీ లేఖ మాటలలో: "జాఫర్ ఖాన్ మద్దతును పొందడానికి అతనికి కొంత సొమ్ము శివాజీ చెల్లించినట్లు నేను విన్నాను. ఇతర చోట్ల కూడా అతను కొద్దో గొప్పో ఖర్చు పెట్టాడు."

రామ్‌సింగ్ శివాజీలను కాబూల్ పంపే ప్రతిపాదన కార్యరూపం దాల్చలేదు శివాజీ కుమారుడు శంభాజీని మాత్రం రామ్‌సింగ్ సాహచర్యంలో ఆస్థానంలో హాజరు కావడానికి అనుమతించారు. మహమ్మద్ అమీన్ ఖాన్ ద్వారా శివాజీ, తన దుర్గాలను తిరిగి తనకు అప్పగించినట్లయితే 2 కోట్ల రూపాయలను చెల్లించి దక్కన్‌లో విశ్వాసంతో చక్రవర్తికి సేవచేయగలనని, ప్రతిపాదిస్తూ చక్రవర్తికి విజ్ఞప్తి సమర్పించాడు.

(దానికి) ఔరంగజేబ్ జవాబు ఆశాజనకంగా లేదు: "అతనిపట్ల నా కనికరాన్ని అవకాశంగా తీసుకొని అతను మతి స్థిమితాన్ని కోల్పోగా అతనికి స్వగృహానికి వెళ్ళడానికి అనుమతి ఏవిధంగా లభిస్తుంది? అతను ఎవరినీ సందర్శించరాదని గట్టిగా చెప్పండి." అందువలన శివాజీ బస చుట్టూ గట్టి కాపలా ఏర్పాటు చేశారు.

'అలంగీర్‌నామా' మనకు తెలియచేస్తున్నది: "అతని (శివాజీ) దుష్ట స్వభావం, సార్వభౌమునికి విశదం కాగానే ఆ దౌర్భాగ్యుడు పారిపోగలడని అనుమానం కలిగినందున, సార్వభౌముడు రక్షక భటాధికారి ఫులాద్ ఖాన్‌కు శివాజీ బస చుట్టూ తన భటులను కాలపా ఉంచమని ఆజ్ఞాపించాడు. ముమ్మరంగా కాపలా కాసే నిమిత్తం ఈ రక్షక భట దళానికి తోడుగా ఒక ఫిరంగి దళాన్ని చేర్చారు." అంతే కాక అలంగీర్‌నామా శివాజీని గురించి జయసింగ్‌ను కూడా సంప్రదించినట్లు తెలియచేస్తున్నది.

మరొకసారి శివాజీ మరణగండాన్ని ఎదుర్కొన్నాడు. జూన్ 7 నాటి రాజ స్థానీ లేఖ యిలా చెపుతుంది. "చక్రవర్తి ముందుగా శివాజీకి సందేశం పంపాడు. నీ దుర్గాల నన్నింటినీ నాకు అప్పగించు. నీకు తిరిగి మన్సబ్ ఇవ్వగలను. నీ అన్న కుమారుని కూడా ఇక్కడికి పిలువు. అతనికి కూడా నేను మన్సబ్ ఇవ్వగలను." దానికి జవాబుగా శివాజీ సమాధానం 'నేను ఏ మన్సబ్‌ను కోరడం లేదు. దుర్గాలపై నాకు అదుపులేదు, చక్రవర్తికి అప్పటికే అతని పట్ల అసంతుష్టి కలిగింది.' వార్తాహరుడు ఈక్రింది వార్తను తెచ్చాడు: "శివాజీ సైన్యాలు స్వదేశం నుంచి వస్తున్న రాంసింగ్ సైనికులు జతకూడుతున్నారు."

"చక్రవర్తి సిద్ధీఫులాద్‌ను, ఫిరంగి దళ అధికారులను, వెళ్ళి శివాజీని చంపండి," అని ఆజ్ఞాపించాడు

చక్రవర్తి నుండి రామ్‌సింగ్‌కు వర్తమానం చేరింది 'నీ స్వంత భూములనుంచి

మనుష్యులు ఇక్కడకు చేరుతున్నట్లు, ఒక సైనిక దళం ప్రోగవుతున్నట్లు మాకు తెలిసింది' రామ్‌సింగ్ మనవి చేశాడు. "నాకు కాబూల్ వెళ్ళవలసిందనే ఆజ్ఞ జారీ అయింది. అందుచేత నా మనుష్యులను పిలిపించాను. ఇప్పుడు నా నియామకాన్ని ఉపసంహరించారు నా మనుష్యులను రావద్దని వారించాను మేము వంశపారంపర్య భృత్యులము. అతడి (శివాజీ) కొరకు సైన్యాన్ని పోగు చేయడానికి అతనెవరు? నేను చక్రవర్తి సేవకుణ్ణి శివాజీ కూడా సేవకుడే. సార్వభౌములైన మీరు మీ ఇష్టం వచ్చినట్లు నిర్ణయించినట్లయితే, అతనిని నిర్బంధించవచ్చు లేదా చంపవచ్చు."

"బేగం సాహెబ్ రోషనారా జోక్యం చేసికొన్నది. ఆమె యిలా అన్నది. 'మీర్జా రాజా (జయసింగ్) నీ ప్రసిద్ధ సేవకుడు అతని హామీపైననే శివాజీ ఇక్కడకు వచ్చి సామ్రాజ్య భృత్యుడయాడు. నీవు అతనిని చంపినట్లయితే నీ హామీ ఇచ్చేవాగ్దానాలపై ఆధారపడి ఎవ్వరూ నీకు తోడ్పడరు, బేగం సాహెబ్ జోక్యం వలన చక్రవర్తి ఆ సంఘటనలో పట్టుదలవహించకుండా విడిచిపెట్టాడు"

"ఒక రోజు శివాజీ రామ్‌సింగ్‌తో 'నీవు చెప్పినదానిని ఇతరులు శ్రద్ధతో వింటారని తలపోశాను. నన్ను గురించి నీవు చక్రవర్తితో మాట్లాడావు. కాని ఆయన దానిని పట్టించుకోలేదు. శివాజీని గురించి ఇక పై నాకు నిర్వహణ బాధ్యతలు లేవని. చక్రవర్తి చిత్తం వచ్చినట్లు అతని (శివాజీ) పట్ల వ్యవహరించవచ్చునని ఆయనకు చెప్పినావు? రామ్‌సింగ్ పక్షాన్ని ఎలా త్యజింపగలను' అని అన్నాడు.

"రెండు రోజుల క్రితం మహారాజ్ కుమార్ (రామ్‌సింగ్) శివాజీ వద్ద తన కాపలాదారులను కూడా నియోగించాడు."

రాజస్థానీ ఉత్తరాలలో ఆగ్రా వీధులలో ప్రచారంలో ఉన్నట్లుగా నమోదైన, అతిశయోక్తులతో నిండిన పుకార్లు చదవడానికి వినోదకరంగా వుంటాయి. వాటి ప్రకారం. "రాజా జస్వంత్‌సింగ్ చక్రవర్తితో 'శివాజీ 14 లేక 15 మూరల ఎత్తు నుంచి క్రిందకు దూకగలడు.' అతను 40 నుంచి 50 కోసుల దూరం నడవగలడు,' అని చెప్పాడు. నీలివార్త వ్యాపించింది. షాజాదా (మూఆజ్జామ్) రాకుమారుడు. గంభీరంగా, 'నేను కూడా ఔరంగాబాద్‌లో దీనిని గురించి విన్నాను,' అని చెప్పాడట. శివాజీ తన కోటలను స్వాధీనపరచేట్లు చేయాలని చక్రవర్తి ఆసక్తితో ఉన్నాడు. ఈ పని శివాజీ చేయలేదు. ఆగ్రా నుంచి వెళ్లి పోవడానికి తాను చేయగల యత్నంలో రామ్‌సింగ్ ప్రమేయం ఉండరాదని శివాజీ యోచించివుండవచ్చు. రామ్ సింగ్ నిర్వహణ బాధ్యత క్రింద తనను ఉంచరాదనీ, తన కొక ప్రత్యేక నివాసాన్ని ఏర్పాటు చేయాలనీ, అతను కోరాడు ఆ కోర్కె యథాప్రకారం శివాజీకి ఎటువంటి హానీ జర

గకుండా రక్షించడానికి చేసిన తన కాపలా ఏర్పాట్లను కొనసాగించాడు.

"జూన్ 7 వ తేదీన శివాజీ తన సేవకుల నందర్నీ పంపివేస్తూ, 'వెళ్ళండి. ఇక్కడ నాతో ఎవరూ ఉండవద్దు. ఇక్కడ నేను ఒంటరిగా ఉంటాను. నన్ను వారు చంపదలచినట్లయితే, చంపనివ్వండి', అని అన్నాడు. రామ్‌సింగ్ వారిని తన బసలో ఉండటానికి అనుమతించాడు. తన సైన్యాన్ని దక్కన్‌కు తిరిగి వెళ్ళడానికి అవసర మైన ప్రయాణ పత్రాలను జారీ చేయవలసినదిగా శివాజీ చక్రవర్తికి కబురు పంపాడు."

మొఘల్ ప్రభుత్వం శివాజీ తప్పించుకొనే వీలు లేకుండా చేయడానికి తగు ఏర్పాట్లను చేసి ఉంటుంది. జూన్ 12 నాటి ఉత్తరం దానికి సూచన: "ఆజ్ఞలు అందాయి. శివాజీ ఎప్పుడైనా ఆగ్రానుంచి మార్వాబాద్ పరగణాకు తప్పించుకొన్న ట్లయితే, అతన్ని నిర్బంధించాలి."

"చక్రవర్తి పై ఒత్తిడి తేవడానికి శివాజీ సన్యాసిగా మారి వారణాసిలో ఉండగ లనని ప్రతిపాదించాడు. చక్రవర్తి అతనిని అలహాబాద్‌లో గవర్నర్ బహదూర్ ఖాన్ రక్షణ క్రింద ఉంచడానికి ప్రతిపాదనచేశాడు."

దక్కన్‌లో బీజాపూర్ పై యుద్ధం యోచించినవిధంగా సాగటంలేదు. జయ సింగ్ సంకటస్థితిలో పడి ఉంటాడు. శివాజీని గురించి రాసిన అతని ఉత్తరం ఆసక్తి దాయక మయింది. తన కుమారుడు రామ్‌సింగ్‌కు వ్రాస్తూ జయసింగ్ ఇలా అన్నా డు[1] "ఈ మాటలను మరెవరికి చెప్పకుండా నేను చెప్పినట్లుగా చక్రవర్తికి తెలియ జేయాలి. ప్రతి క్షణానికి దాని ప్రత్యేక అవసరాలు ఉంటాయి. శివాజీని తిరిగి పంప మని నేను చక్రవర్తిని కోరినప్పుడు, ఇక్కడి పరిస్థితి ఇప్పుడున్న దానికంటే భిన్నంగా ఉంది. ప్రస్తుత పరిస్థితుల్లో ఈ ప్రాంతానికి రావడానికి అతన్ని అనుమతించడం ఎంత మాత్రం రాజనీతి సమ్మతం కాదు. అంతేకాక శివాజీని (ఖైదీగాకాక) అతని అంతస్తుకు తగిన విధంగా నిర్బంధంలో ఉంచాలని చక్రవర్తికి తెలియజేయి. ఇక్కడ ఉన్న అతని అధికారులు అతను తిరిగి రావటం పట్ల నిరాశ చెంది అదిల్షాతో చేరవ లసిన స్థితిలో పడి, మనకు వ్యతిరేకంగా అలజడులు రేకెత్తించకుండా వుండాలి. ఈ విధానం ఈ ప్రాంతానికి సార్వభౌముడు కొత్త సైన్యాన్ని పంపే అవసరాన్ని వారించగలదు." అంతేకాదు, "చక్రవర్తి దక్కన్ చేరిన తరువాత ఆగ్రానుంచి శివా జీని అక్కడకు పిలిపించగలరని వాగ్దానం చేసి శివాజీని సమాధాన పరచాలి. అతని అనుచరులు విశ్వాసంతో మనకు తోడ్పడేట్లు చేయడానికి అతని కుమారుని చక్రవర్తి

[1] సర్కార్, హౌజ్ ఆఫ్ శివాజీ, పుట 166.

వద్దనే ఉంచడం, విధానరీత్యా, తప్పనిసరి."

ఈ చివరి ఉత్తరం దక్కన్‌లో కొనసాగుతున్న దండయాత్రను జయప్రదంగా ముగించడానికి స్వయంగా చక్రవర్తి అక్కడకు వెళ్ళేందుకు తీవ్రంగా యోచిస్తున్నా డని, మనస్సులో నాటుకొన్న భావానికి ప్రతిస్పందన. శివాజీ బీజాపూర్‌తో పొత్తు కలిపే సాధ్య సంఘటనను నివారించడానికి వీలుగా అతన్ని ఉత్తర భారతంలో నిర్బంధించాలని జయసింగ్ కోరుతూ ఉండగా ఔరంగజేబ్, శివాజీ తన దుర్గాలను అప్పగించే విధంగా అతనిపై ఒత్తిడి తేవడం లక్ష్యంగా పెట్టుకొన్నాడు. అతని దుర్గా లన్నీ భద్రంగా తనకు స్వాధీనంలో ఉండేవరకు శివాజీని విడుదల చేయడానికి ఆయన సిద్ధంగా లేడు. అందుకు గాను క్రమంగా ఒత్తిడి అధికం కాసాగింది.

"శివాజీ దుర్గ రక్షణ దళాలు తన ఉత్తరాలను ఖాతరు చేయక పోవచ్చు గనుక తనను దక్కన్ వెళ్ళడానికి అనుమతించినట్లయితే చక్రవర్తికి తన దుర్గాలను అప్ప గించాలని సూచించగా దానికి చక్రవర్తి అతను అక్కడకు వెళ్ళి నప్పుడు దుర్గాలను వారు ఇచ్చివేసినట్లయితే, అతను వారికి వ్రాసినప్పుడు వారు వాటిని ఎందుకు అప్పగించరు?" అని బదులు పలికాడు.

### శివాజీ ఖర్చులు

మరాఠీ చరిత్రకారుడు సభాసద్ సామ్రాజ్య ప్రధాన మంత్రి జాఫర్‌ఖాన్ ఇతర ప్రభువర్గీయులను శివాజీ సందర్శించడాన్ని గురించి మనకు తెలియజేస్తున్నా డు. భీమ్‌సేన్ సక్సేనా కూడా సైనికులకు సాధారణ వ్యక్తులకు శివాజీ ఉదారంగా ఇచ్చిన దానధర్మాలను బహుమానాలను గురించి పేర్కొన్నాడు. అందువలన శివా జీకి ధనలోపం కలిగింది. అతను రామ్‌సింగ్ వద్ద 66,000 రూపాయలు అప్పుచేశా డు. ఈ సొమ్మును జయసింగ్‌కు దక్కన్‌లో ఇచ్చివేశాడు.

ఆగస్టు 23 తేదీనాటి రాజస్థానీ ఉత్తరం శివాజీ తప్పించుకోవడానికి ముందు జరిగిన సంఘటనలను తేటతెల్లం చేస్తుంది: "శివాజీ పలాయనానికి 4 రోజుల ముందు నుంచి కాపలా మరింత కట్టుదిట్టంగా ఏర్పాటు చేశారు. మరొకసారి శివా జీని చంపాలని చక్రవర్తి ఆజ్ఞాపించాడు. కానీ వెంటనే రాజా విఠల్‌దాస్ నివాసంలో అతన్ని ఉంచాలనే తన ఆజ్ఞను సవరించాడు. దుర్దినం సమీపించిందని శివాజీ గ్రహించినందువల్ల (నిర్బంధం నుంచి తప్పించుకొన్నాడు " మరాఠీ చరిత్రల ప్రకారం

[1] సర్కార్, శివాజీ, పుట 149.

శివాజీ 1666 ఆగస్టు 17 న ఆగ్రానుంచి తప్పించుకొన్నాడు. రాజస్థానీ ఉత్తరాలు ఆ సంఘటన 18 న తేదీన జరిగినట్లు సూచించగా. ఆలంగీర్ నామా ఆగస్టు 19 నాడు అతను వెళ్ళి పోయినట్టుగా పేర్కొన్నది. మరాఠీ చరిత్రలు సరిగా వ్రాశాయి. రాజపుత్రులు శివాజీ ఆగస్టు 18 న తప్పించుకొనినట్లు తెలుసుకోవాలని నిశ్చయించగా మొఘల్‌లు శివాజీ కొరకు వేగిర పాటుతో, వెతకిన తరువాత ఆ సంఘటనను మరునాడు మాత్రమే నిర్ధారించారు.

శివాజీ పలాయనం తొందరపాటుతో జరిగిన దర్యాప్తులకూ ఆరోపణలకు ప్రత్యారోపణలకు దారితీసింది. ఆ వివాదంలో రామ్‌సింగ్‌ను చొప్పించడానికి ప్రయత్నాలు చేశారు. ఆ వ్యవహారంలో రామ్‌సింగ్ ప్రమేయం వున్నదని ఔరంగజేబ్ నమ్మినట్లు కనపడింది. కానీ రాజస్థానీ ఉత్తరాలు దీనిని ఋజువు చేయటం లేదు. శివాజీ చాలా జాగ్రత్తతో తన ఎత్తుగడలను రూపొందించుకొని ఉండవచ్చు. అదే విధంగా ఫులాద్‌ఖాన్ నియమించిన కాపలావాళ్ళు కూడ వాటిలో తలదూర్చినట్టు కనపడుతున్నది. చరిత్రకారుడు భీమ్‌సేన్ సక్సేనా గ్రంథస్థం చేసినట్టు శివాజీ కానుకలు దానాలు సఫలమయాయి.

కానీ పెద్ద పండ్లగంపలో దాగి శివాజీ తప్పించుకొన్నాడనే కథను. రక్షక భటకాపలా వారినీ, వారి అధికారులను ఇబ్బందికి గురి కాకుండా చేయడానికి, ప్రచారం చేసినట్లు కనబడుతున్నది. ఈ తలంపును 1666 సెప్టెంబరు 3 నాటి లేఖ బలపరుస్తున్నది. ఆ లేఖలోని అంశాలు ఇవి: "ఆ రోజులో నాలుగు ఘడియలు గడచిన తరువాత వెయ్యిమంది మనుషులు కాపలా బాధ్యతలు నిర్వహిస్తూ ఉండగానే, శివాజీ తప్పించుకొన్నాడనే వార్త వెలువడింది. కచ్చితంగా అతనెప్పుడు తప్పించుకొన్నాడో? ఏ కాపలా విభాగం (చౌకీ) ద్వారా వెళ్ళాడో ఆ రోజు ఎవరూ చెప్పలేకపోయారు. సమాలోచనల తరువాత, గంపలను లోపలికి తెచ్చి అక్కడ నుంచి వెలుపలికి తీసుకొని వెళుతుండేవారిని శివాజీ ఆ గంపల ద్వారా తప్పించుకొన్నాడనీ, నిర్ణయించారు."

ఆ లేఖ, సంఘటన జరిగిన పూర్తిగా 20 రోజుల తర్వాత వ్రాసినది. శివాజీ తప్పించుకొన్న రీతిని గురించి, పరస్పర సంప్రదింపులు జరిపిన తరువాత వారు చేసిన ఊహ అది.

ప్రభుత్వ కథనం దాని కంటే సరి అయినదిగా తోస్తుంది. ఔరంగజేబ్ క్షుణ్ణంగా దర్యాప్తు చేయకుండా ఏ వ్యవహారాన్ని వదలిపెట్టే వ్యక్తి కాదు. ఆలంగీర్‌నామా లో శివాజీ, మారువేషంలో పారిపోయాడని స్పష్టంగా వ్రాసింది.

శివాజీని పొగడుతూ కవి భూషణ్ వ్రాసిన హిందీ పద్యకావ్యం వంటి మరొక సమకాలీన రచనలో ఈ కథనానికి మద్దతు లభించింది. సంస్కృత కవి జయరామ్ షిండే కూడ ఇదే కథనాన్ని సూచించాడు. వేధించే దర్యాప్తుల నుంచి తరువాత శిక్షల నుంచి నిర్లక్ష్యంగా వ్యవహరించిన వర్గాలను రక్షించడానికి కల్పించిన కట్టుక థగా దీనిని తిరస్కరించవలసింది. కొంత కాలం పాటు అవమానానికి గురియైన రామ్‌సింగ్‌ను మినహా మరెవ్వరినీ శిక్షించినట్టుగా కనబడదు.

### శివాజీ (పలాయన) మార్గము

శివాజీ ముందుగా మథురవెళ్ళి అక్కడనుంచి దక్కన్‌కు వెళ్ళినట్టు ఒక వాదన ఉంది. తన పరిజనానికి జారీచేసిన ప్రయాణ పత్రాల (దస్తాక్) సహాయంతో అతను స్వగృహానికి తిన్నని మార్గం పట్టి సెప్టెంబరు 12 న అక్కడకు చేరుకున్నాడు. కాని ఈ వాదన ఒక గూఢచారి నివేదికపై అతిగా ఆధారపడిన దాని ఫలితము. సెప్టెం బరు 27 న జయసింగ్ వ్రాసిన లేఖలో శివాజీ తిరిగి రాలేదని ఉన్నందున అది నమ్మశక్యంకానిది. ఈ లేఖలో తిరిగి రాలేదు (నారసీదా) అనుమాటను తిరిగి వచ్చి నాడు (రసీదా) అని తప్పుగా భాషాంతరీకరించారు. ఈ సందర్భంలో వాటికంటే మరాఠీ చరిత్రలు మనకు తగిన మార్గదర్శకాలు. 'జేథే శాకావళి' శివాజీ శంభాజీ తోడురాగా 1666 నవంబరు 20 న రాజఘఢ్ చేరాడని వ్రాసివుంది. పైన పేర్కొన్న మాటలతో పాటు శంభాజీ శివాజీ వచ్చిన కొంతకాలం తర్వాత దక్కన్‌కు తిరిగి రావడం వలన కూడ కొంత గందరగోళం సంభవించింది. కానీ ఈ గందరగోళాన్ని 'జేథే కరీనా' అనే చరిత్ర పరిష్కరించింది దానిలో, "రాజశ్రీస్వామి మార్గ శీర్షశుద్ధ పంచమి (1666 నవంబరు 20) నాడు రాజగఢ్‌కు విచ్చేశారు. రాజశ్రీ శంభాజీ రాజును బ్రాహ్మణుడు విశ్వాసరావు వద్ద మథురలో ఉంచాడు. విశ్వాసరావు కూడా తీసుకొని వచ్చాడు." అని వ్రాసి ఉంది.

మొఘల్‌లు శివాజీ కోసం గట్టి అన్వేషణ ప్రారంభించారు. మాళ్వాలో దక్క న్‌లో మొఘల్‌లు అనేకులను నిర్బంధించినట్టు ఆస్థాన ప్రకటన పత్రికలు తెలియజే స్తున్నాయి. శివాజీ బహుశా మొఘల్ కాపలా కేంద్రాలకు వీలైనంత దూరంగా తూర్పు వెళ్ళే మార్గం పట్టి ఉంటాడు. మరాఠీ చరిత్రకారుడు సభాసద్, మొఘల్ చరిత్ర కారుడు భీమ్‌సేన్ సక్సేనా ఇరువురూ అలహాబాద్, వారణాసి, గయ, గొండ్వానా, గోల్కొండల మార్గంలో శివాజీ ప్రయాణం చేసినట్టు సూచించారు శివాజీ వారణాసి వెళ్ళాడు. అక్కడ నుంచి ప్రస్తుతం మధ్యప్రదేశ్‌లోని సర్గుజా జిల్లావైపు అతను

క్కోటీ బేజా, వామఖాసిద్ దూర్ అజకార్, వా ఖయాలతీఖమ్) అజ్ఞానం నిండిన ఈ మచ్చికకు లొంగని జంతువు తన స్థానంలో నిలుచుండిపోయాడు. చక్రవర్తి అతని పట్ల దయగా ఉన్నప్పటికి, ఒక పిచ్చి భ్రమ అజ్ఞానం, అవివేకం కలిగించిన ఆవేశం అతని బుద్ధిలేని తలనుంచి పోలేదు. అతను ఒక మూలకు వెళ్ళిపోయి తన రోషాన్ని ప్రదర్శించసాగాడు. అనుచితమైన ఫిర్యాదులు చేసి అయోగ్యమైన కోర్కెలను వెలిబుచ్చినాడు."

"ఈ విషయం వెల్లడికాగానే సార్వభౌముడు శివాజీ తన సముఖంలో ఉండటానికి అర్హుడు కాడని నిర్ణయించాడు. అతనిని తన విడిదికి తిరిగి వెళ్ళమని ఆజ్ఞాపించగా, ఈ కారణంగా ఆ రోజున అతని కోసం కేటాయించిన ఉపకారాలను, బహుమానాలను అన్నింటినీ వాయిదా వేయవలసి వచ్చింది. అవివేకి, పాపిష్టుడు అయిన ఆ వ్యక్తి చక్రవర్తి కృపాపరిధి నుంచి పతనమయాడు. ఆ నాటి నుంచి అతను ఆస్థానానికి రావటం అనుమతించ కూడదని ఆజ్ఞ జారీ అయినది."

అధికారక ధనం శివాజీకి చెందవలసిన, అతను ఆశించిన మర్యాదలను పూర్తిగా ఉపేక్షించినందుకు దాదాపు క్షమార్పణ వలె చదువతగినది. రాజస్థానీ పట్టీ పుస్తకాలు ఈ సంఘటన ఆగ్రాలో కలిగించిన సంచలనాన్ని కొంత వరకు మనకు తెలియచేస్తాయి. "ప్రజలు అంతకు పూర్వమే శివాజీ ఉత్కృష్ట ధైర్యసాహసాలను ప్రశంశించారు. ఇప్పుడు చక్రవర్తి సన్నిధికి వచ్చిన తర్వాత అతను అట్టి సాహసాన్ని చూపించి, అట్టి పరుషమైన శక్తిపూర్ణమైన జవాబులు చెప్పినందుకు, ప్రజలు అతని ధైర్యాన్ని ఇతోధికంగా పొగడుతున్నారు"[1] అని 1666 మే 29 నాటి లేఖలో వ్రాసి వుంది.

జాఫర్ ఖాన్ ఇతర మొఘల్ ప్రభువర్గీయులకు 'దివాన్-ఇ-ఖాస్' లోని శివాజీ ప్రవర్తన చక్రవర్తికి గట్టిగా అసమ్మతిని తెలియచేయడానికి అవకాశం కలిగించింది. 'రాజస్థానీ లేఖలు' వారి మాటలను ఉటంకిస్తున్నాయి. "మీ రాజ సన్నిధిలో అటువంటి అవిధేయ అహంకార పూరిత చర్యలకు దిగటానికి ఈ శివాజీ ఎవరు? అయినను సార్వభౌములైన మీరు వాటిని (మందలించకుండా) విడిచి పెట్టారు. ఈ విధంగా అనేక భూస్వాములు ఇక్కడకు వచ్చి అనాగరికంగా ప్రవర్తించగలరు. అప్పుడు పరిపాలన ఏ విధంగా కొనసాగుతుంది? ఆ హిందువుసాహసం ప్రదర్శించాడననే నీ వార్త ప్రతిదేశానికి చేరుతుంది. అందరు అదే విధంగా ప్రవర్తించగలరు. అప్పుడు

---

[1] రాజస్థానీ లేఖలు, 15 నుండి 16 మే, 1666.

శివాజీని చంపాలి లేదా ఏదైనా దుర్గంలో లేక కారాగారంలో నిర్బంధించాలి అని చక్రవర్తి మనస్సుకు తోచింది. లేదా ఆ నిర్ణయం జరిగింది. సిద్దీఫులాద్‌కు శివాజీని (ఆగ్రా దుర్గ రక్షణ దళాధిపతి) రాద్ అందాజ్ ఖాన్ నివాసగృహానికి కొనిపొమ్మని ఆజ్ఞా జారీ అయింది."

**శివాజీ ప్రాణానికి ప్రమాదము**

రామ్‌సింగ్ శిబిరం వద్దగల అతని విడిది నుంచి శివాజీని తరలించే యోచన శివాజీ ప్రాణానికి చాలా హానికరంగా కనబడింది. రాంసింగ్‌కు తండ్రి జయసింగ్, శివాజీ ఆగ్రాలో బస చేసిన కాలంలో అతనికి ఎట్టి హానీ కలగకుండా చూడవలసిం దనే స్పష్టమైన బాధ్యతను అప్పగించాడు. ఈ సంతోషప్రదం కాని యోచన కార్య రూపం దాల్చకుండా చూడడానికి అతను సత్వర చర్యలు తీసుకొన్నాడు. అతను సామ్రాజ్య గణకుడు (బక్షీ) మహమ్మద్ అమీన్ ఖాన్ వద్దకు వెళ్ళి, "చక్రవర్తి చంప తలపెట్టాడు. కానీ అతను (శివాజీ) నాతండ్రి నుండి భద్రతకు హామీ పొంది ఇక్క డకు వచ్చాడు. కాగా చక్రవర్తి ముందు నన్ను చంపి నా కుమారుని పిలిపించి, అత నిని కూడా హతమార్చడం భావ్యంగా ఉంటుంది. మమ్మల్ని చంపిన తర్వాతనే ఆయన శివాజీని చంపాలి లేదా ఆయన ఇష్ట ప్రకారం ఏదైనా చేయవచ్చు." అని చెప్పాడు.

చక్రవర్తి, రామ్‌సింగ్ శివాజీకి హామీగా ఉండగలడా అని తెలుసుకున్నాడు. శివా జీని సంప్రదించిన తరువాత రామ్‌సింగ్ ఒక హామీ పత్రాన్ని (జమాన్‌గిరీ) వ్రాసి ఇచ్చాడు.

తక్షణ ప్రమాదం తప్పింది కానీ మే 16 నాటి అదే (రాజస్థానీ) ఉత్తరం రామ్‌సింగ్‌ను కాబూల్‌లో నియోగించమని చక్రవర్తి ఆజ్ఞాపించాడు. శివాజీని అతని వెంట తీసు కొని వెళ్ళవలసి వుంది. రాద్ అందాజ్ ఖాన్ రామ్ సింగ్‌కు పురోగామిగా ఉండటం గమనార్హము. శివాజీని అటవిక ప్రాంతంలో హతమార్చి, తరువాత శివాజీ అటవికుల దాడిలో మరణించినట్లు, ప్రపంచానికి చాటటం కంటె సులభమైనపని ఉండబోదు. ఆ ఉత్తరం యిలా పేర్కొన్నది. "శివాజీని చంపదలచినప్పుడు అందాజ్‌ఖాన్ రాంసింగ్ తో కన్వార్‌జీ, నీకు పురోగామిగా నన్ను నియమించారు అని చెప్పాడు."

రామ్‌సింగ్‌తో పాటు తాను కాబూల్ వెళ్ళవలసిఉంటుందని గ్రహించగానే శివాజీ ఆ విధంగా చేయడానికి నిరాకరించాడు. ఇంతలో అతను సామ్రాజ్య ప్రధానమంత్రి జాఫర్‌ఖాన్‌తో సంబంధం పెట్టుకొన్నాడు. జాఫర్‌ఖాన్ ఇతర ప్రభువర్గీయుల మధ్య

తును సంపాదించడానికి శివాజీ వారికి గణనీయమైన మొత్తాలతో సొమ్ము చెల్లించనట్లు కనబడుతున్నది. మే 24 నాటి రాజస్థానీ లేఖ మాటలలో: "జాఫర్ ఖాన్ మద్దతును పొందడానికి అతనికి కొంత సొమ్ము శివాజీ చెల్లించినట్లు నేను విన్నాను. ఇతర చోట్ల కూడా అతను కొద్దో గొప్పో ఖర్చు పెట్టాడు."

రామ్‌సింగ్ శివాజీలను కాబూల్ పంపే ప్రతిపాదన కార్యరూపం దాల్చలేదు శివాజీ కుమారుడు శంభాజీని మాత్రం రామ్‌సింగ్ సాహచర్యంలో ఆస్థానంలో హాజరు కావడానికి అనుమతించారు. మహమ్మద్ అమీన్ ఖాన్ ద్వారా శివాజీ, తన దుర్గాలను తిరిగి తనకు అప్పగించినట్లయితే 2 కోట్ల రూపాయలను చెల్లించి దక్కన్‌లో విశ్వాసంతో చక్రవర్తికి సేవచేయగలనని, ప్రతిపాదిస్తూ చక్రవర్తికి విజ్ఞప్తి సమర్పించాడు.

(దానికి) ఔరంగజేబ్ జవాబు ఆశాజనకంగా లేదు: "అతనిపట్ల నా కనికరాన్ని అవకాశంగా తీసుకొని అతను మతి స్థిమితాన్ని కోల్పోగా అతనికి స్వగృహానికి వెళ్ళడానికి అనుమతి ఏవిధంగా లభిస్తుంది? అతను ఎవరినీ సందర్శించరాదని గట్టిగా చెప్పండి." అందువలన శివాజీ బస చుట్టూ గట్టి కాపలా ఏర్పాటు చేశారు.

'అలంగీర్‌నామా' మనకు తెలియచేస్తున్నది: "అతని (శివాజీ) దుష్ట స్వభావం, సార్వభౌమునికి విశదం కాగానే ఆ దౌర్భాగ్యుడు పారిపోగలడని అనుమానం కలిగినందున, సార్వభౌముడు రక్షక భటాధికారి ఫులాద్ ఖాన్‌కు శివాజీ బస చుట్టూ తన భటులను కాలపా ఉంచమని ఆజ్ఞాపించాడు. ముమ్మరంగా కాపలా కాసే నిమిత్తం ఈ రక్షక భట దళానికి తోడుగా ఒక ఫిరంగి దళాన్ని చేర్చారు." అంతే కాక అలంగీర్‌నామా శివాజీని గురించి జయసింగ్‌ను కూడా సంప్రదించినట్లు తెలియచేస్తున్నది.

మరొకసారి శివాజీ మరణగండాన్ని ఎదుర్కొన్నాడు. జూన్ 7 నాటి రాజ స్థానీ లేఖ యిలా చెప్తుతుంది. "చక్రవర్తి ముందుగా శివాజీకి సందేశం పంపాడు. నీ దుర్గాల నన్నింటినీ నాకు అప్పగించు. నీకు తిరిగి మన్సబ్ ఇవ్వగలను. నీ అన్న కుమారుని కూడా ఇక్కడికి పిలువు. అతనికి కూడా నేను మన్సబ్ ఇవ్వగలను." దానికి జవాబుగా శివాజీ సమాధానం 'నేను ఏ మన్సబ్‌ను కోరడం లేదు. దుర్గాలపై నాకు అదుపులేదు, చక్రవర్తికి అప్పటికే అతని పట్ల అసంతుష్టి కలిగింది.' వార్తాహరుడు ఈక్రింది వార్తను తెచ్చాడు: "శివాజీ సైన్యాలు స్వదేశం నుంచి వస్తున్న రాంసింగ్ సైనికులు జతకూడుతున్నారు."

"చక్రవర్తి సిద్దీఫులాద్‌ను, ఫిరంగి దళ అధికారులను, వెళ్ళి శివాజీని చంపండి," అని ఆజ్ఞాపించాడు.

చక్రవర్తి నుండి రామ్‌సింగ్‌కు వర్తమానం చేరింది 'నీ స్వంత భూములనుంచి

మనుష్యులు ఇక్కడకు చేరుతున్నట్లు, ఒక సైనిక దళం ప్రోగవుతున్నట్లు మాకు తెలిసింది ' రామ్‌సింగ్ మనవి చేశాడు. "నాకు కాబూల్ వెళ్ళవలసిందనే ఆజ్ఞ జారీ అయింది. అందుచేత నా మనుష్యులను పిలిపించాను. ఇప్పుడు నా సియామకాన్ని ఉపసంహరించారు. నా మనుష్యులను రావద్దని వారించాను. మేము వంశపారంపర్య భృత్యులము. అతడి (శివాజీ) కొరకు సైన్యాన్ని పోగు చేయడానికి అతనెవరు? నేను చక్రవర్తి సేవకుణ్ణి శివాజీ కూడా సేవకుడే. సార్వభౌములైన మీరు మీ ఇష్టం వచ్చినట్లు నిర్ణయించి నట్లయితే, అతనిని నిర్బంధించవచ్చు లేదా చంపవచ్చు."

"బేగం సాహెబ్ రోషనారా జోక్యం చేసికొన్నది. ఆమె యిలా అన్నది. 'మీర్జా రాజా (జయసింగ్) నీ ప్రసిద్ధ సేవకుడు. అతని హామీపైననే శివాజీ ఇక్కడకు వచ్చి సామ్రాజ్య భృత్యుడయాడు. నీవు అతనిని చంపినట్లయితే నీ హామీ ఇచ్చేవాగ్దానాలపై ఆధారపడి ఎవ్వరూ నీకు తోడ్పడరు, బేగం సాహెబ్ జోక్యం వలన చక్రవర్తి ఆ సంఘటనలో పట్టుదలవహించకుండా విడిచిపెట్టాడు."

"ఒక రోజు శివాజీ రామ్‌సింగ్‌తో 'నీవు చెప్పినదానిని ఇతరులు శ్రద్ధతో వింటారని తలపోశాను. నన్ను గురించి నీవు చక్రవర్తితో మాట్లాడావు. కాని ఆయన దానిని పట్టించుకోలేదు. శివాజీని గురించి ఇక పై నాకు నిర్వహణ బాధ్యతలు లేవని, చక్రవర్తి చిత్తం వచ్చినట్లు అతని (శివాజీ) పట్ల వ్యవహరించవచ్చునని ఆయనకు చెప్పినావు? రామ్‌సింగ్ పక్షాన్ని ఎలా త్యజింపగలను ' అని అన్నాడు.

"రెండు రోజుల క్రితం మహారాజ్ కుమార్ (రామ్‌సింగ్) శివాజీ వద్ద తన కాపలాదారులను కూడా నియొగించాడు."

రాజస్తానీ ఉత్తరాలలో ఆగ్రా వీధులలో ప్రచారంలో ఉన్నట్లుగా నమోదైన, అతిశయోక్తులతో నిండిన పుకార్లు చదవడానికి వినోదకరంగా వుంటాయి. వాటి ప్రకారం. "రాజా జస్వంత్‌సింగ్ చక్రవర్తితో 'శివాజీ 14 లేక 15 మూరల ఎత్తు నుంచి క్రిందకు దూకగలడు.' అతను 40 నుంచి 50 కోసుల దూరం నడవగలడు,' అని చెప్పాడు. నీలివార్త వ్యాపించింది. షాజాదా (మూఅజ్జామ్) రాకుమారుడు. గంభీరంగా, 'నేను కూడా ఔరంగాబాద్‌లో దీనిని గురించి విన్నాను,' అని చెప్పాడట. శివాజీ తన కోటలను స్వాధీనపరచేట్లు చేయాలని చక్రవర్తి ఆసక్తితో ఉన్నాడు. ఈ పని శివాజీ చేయలేదు. ఆగ్రా నుంచి వెళ్లి పోవడానికి తాను చేయగల యత్నంలో రామ్‌సింగ్ ప్రమేయం ఉండరాదని శివాజీ యోచించివుండవచ్చు. రామ్ సింగ్ నిర్వహణ బాధ్యత క్రింద తనను ఉంచరాదనీ, తన కొక ప్రత్యేక నివాసాన్ని ఏర్పాటు చేయాలనీ, అతను కోరాడు. ఆ కోర్కె యథాప్రకారం శివాజీకి ఎటువంటి హానీ జర

గకుండా రక్షించడానికి చేసిన తన కాపలా ఏర్పాట్లను కొనసాగించాడు.

"జూన్ 7 వ తేదీన శివాజీ తన సేవకుల నందర్నీ పంపివేస్తూ, 'వెళ్ళండి. ఇక్కడ నాతో ఎవరూ ఉండవద్దు. ఇక్కడ నేను ఒంటరిగా ఉంటాను. నన్ను వారు చంపదలచినట్లయితే, చంపనివ్వండి', అని అన్నాడు. రామ్‌సింగ్ వారిని తన బసలో ఉండటానికి అనుమతించాడు. తన సైన్యాన్ని దక్కన్‌కు తిరిగి వెళ్ళడానికి అవసర మైన ప్రయాణ పత్రాలను జారీ చేయవలసినదిగా శివాజీ చక్రవర్తికి కబురు పంపాడు."

మొఘల్ ప్రభుత్వం శివాజీ తప్పించుకొనే వీలు లేకుండా చేయడానికి తగు ఏర్పాట్లను చేసి ఉంటుంది. జూన్ 12 నాటి ఉత్తరం దానికి సూచన: "ఆజ్ఞలు అందాయి. శివాజీ ఎప్పుడైనా ఆగ్రానుంచి మార్యాబాద్ పరగణాకు తప్పించుకొన్న ట్లయితే, అతన్ని నిర్బంధించాలి."

"చక్రవర్తి పై ఒత్తిడి తేవడానికి శివాజీ సన్యాసిగా మారి వారణాసిలో ఉండగ లనని ప్రతిపాదించాడు. చక్రవర్తి అతనిని అలహాబాద్‌లో గవర్నర్ బహదూర్ ఖాన్ రక్షణ క్రింద ఉంచడానికి ప్రతిపాదనచేశాడు."

దక్కన్‌లో బీజాపూర్ పై యుద్ధం యోచించినవిధంగా సాగటంలేదు. జయ సింగ్ సంకటస్థితిలో పడి ఉంటాడు. శివాజీని గురించి రాసిన అతని ఉత్తరం ఆసక్తి దాయక మయింది. తన కుమారుడు రామ్‌సింగ్‌కు వ్రాస్తూ జయసింగ్ ఇలా అన్నా డు[1] "ఈ మాటలను మరెవరికి చెప్పకుండా నేను చెప్పినట్లుగా చక్రవర్తికి తెలియ జేయాలి. ప్రతి క్షణానికి దాని ప్రత్యేక అవసరాలు ఉంటాయి. శివాజీని తిరిగి పంప మని నేను చక్రవర్తిని కోరినప్పుడు, ఇక్కడి పరిస్థితి ఇప్పుడున్న దానికంటే భిన్నంగా ఉంది. ప్రస్తుత పరిస్థితుల్లో ఈ ప్రాంతానికి రావడానికి అతన్ని అనుమతించడం ఎంత మాత్రం రాజనీతి సమ్మతం కాదు. అంతేకాక శివాజీని (ఖైదీగాకాక) అతని అంతస్తుకు తగిన విధంగా నిర్బంధంలో ఉంచాలని చక్రవర్తికి తెలియజేయి. ఇక్కడ ఉన్న అతని అధికారులు అతను తిరిగి రావటం పట్ల నిరాశ చెంది అదిల్షాతో చేరవ లసిన స్థితిలో పడి, మనకు వ్యతిరేకంగా అలజడులు రేకెత్తించకుండా వుండాలి. ఈ విధానం ఈ ప్రాంతానికి సార్వభౌముడు కొత్త సైన్యాన్ని పంపే అవసరాన్ని వారించగలదు." అంతేకాదు, "చక్రవర్తి దక్కన్ చేరిన తరువాత ఆగ్రానుంచి శివా జీని అక్కడకు పిలిపించగలరని వాగ్దానం చేసి శివాజీని సమాధాన పరచాలి. అతని అనుచరులు విశ్వాసంతో మనకు తోడ్పడేట్లు చేయడానికి అతని కుమారుని చక్రవర్తి

---

[1] సర్కార్, హౌజ్ ఆఫ్ శివాజీ, పుట 166.

వద్దనే ఉంచడం, విధానరీత్యా, తప్పనిసరి."

ఈ చివరి ఉత్తరం దక్కన్‌లో కొనసాగుతున్న దండయాత్రను జయప్రదంగా ముగించడానికి స్వయంగా చక్రవర్తి అక్కడకు వెళ్ళేందుకు తీవ్రంగా యోచిస్తున్నా డని, మనస్సులో నాటుకొన్న భావానికి ప్రతిస్పందన. శివాజీ బీజాపూర్‌తో పొత్తు కలిపే సాధ్య సంఘటనను నివారించడానికి వీలుగా అతన్ని ఉత్తర భారతంలో నిర్బంధించాలని జయసింగ్ కోరుతూ ఉండగా ఔరంగజేబ్, శివాజీ తన దుర్గాలను అప్పగించే విధంగా అతనిపై ఒత్తిడి తేవడం లక్ష్యంగా పెట్టుకొన్నాడు. అతని దుర్గా లన్నీ భద్రంగా తనకు స్వాధీనంలో ఉండేవరకు శివాజీని విడుదల చేయడానికి ఆయన సిద్ధంగా లేడు. అందుకు గాను క్రమంగా ఒత్తిడి అధికం కాసాగింది.

"శివాజీ దుర్గ రక్షణ దళాలు తన ఉత్తరాలను ఖాతరు చేయక పోవచ్చు గనుక తనను దక్కన్ వెళ్ళడానికి అనుమతించినట్లయితే చక్రవర్తికి తన దుర్గాలను అప్ప గించాలని సూచించగా దానికి చక్రవర్తి అతను అక్కడకు వెళ్ళి నప్పుడు దుర్గాలను వారు ఇచ్చివేసినట్లయితే, అతను వారికి వ్రాసినప్పుడు వారు వాటిని ఎందుకు అప్పగించరు?" అని బదులు పలికాడు.

శివాజీ ఖర్చులు

మరాఠీ చరిత్రకారుడు సభాసద్ సామ్రాజ్య ప్రధాన మంత్రి జాఫర్‌ఖాన్ ఇతర ప్రభువర్గీయులను శివాజీ సందర్శించడాన్ని గురించి మనకు తెలియజేస్తున్నా డు. భీమ్‌సేన్ సక్సేనా కూడా సైనికులకు సాధారణ వ్యక్తులకు శివాజీ ఉదారంగా ఇచ్చిన దానధర్మాలను బహుమానాలను గురించి పేర్కొన్నాడు. అందువలన శివా జీకి ధనలోపం కలిగింది. అతను రామ్‌సింగ్ వద్ద 66,000 రూపాయలు అప్పుచేశా డు. ఈ సొమ్మును జయసింగ్‌కు దక్కన్‌లో ఇచ్చివేశాడు.

ఆగస్టు 23 తేదీనాటి రాజస్థానీ ఉత్తరం శివాజీ తప్పించుకోవడానికి ముందు జరిగిన సంఘటనలను తేటతెల్లం చేస్తుంది: "శివాజీ పలాయనానికి 4 రోజుల ముందు నుంచి కాపలా మరింత కట్టుదిట్టంగా ఏర్పాటు చేశారు. మరొకసారి శివా జీని చంపాలని చక్రవర్తి అజ్ఞాపించాడు. కానీ వెంటనే రాజా విఠల్‌దాస్ నివాసంలో అతన్ని ఉంచాలనే తన ఆజ్ఞను సవరించాడు. దుర్దినం సమీపించిందని శివాజీ గ్రహించినందువల్ల (నిర్బంధం నుంచి తప్పించుకొన్నాడు." మరాఠీ చరిత్రల ప్రకారం

---

[1] సర్కార్, శివాజీ, పుట 149.

శివాజీ 1666 ఆగస్టు 17 న ఆగ్రానుంచి తప్పించుకొన్నాడు రాజస్తానీ ఉత్తరాలు ఆ సంఘటన 18 న తేదీన జరిగినట్లు సూచించగా, అలంగీర్ నామా ఆగస్టు 19 నాడు ఆతను వెళ్ళి పోయినట్లుగా పేర్కొన్నది. మరాఠీ చరిత్రలు సరిగా వ్రాశాయి. రాజపుత్రులు శివాజీ ఆగస్టు 18 న తప్పించుకొనినట్లు తెలుసుకోవాలని నిశ్చయించగా మొఘల్‌లు శివాజీ కొరకు వేగిర పాటుతో, వెతికిన తరువాత ఆ సంఘటనను మరు నాడు మాత్రమే నిర్ధారించారు.

శివాజీ పలాయనం తొందరపాటుతో జరిగిన దర్యాప్తులకూ ఆరోపణలకు ప్రత్యారోపణలకు దారితీసింది. ఆ వివాదంలో రామ్‌సింగ్‌ను చొప్పించడానికి ప్రయత్నాలు చేశారు. ఆ వ్యవహారంలో రామ్‌సింగ్ ప్రమేయం వున్నదని ఔరంగజేబ్ నమ్మినట్లు కనపడింది. కానీ రాజస్తానీ ఉత్తరాలు దీనిని ఋజువు చేయటం లేదు. శివాజీ చాలా జాగ్రత్తతో తన ఎత్తుగడలను రూపొందించుకొని ఉండవచ్చు. ఆదే విధంగా ఫులాద్‌ఖాన్ నియమించిన కాపలావాళ్ళు కూడ వాటిలో తలదూర్చినట్లు కనపడుతున్నది. చరిత్రకారుడు భీమ్‌సేన్ సక్సేనా గ్రంథస్థం చేసినట్లు శివాజీ కానుకలు దానాలు సఫలమయాయి.

కానీ పెద్ద పండ్లగంపలో దాగి శివాజీ తప్పించుకొన్నాడనే కథను, రక్షక భటకాపలా వారినీ, వారి అధికారులను ఇబ్బందికి గురి కాకుండా చేయడానికి, ప్రచారం చేసినట్లు కనబడుతున్నది. ఈ తలంపును 1666 సెప్టెంబరు 3 నాటి లేఖ బలపరుస్తున్నది. ఆ లేఖలోని అంశాలు ఇవి: "ఆ రోజులో నాలుగు ఘడియలు గడిచిన తరువాత వెయ్యిమంది మనుషులు కాపలా బాధ్యతలు నిర్వహిస్తూ ఉండగానే, శివాజీ తప్పించుకొన్నాడనే వార్త వెలువడింది. కచ్చితంగా అతనెప్పుడు తప్పించుకొన్నాడో? ఏ కాపలా విభాగం (చౌకీ) ద్వారా వెళ్ళాడో ఆ రోజు ఎవరూ చెప్పలేకపోయారు. సమాలోచనల తరువాత, గంపలను లోపలికి తెచ్చి అక్కడ నుంచి వెలుపలికి తీసుకొని వెళుతుండేవారని శివాజీ ఆ గంపల ద్వారా తప్పించుకొన్నాడనీ, నిర్ణయించారు."

ఆ లేఖ, సంఘటన జరిగిన పూర్తిగా 20 రోజుల తర్వాత వ్రాసినది. శివాజీ తప్పించుకొన్న రీతిని గురించి, పరస్పర సంప్రదింపులు జరిపిన తరువాత వారు చేసిన ఊహ అది.

ప్రభుత్వ కథనం దాని కంటే సరి అయినదిగా తోస్తుంది. ఔరంగజేబ్ క్షుణ్ణంగా దర్యాప్తు చేయకుండా ఏ వ్యవహారాన్ని వదలిపెట్టే వ్యక్తి కాదు. అలంగీర్‌నామా లో శివాజీ. మారువేషంలొ పారిపోయాడని స్పష్టంగా వ్రాసింది.

శివాజీని పొగడుతూ కవి భూషణ్ వ్రాసిన హిందీ పద్యకావ్యం వంటి మరొక సమకాలీన రచనలో ఈ కథనానికి మద్దతు లభించింది. సంస్కృత కవి జయరామ్ షిండే కూడ ఇదే కథనాన్ని సూచించాడు. వేధించే దర్యాప్తుల నుంచి తరువాత శిక్షల నుంచి నిర్లక్ష్యంగా వ్యవహరించిన వర్గాలను రక్షించడానికి కల్పించిన కట్టుకథగా దీనిని తిరస్కరించవలసింది. కొంత కాలం పాటు అవమానానికి గురియైన రామ్‌సింగ్‌ను మినహా మరెవ్వరినీ శిక్షించినట్లుగా కనబడదు.

**శివాజీ (పలాయన) మార్గము**

శివాజీ ముందుగా మథురవెళ్ళి అక్కడనుంచి దక్కన్‌కు వెళ్ళినట్లు ఒక వాదన ఉంది. తన పరిజనానికి జారీచేసిన ప్రయాణ పత్రాల (దస్తాక్) సహాయంతో అతను స్వగృహానికి తిన్నని మార్గం పట్టి సెప్టెంబరు 12 న అక్కడకు చేరుకున్నాడు. కాని ఈ వాదన ఒక గూఢచారి నివేదికపై అతిగా ఆధారపడిన దాని ఫలితము. సెప్టెంబరు 27 న జయసింగ్ వ్రాసిన లేఖలో శివాజీ తిరిగి రాలేదని ఉన్నందున అది నమ్మశక్యంకానిది ఈ లేఖలో తిరిగి రాలేదు (నారసీదా) అనుమాటను తిరిగి వచ్చినాడు (రసీదా) అని తప్పుగా భాషాంతరీకరించారు. ఈ సందర్భంలో వాటికంటే మరాఠీ చరిత్రలు మనకు తగిన మార్గదర్శకాలు 'జేథే శాకావళి' శివాజీ శంభాజీ తోడురాగా 1666 నవంబరు 20 న రాజఘఢ్ చేరాడని వ్రాసివుంది. పైన పేర్కొన్న మాటలతో పాటు శంభాజీ శివాజీ వచ్చిన కొంతకాలం తర్వాత దక్కన్‌కు తిరిగి రావడం వలన కూడ కొంత గందరగోళం సంభవించింది. కానీ ఈ గందరగోళాన్ని 'జేథే కరీనా' అనే చరిత్ర పరిష్కరించింది. దానిలో, "రాజశ్రీస్వామి మార్గ శీర్షశుద్ధ పంచమి (1666 నవంబరు 20) నాడు రాజగఢ్‌కు విచ్చేశాడు. రాజశ్రీ శంభాజీ రాజును బ్రాహ్మణుడు విశ్వాసరావు వద్ద మథురలో ఉంచాడు. విశ్వాసరావు కూడా తీసుకొని వచ్చాడు," అని వ్రాసి ఉంది.

మొఘల్‌లు శివాజీ కోసం గట్టి అన్వేషణ ప్రారంభించారు. మాళ్వాలో దక్కన్‌లో మొఘల్‌లు అనేకులను నిర్బంధించినట్లు అస్థాన ప్రకటన పత్రికలు తెలియజేస్తున్నాయి. శివాజీ బహుశా మొఘల్ కాపలా కేంద్రాలకు వీలైనంత దూరంగా తూర్పు వెళ్ళే మార్గం పట్టి ఉంటాడు. మరాఠీ చరిత్రకారుడు సభాసద్, మొఘల్ చరిత్రకారుడు భీమ్‌సేన్ సక్సేనా ఇరువురూ అలహాబాద్, వారణాసి, గయ, గొండ్వానా, గోల్కొండల మార్గంలో శివాజీ ప్రయాణం చేసినట్లు సూచించారు. శివాజీ వారణాసి వెళ్ళాడు. అక్కడ నుంచి ప్రస్తుతం మధ్యప్రదేశ్‌లోని సర్గుజా జిల్లావైపు అతను

మరలి ఉండవచ్చు ఆ పైన అంబికాపూర్, అమరకంటక్, బిలాస్‌పూర్ సమీపంలో రతన్‌పూర్, రాయపూర్, బస్తర్, మిత్ర భూభాగం గోల్కొండల మార్గాన శివాజీ పయనించినట్లు కనబడుతుంది.

శివాజీ ప్రయాణం ప్రమాద భరితంగా సాగింది. మొఘల్‌లకు పట్టుబడకుండా చాలాసార్లు అతను తప్పించుకొన్నాడు. చరిత్ర కారుడు ఖాఫీఖాన్ అప్పట్లో ప్రజా మోదాన్ని పొందిన అట్టి కథల కొన్నింటిని పూసగుచ్చినట్లు వ్రాశాడు.

రాజ్‌గఢ్‌కు శివాజీ సురక్షితంగా చేరిన సందర్భాన్ని మరాఠాలు ఆనందోత్సాహ ప్రదర్శనతో జరుపుకొన్నారు. తరువాత త్వరలో శంభాజీ కూడా తన తండ్రి వద్దకు చేరాడు. శివాజీ రాజ్‌ఘఢ్‌కు భద్రంగా చేరిన తర్వాత ఆ పొరపాటును సవరించుకోవడానికి ఔరంగజేబ్ చేయగలిగినది చాలా స్వల్పము. దక్కన్‌లో యుద్ధం ప్రతికూలంగా పరిణమించినందు వల్ల భారతదేశం పై పర్షియా దండయాత్ర రానున్నదనే పుకార్ల వలన మానసిక ఆందోళనలే ఆ పొరపాటుకు కారణమయ్యాయి.

ఔరంగజేబ్ అహమ్మదనగర్‌లో చనిపోతున్న సమయంలో ఏబదేండ్ల తరువాత కూడా శివాజీ పలాయనాన్ని శోకంతో జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. క్షణకాలం తాను అజాగ్రత్తగా ఉన్నందువల్ల సంభవించిన శివాజీ పలాయనం అంతులేని మనోవ్యధలకు దారితీసినట్లు ఆయన తన మరణ శాసనంలో నమోదుచేశాడు.

మొఘల్‌ల దృష్ట్యా నిస్సంశయంగా అది పొరపాటే. శివాజీని సమాధాన పరచలేక పోవడం ప్రథమశ్రేణి ప్రమాదంగా మారింది. మిత్రుడుగా శివాజీ తన రాజ్యాన్ని విస్తరించుకొనగలిగినా, గొల్కొండ బీజాపూర్ రాజ్యాలను అంతమొందించుటలో కూడా మొఘల్‌ల కతను ఘనంగా ఉపయోగపడి ఉండేవాడు. భారతదేశ చరిత్రలోని సంఘటనలు చెప్పే వృత్తాంతం మరొక విధంగా ఉండి ఉండేది. జరిగినదేమిటంటే శివాజీ తిరిగి మొఘల్‌లను విశ్వసించలేదు. మొఘల్‌ల మరాఠాల మధ్య విస్తరించిన అంతరం తర్వాత పదునెనిమిదవ శతాబ్దంలో అతి ముఖ్యమైన పరిణామాలకు దారితీసింది.

శివాజీ (నిర్బంధంనుంచి) తప్పించుకోకుండా ఉండినట్లయితే లేదా తప్పించుకొనిపోతూండగా పట్టుబడినట్లయితే అతనికి ఏ గతి పట్టి ఉండేదో ఊహించడం కష్టం కాదు. అతని సేనాని నేతాజీ పాల్కర్ మాయోపాయం ద్వారా (మొఘల్‌ల) చేజిక్కి బలవంతంగా అన్యమత స్వీకారం చేశాడు. సంవత్సరాలు గడిచిన తరువాత శివాజీ కుమారుడు శంభాజీ పట్టుబడి నేత్రాలు పోగొట్టుకొని, తర్వాత ఉరికంబానికి బలి అయ్యాడు. ఆ సమయంలో ఔరంగజేబ్ చెంత ఉన్న చరిత్రకారుడు సాకి ముస్తైయిద్ ఖాన్ శంభాజీ కండ్లు పెరకటానికి సామ్రాజ్యం దృష్టా కారణాన్ని

ఈ మాటలలో పొందుపరిచినాడు. "అంతకుమునుపు సామ్రాజ్యం క్షమాగుణం విలువలనలక్ష్యం చేసి మొదటిసారి చక్రవర్తి ఆ స్థానం నుంచి తన తండ్రితో కలిసి, రెండవసారి కీర్తిశేషుడు దిలేర్ ఖాన్ నుంచి పారిపోయినందుకు, అదేరాత్రి అతని కన్నులు చూసే శక్తిని పోగొట్టుకున్నాడు."[1]

శివాజీ పలాయనానికి ప్రతిస్పందనగా ఔరంగజేబ్ మొఘల్‌ల కొలువు అంగీకరించిన నేతాజీ పాల్కర్‌ను నిర్బంధించమని ఆజ్ఞ జారీ చేశాడు. ఈ చర్యను శివాజీ తప్పించుకోవడం వల్ల కలిగిన క్రోధం, శివాజీతో నేతాజీ పాల్కర్ తిరిగిచేరే అవకాశాన్ని నివారించే ఆతురత నిర్దేశించి ఉంటాయి. నేతాజీని ఆగ్రాకు కొనితెచ్చి ఇస్లాం మతానుయాయిగా చేసి, మహ్మద్ కులీ ఖాన్ పేరిట 3,000 అశ్వికదళ నాయకత్వం ఇచ్చే మన్సబ్‌ను ప్రసాదించారు. అతన్ని కాబూల్ రాష్ట్రపాలనకు అనుబంధించారు.

జయసింగ్ పట్టుదల వహించినప్పటికీ, బీజాపూర్ పై యుద్ధం సఫలీకృతం కాని పోరాటంగా మిగిలింది. అవమానభారాన్ని తప్పించగల శాంతి ఒడంబడికను బీజాపూర్‌తో కుదుర్చుకొన్నారు. జయసింగ్‌ను వెనుకకు రప్పించగా, మూఅజ్జామ్ రాకుమారుడు దక్కన్‌కు రాజప్రతినిధిగా నియమితుడయాడు. అతను 1667 మే లో ఔరంగాబాద్ చేరాడు. జయసింగ్ ఆగ్రాకు బయలుదేరి వెళుతూ దారిలో (మధుమేహ వ్యాధిపీడితుడయ్యాడు) అతను జబ్బుపడి బుర్హాన్‌పూర్ వద్ద 1667 ఆగస్టు 28 నాడు మరణించాడు. ఔరంగజేబ్ కుతంత్రాల్లో చిక్కి అతను మరణించాడనే పుకారులో నిజం లేదు.

అయితే మొఘల్ పరిపాలనలో రాజపుత్ర ప్రభావం పట్ల తీవ్ర ప్రతికూల భావం గల ఔరంగజేబ్‌కు, అతని మరణం ఉపశమనం కలిగించి ఉంటుంది. జయసింగ్, జోధ్‌పూర్‌కు చెందిన జస్వంత్‌సింగ్ నాటి రాజపుత్రులలో ప్రాబల్యం కల వ్యక్తులు, జయసింగ్ పుత్రుడు రామ్‌సింగ్‌కు జయపూర్ రాజ్యాన్ని ఇచ్చినప్పటికీ, అతన్ని అస్సాం దండయాత్రకు పంపారు. జయపూర్ రాజవంశానికి పట్టిన గ్రహణం, ఔరంగజేబ్ మరణానంతరమే తొలగింది.

ఒక దశాబ్దం తరువాత, జస్వంత్‌సింగ్ మరణానంతరం జోధ్‌పూర్‌లో కొత్త పరిణామాలు సంభవించాయి.

పర్షియా రాజు గతించిన తరువాత, భారతదేశంపై పర్షియా దండయాత్ర ప్రమాదం అంతరించింది. అయినప్పటికి దేశం వాయవ్య ప్రాంతాల్లోని ఆటవిక జాతులు

[1] సాకి ముస్తెయిద్‌ఖాన్, మసిరే అలంగిరి.

అరాచక స్థితిలో వున్నాయి. దేశం తూర్పు ప్రాంతాలలో కూడా, అస్సాం లోపలి భాగాలలోని మొఘల్‌ల పురోగమనం కుంటుబడింది. ఔరంగజేబ్ బీజాపూర్‌పై కొత్త దండయాత్రను ప్రారంభించే స్థితిలోగాని, శివాజీ పై యుద్ధం చేసే స్థితిలో గాని లేడు. సాధుస్వభావం కలిగి శాంతి ప్రియుడైన మూఅజ్జామ్‌ను దక్కన్‌లో రాజప్రతి నిధిగా నియమించడం పరిస్థితులు ఏ దిశగా మారుతున్నాయో సూచిస్తున్నాయి.

శివాజీ కూడా శాంతిని వాంఛించాడు. తన అధీనప్రాంతం తగ్గినందువల్ల తన స్థానాన్ని బలపర్చుకోవడానికి వీలైతే బీజాపూర్ ఇతర పొరుగు వారి పట్ల అనుసరిం చవలసిన కొత్త విధానాలను రూపొందించు కోవడానికి అతనికి వ్యవధి కావలసి వచ్చింది. మొఘల్‌లను నిజాయితీతో సేవించే కోర్కె కలవాడుగా, వారి అనుగ్రహ పాత్రునిగా తన రూపాన్ని ప్రదర్శించవలసివచ్చింది.

ఇరు పక్షాలూ శివాజీ ఆగ్రానుంచి తప్పించుకొన్న సంఘటన ప్రాధాన్యాన్ని తగ్గించాయి. అందువల్లనే శివాజీ ఆగ్రానుంచి తప్పించుకొని దక్కన్‌కు వచ్చిన రీతి, పద్ధతికి సంబంధించిన వివరాలు సమకాలీన పత్రాలలో ఎక్కువగా లభ్యంకాలేదు.

**శాంతి**

మే 6, 1667 నాటి పర్షియన్ వార్తా లేఖలో ఇలా వుంది: "చక్రవర్తి ప్రధాన మంత్రికి శివాజీ తరపున న్యాయవ్యవహర్త(వకీల్) ను పిలిపించి, అతనికి నచ్చ చెప్పి రెండు నెలలలోగా తిరిగి వచ్చేటట్లుగా అతని యజమాని వద్దకు పంపుమని ఆజ్ఞాపించాడు. శివాజీకి ఆ న్యాయవ్యవహర్త సార్వభౌముడు అతని అపరాధాలను క్షమించాడని, అతని కుమారుని (శంభాజీ) సామ్రాజ్యోద్యోగిగా (మన్సబ్‌దార్‌గా) చేర్చుకొన్నాడని, బీజాపూర్ భూభాగాలను సాధ్యపడిన మేరకు ఆక్రమించడానికి అతనికి స్వేచ్ఛకలదని, లేదా అతను తన భూభాగపు హద్దులకు పూర్తిగా పరిమిత మై చక్రవర్తి కుమారుని ఆజ్ఞానువర్తిగా ఉండాలని తెలియజేయాలి."

దానికి తోడుగా 1667 అక్టోబరు 3 నాటి వార్తా లేఖ ఈ విధంగా వుంది. "మహ మ్మద్ మూ అజ్జామ్ రాకుమారుని నుంచి ఈ ఫలితార్థం గల లేఖ చక్రవర్తికి అందింది." శివాజీ నాకు ఉత్తరం వ్రాస్తూ, "నేను సామ్రాజ్య ఆస్థానంలో వంశపారంపర్య భృత్యు డను. నా కుమారుడు శంభాజీ 5,000 అశ్విక దళాధికారి (మన్సబ్‌దార్) హోదాను పొందాడు. కాని జీవనాధార భృతి (తన్‌ఖ్యా) అతను ఏ జాగీరును పొందలేదు. ప్రస్తుతం నేను ఈ సేవకుని అపరాధాలను మన్నించమని, నా కుమారుని మన్సబ్‌ను పునరుద్ధరించ వలసిందని అర్థిస్తున్నాను. నేను తాము ఆజ్ఞాపించిన ప్రదేశాలలో

స్వయంగా సేవచేయడానికి సిద్ధంగా ఉన్నాను."

"నాకు అప్పగించిన దుర్గాల తాలూకు భూభాగంలో అతనికి జాగీర్లు కేటాయి స్తున్నావా! అతను వచ్చి (మూ అజ్జామ్) రా కుమారుని క్రింద సేవచేయాలి,"అని ఔరంగజేబ్ ఆజ్ఞ జారీ చేశాడు.

ఆవిధంగా బేరార్, ఇతర ప్రదేశాలలో జాగీర్లు పొందిన శంభాజీ మొఘల్ రాజ ప్రతినిధి నివాస స్థలమైన ఔరంగబాదుకు మొఘల్‌లకు సేవ చేయడానికి తన సైనిక దళంతో రావటం సంభవించింది. అతను 1667 నవంబర్ 4 న మూ అజ్జామ్ రాకు మారుని సందర్శించాడు. ఒక సంవత్సరం క్రితమే, ఆ శంభాజీ (అతని తండ్రి) మొఘల్‌లు వెంట తరుముతూ వుండగా తప్పించుకొని మారువేషంలో దక్కన్ చేర వలసి వచ్చింది. శంభాజీ కేవలం దశవర్ష ప్రాయుడైనందున, రాజగఢ్ వెళ్ళిపోవడా నికి అనుమతించారు. మూ అజ్జామ్ రాకుమారుడు 1668 మార్చి 9 న వ్రాసిన లేఖ నుంచి శివాజీ, తనను గురించిన సంశయాలను తొలగించే నిమిత్తం ఎంతవరకు ప్రయత్నించగలడో గ్రహించవచ్చు: "నీ కోర్కెలకు పరాకాష్ఠగా, దయాళువైన సార్వ భౌముడు నీకు రాజా బిరుదును అనుగ్రహించి, నీ శిరస్సుకు ఔన్నత్యాన్ని కల్గించా డు." 'నీ కోర్కెలకు పరాకాష్ఠ' అను మాటలు చాలా భావగర్భితమయినవి. శివాజీ ఆ బిరుదు కావాలని కోరినట్లు ఎవరైనా భావించవచ్చు.

వీలైనంతవరకు బీజాపూర్ భూభాగాన్ని స్వాధీన పరచుకొనడానికి మొఘల్‌ల నుంచి శివాజీ ఆమోదం పొందాడు. బీజాపూర్ బాలఘాట్ అనే నామంగల ఆ భూభాగంలో ప్రస్తుతపు సతారా, సాంగ్లీ, కొల్హాపూర్ జిల్లాలు ఉన్నాయి. అందుకు శివాజీ తగు సమయం కోసరం వేచి ఉండవలసి వచ్చింది. బీజాపూర్ నుంచి రాగల ప్రమాదాన్ని నివారించి కొంకణ్ చేయి జారిపోకుండా చూడటం ఆయనకు తక్షణం వ్యాకులాన్ని కలిగించే అంశమయింది. బీజాపూర్ సేనాని రుస్తుంజమాన్ 1666 లో ఫోండాను, ఇతర స్థలాలను స్వాధీనపరచుకొన్నాడు. అయితే అతను శివాజీకి రంగ్నా దుర్గాన్ని తిరిగి అప్పగించాడు. బీజాపూర్ రాజ్యం అబుల్ మహ మ్మద్ ఇత్యాది తన సేనానుల ద్వారా కొంకణ్‌ను తిరిగి వశపరచుకోవడానికి ప్రయ త్నాలు చేసింది. ఆ ప్రయత్నాలు విఫలం కాగా, ఫోండా, జంభావళీ పంచమహల్, మినహా తనకు చెందిన భూభాగాలన్నింటినీ తిరిగి శివాజీ వశపరచుకొన్నాడు.

ఈ సమయంలో శివాజీ భూభాగాలు దక్షిణ కొంకణ్‌లోని పోర్చుగీసువారి ప్రాంతా లకు సమాంతరంగా విస్తరించాయి.

పోర్చుగీసువారు జయసింగ్‌తో 1666 నవంబర్ 17 న ఒక అంగీకారానికి

వచ్చారు. దాని షరతులలో ఒకటి ఇది: "మొఘల్ చక్రవర్తి పై తిరుగుబాటు చేసిన వ్యక్తికి పోర్చుగీసు వారు తమ రాజ్యంలో అశ్రయాన్ని ఇవ్వరాదు. వానిని పోర్చుగీసురాజుపై తిరుగుబాటుదారునిగా పరిగణించాలి." మొఘల్‌ల వ్యవహారాలలో పోర్చుగీసువారు తలదూర్చినట్లు శివాజీ బహుశః గమనించి ఉంటాడు.

దక్షిణ కొంకణ్‌కు చెందిన దేశాయిలు ఆ ప్రాంతంలోని తమ భూభాగాలనుంచి పోర్చుగీసు అధీన ప్రాంతంలోకి పారిపోయి గోవాను తమ కార్యకలాపాలకు కేంద్రంగా వినియోగించారు. శివాజీ రాజ్యంలోకి వారు చొచ్చుకొని రాసాగారు. లఖమ్ సావంత్, కేశవ్ నాయక్, కేశవ్ ప్రభు అనే దేశాయిల కార్యకలాపాలను పోర్చుగీసువారు రహస్యంగా ప్రోత్సహించారు. ఈ దేశాయిలలో లఖమ్ సావంత్, కుడాల్‌కు చెందిన అతని అన్న కుమారుడు నర్బా సావంత్ పోర్చుగీసు భూభాగమైన బర్దేశ్‌లో బసచేస్తుండేవారు. ఈ కాందిశీకులను వెంటనే పారద్రోలి, పోర్చుగీసు వారికి గుణపాఠం నేర్పడానికి 1667 నవంబర్‌లో శివాజీ గోవాపై ఆకస్మికంగా దాడి చేశాడు.

డచ్చివారు చెప్పిన దాని ప్రకారం శివాజీ నవంబరు 8 న రంగ్నా చేరాడు. ఆ సమీపంలో 17 వ తేదీ వరకు అతను బసచేశాడు. ఆయన వెంట 5,000 కాల్బలాన్ని 1,000 అశ్వికదళాన్ని తెచ్చాడు. నవంబర్ 20 న బర్దేశ్ భూభాగంలోనికి హఠాత్తుగా ప్రవేశించాడు. ఆ రోజున మూడు ముఖ్యమైన గ్రామాలను ఆయన కొల్లగొట్టాడు. మూడు రోజుల లోపల పోర్చుగీసు వారు ప్రతిఘటనకు పూనుకొనక ముందే దాదాపు బర్దేశ్ అంతటినీ చుట్టబెట్టి దోచుకొన్నాడు. శివాజీకి దోచుకోవడం, పోర్చుగీసువారి ఆశ్రమంలో దాగిన తిరుగుబాటుదారులు దేశాయిలను బలవంతంగా తీసుకొని పోవడం ప్రధాన లక్ష్యాలు. దేశాయిలు స్వాధీనులు కాకుండా తప్పించుకొని అప్పటికే బర్దేశ్ నుంచి గోవా పారిపోయారు. పోర్చుగీసు భూభాగంపై జరిగిన విధ్వంసకాండ గణనీయమైనది. ఆ శిక్ష వడిగా, తీవ్రంగా విధించినట్టిది. ఫిస్సూర్‌లెన్సర్ ఇతర చరిత్ర కారులు విస్తృతంగా సాగించిన పరిశోధనల వల్ల ఘోర క్రూర కృత్యాలు జరిగాయని, సమకాలీనంగా వ్యాపించిన హద్దూ అపూలేని పుకార్లతో పాటు, మతపరమైన యుద్ధం జరిగిందని కొందరు ఆధునిక చరిత్రకారులు ఇటీవల అభిప్రాయపడ్డారు కానీ అవి బుజువుకాకుండా పోయాయి. అది పూర్తిగా రాజకీయ ప్రాధాన్యంగల యుద్ధము. పోర్చుగీసువారు మంచి గుణపాఠం నేర్పినట్లయింది.

శివాజీ నవంబర్ 23 న పోర్చుగీసు భూభాగాన్ని వదలి వెళ్ళిపోయాడు. శాంతి సంప్రదింపులు ప్రారంభమయ్యాయి. మరాఠాలు 1667 డిసెంబరు 12 న సంధిపై సంతకాలు చేశారు.

గోవాలోని పురాతన పత్రభాండాగారంలో ఆ సంధి తాలూకు పోర్చుగీస్ మరాఠీ పాఠాంతరాలు నిక్షిప్తమయాయి. తక్కిన అంశాలతో పాటు ఈ సంధి ఖైదీలను, పశువులను, వస్తువులను, విడుదల చేయడానికి, దేశాయిల కార్యకలాపాలను పోర్చుగీసు వారు జాగ్రత్తగా కనిపెట్టిఉండేటట్లు హామీ ఇవ్వడానికి ఏర్పాటు చేసింది.

పోర్చుగీసువారు క్రీ.శ. 1540 లో దివాడీలో ఉన్న సప్తకోటీశ్వరుని ఆది దేవాలయాన్ని నేలమట్టం చేశారు. హిందువులు 1558 లో సమీపంలో ఉన్న ప్రాంతంలో అదే దేవస్థానాన్ని ప్రతిష్ఠించారు భటగ్రాంలో నార్వా వద్ద నెలకొన్న ఆ దేవస్థానం అతి జీర్ణస్థితిలో ఉంది. శివాజీ నవంబర్‌లో దానిని పునరుద్ధరణ చేయించాడు.

అన్ని మతాలపట్ల, అన్ని మతాలకు చెందిన పవిత్ర మహాపురుషుల పట్ల శివాజీకి గల గౌరవం జగమెరిగినది. ఆయన మత కార్యకలాపాలు-వివిధ మతాలకు చెందిన దేవస్థానాలకు సమాధులకు సహాయాన్ని అందించటమే కాక, దౌర్జన్యానికి గురియైన దేవాలయాల పునః ప్రతిష్ఠకు పునర్ నిర్మాణానికి కూడ విస్తరించాయి. శివాజీకి విచక్షణారహితమైన విధ్వంసకాండ పట్ల ఓరిమిలేదు. ఏ విధమైన ప్రతీకార చర్య ఆయన లక్ష్య మైనట్లు కనపడదు.

ఈ సమయంలోనే ఫ్రెంచివారు కూడా శివాజీనుంచి ఆయన రాజ్యంలో వర్తక వాణిజ్యాలను కొనసాగించడానికి అనుమతి పొందారు. వారు కొంకణ్‌లోని రాజాపూర్ వద్ద ఒక వర్తకకేంద్రాన్ని ప్రారంభించారు. ఫ్రాంక్వాయిస్ మార్టిన్ వ్రాసిన దిన చర్య గ్రంథంలో ఇది సూచన ప్రాయంగా ఉంది. అతను 1669 జనవరి 17 న సూరత్ వెళ్ళడానికి కాలికట్ వచ్చినప్పుడు ఫ్రెంచివారు. "వారు (ఫ్రేయస్, జె.బూరియన్) రాజాపూర్ వెళ్ళినట్లు, రాజా శివాజీని అక్కడ వారు చూడగా, ఆయన వారిని చక్కగా ఆదరించి, వారికి ఆయన రాజ్యంలో వ్యాపారం చేసుకోవడానికి స్థిరంగా నెలకొనడానికి అనుమతించినట్లు తెలిపారు."[1]

బొంబాయిలో 1665 నుంచి స్థిరజీవనాన్ని సాగిస్తున్న బ్రిటిష్‌వారి కార్య కలాపాలు బొంబాయి ద్వీపానికి పరిమితమయాయి. సాల్సెట్ ద్వీపం (థానా దాని సమీప స్థలాలు) పోర్చుగీసు వారి అధీనంలో ఉంది. ప్రధాన భూభాగానికి వెళ్ళడానికి బ్రిటిషువారికి వేరే దారిలేదు. శివాజీ రాజ్యంలోని పెన్ పట్టణాన్ని సంపాదించడానికి వారు యత్నించారు. "అది వాస్తవానికి శివాజీ భూభాగంలో ఉన్నప్పటికీ, శివాజీ ఔరంగజేబ్‌కు సామంతుడయాడు కనుక రాకుమారుడు ఆజ్ఞాపించి నట్లు

---

[1] వి.జి. హటాల్కర్, రిలేషన్స్ బిట్వీన్ దఫ్రెంచి అండ్ ద మరాఠాస్, బొంబాయి, 1958.

అతను నడచుకోవలసి ఉంటుందని" వారు ఆశించారు. ఆ ప్రయత్నాలు ఫల ప్రదంకాలేదు.

కొంకణ్‌లోని జంజిరాకు చెందిన సిద్ధీల అధికారాన్ని నాశనం చేయుటయే శివాజీ నిరంతర లక్ష్యం. సాగరతీరంలో ఆయన ఆధిక్యానికి వారు సవాలుగా ఉండేవారు. మొదట అహ్మద్ నగర్, తరువాత బీజాపూర్ కొలువుచేసే అధికారులుగా జంజీరా లోని వారి దుర్గాన్ని విడవకుండా అంటిపెట్టుకొని ఉన్నారు. ఇప్పుడు వారు మొఘల్ సహాయాన్ని అపేక్షిస్తున్నాను. బ్రిటిషువారు పోర్చుగీసువారు కూడా వారిని ఆదుకోవ డానికి సిద్ధంగా వుంటూ వచ్చారు. ఈ పరిస్థితులతో పాటు బీజాపూర్‌తో మొఘల్‌లతో (పోరాటంలో) శివాజీ నిమగ్నుడయినందువల్ల వారు నిర్మూలనం కాకుండా మిగిలా రు. మొఘల్‌లతో కూడిన ఒప్పందం వలన కొంకణ్‌లో పూర్తిగా అధిపత్యానికీ పూర్తి నియంత్రణకు శివాజీకి హామీ లభించింది. ఆ విధంగా జంజీరా ఆయన ప్రభావ మండలంలో చేరింది. ఆయన జంజీరాను ముట్టడించారు. బ్రిటిష్‌వారు 1669 అక్టో బర్‌లో యిలా వ్రాశారు. "సిద్ధీ శివాజీ రాజావల్ల చాలా ఇబ్బందిలో పడ్డాడు. ఆయన ఆ స్థలాన్ని (జంజీరాను) బల ప్రయోగం ద్వారా స్వాధీనం చేసికోలేనందు వల్ల సాయుధ బలగాలను ఉపసంహరించమని మొఘల్ సార్వభౌముని ఆజ్ఞ ఉన్నప్ప టికీ అతనికి (సిద్దీ) ఆహారపదార్థాలు చిక్కనివ్వక లోబర్చుకోవాలని మాత్రమే తలచా డు. కాగా చివరకు (జంజీరాను) స్వాధీనపరచకుండా ఉండటానికి సిద్ధీ నిశ్చయించు కున్నాడు. చివరి దశలో కళ్యాణ్ దరిదాపుల్లో లోధీఖాన్ ఆధిపత్యం క్రింద సైన్యాన్ని ఉంచిన మొఘల్‌లకు దానిని అప్పగించాలనే ఆలోచన చేశాడు."

బ్రిటిష్‌వారు జంజీరాను తామే స్వాధీన పరచుకోవాలని కూడా ఆలోచన చేశా రు. పోర్చుగీసువారు శివాజీని ప్రతిఘటించడానికి సిద్ధీకి చురుకుగా తోడ్పడినారు. వారు 1670 ఫిబ్రవరి 10 నాటి సంధి షరతుల క్రింద శివాజీ సిద్ధీల మధ్య, మధ్య వర్తిత్వం చేయడానికి కూడా ప్రతిపాదన చేశారు. శివాజీ తన ప్రాంతంలో ఈ విధ మైన జోక్యాన్ని సహించలేదు. మొఘల్‌లు ఆయన కార్యకలాపాలను, వారు అవస రమనీ, వాంఛనీయమనీ భావించిన ఏ రీతిలోనైనా ఆటంక పరచడానికి కృత నిశ్చ యులై ఉన్నట్లు, ఆయన విశ్వసించాడు.

జంజీరా ముట్టడి జరుగుతుండగానే మొఘల్‌ల మరాఠాల మధ్య యుద్ధం ఆక స్మికంగా ప్రారంభమైనది. అది 37 సం॥ పాటు జరిగి 1707 లో ఔరంగజేబ్ మర ణించే వరకు, కొనసాగింది.

[1] శివాజీ పై, ఇంగ్లీష్ రికార్డులు, పుట 135.

# 6
# మొఘల్‌లతో యుద్ధం

చరిత్రకారుడు భీమ్‌సేన్ సక్సేనా వ్రాసిన దాని ప్రకారం శంభాజీ జాగీర్లలోని మహల్‌లను జప్తుచేయటం, మరాఠాలు ఔరంగాబాద్ నుంచి వెళ్ళి పోవడం మొఘల్‌ల మరాఠాల మధ్య జగడానికి కారణాలు. కానీ శివాజీ జీవితకథ వ్రాసిన సభాసద్ ప్రకారం, ఔరంగజేబ్ సంశయాత్మక స్వభావం, ఔరంగాబాద్ లోని మరాఠా దళానికి చెందిన అధికారులను సైనికులను నిరాయుధుల్ని చేసి నిర్బంధంలో ఉంచాలనే అతని ఆజ్ఞ ఆ సంఘర్షణకు కారణము.

'జేధే చరిత్రలు' ప్రకారం, ఇలా వ్రాసివుంది. "ఔరంగజేబ్ 1669 ఆగష్టు 17 నుంచి సెప్టెంబర్ 15 వరకు వారణాశిలో విధ్వంసకాండకు ఉపక్రమించి, దేవాలయాలను నాశనం చేశాడు. మొఘల్‌ల శివాజీ మధ్య నెలకొన్న శాంతి (1669) డిసెంబర్ 14 నుంచి (1670) జనవరి 11 మధ్య కాలంలో అంతమయింది. ఔరంగాబాద్‌లో మూ అజ్జామ్ రాకుమారుని వద్ద తమ సైనిక దళాలతో ఉన్న ప్రతాపరావ్, ఆనందరావ్ రాజగఢ్‌కు తిరిగి వచ్చారు."

(ఆంగ్ల వ్యాపార కేంద్రం) సూరత్‌లోని అధ్యక్షుడు ప్రెసిడెంట్ గేరీ 1670 జనవరి 23 నాడు వ్రాసిన లేఖ ఔరంగజేబ్ విధానాల దృష్టిని ఆకర్షించింది. అందులో ఇలా వుంది. "ప్రధాన తిరుగు బాటుదారు శివాజీ తీవ్రమైన మార్పులు తీసుకొని రావడానికి పట్టుదలతో అనేక హిందూ దేవాలయాలను పడగొట్టి చాలా మందిని (హిందువులను) ముసల్మానులుగా మారేటట్లు బలత్కరించిన ఔరంజేబ్‌కు వ్యతిరేకంగా మరొకసారి సాయుధ పోరాటానికి పూనుకొన్నాడు ఔరంగ్‌జేబ్ దేవాలయాలను పడగొట్టడానికి 1669 ఏప్రిల్‌లో సాధారణ ఉత్తర్వును జారీచేసినట్లు జ్ఞప్తికి తెచ్చుకొనాలి. అయితే, ఆ సంవత్సరం సెప్టెంబరులో వారణాసిలోని విశ్వనాథ దేవాలయం నేలమట్టమయింది.

"మత మౌఢ్యం ద్వారా తన పరిపాలనకు మద్దతును సంపాదించ ప్రయత్నించిన ఔరంగజేబ్ విధానం మిక్కిలి హ్రస్వదృష్టిపూరితమైంది. ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల్ని అది నొప్పించింది. గాఢమైన సహన స్వభావం గల శివాజీకి అది

అతి వేదనను కలిగించింది."

బలవంతంగా శాంతి సంవత్సరాలలో శివాజీ సద్దులేకుండా తన బలాన్ని పెంపొందించుకొనే కృషిలో నిమగ్నమయాడు. మరమ్మతుల ద్వారా దుర్గాలు బలాన్ని పుంజుకొన్నాయి. వాటిలో శక్తివంతమైన దుర్గ రక్షణ దళాలను ఉంచారు. సైన్యాన్ని యుద్ధానికి సమాయత్త స్థితిలో పెట్టారు. విదేశీయులుగాని కిరాయిసైనికులుగాని లేని జాతీయ సైన్యం అది. శివాజీ తన సైన్యాన్ని సాయుధం చేయడానికి మందు గుండు సామగ్రి, తుపాకులు , (ఇతర) ఆయుధాలు సంపాదించే నిమిత్తం దూరప్రాంతాలలో పలుతావులలో అన్వేషణ జరిపాడు. దక్కన్ రాజ్యమైన గోల్కొండ మరాఠాలకు ఇతోధికంగా సన్నిహిత మయింది. బీజాపూర్, కొంకణ్‌పై తన ఆధిపత్యాన్ని శాశ్వతంగా వదలుకొంది.

శివాజీ తన దాడికి అంత కంటే మంచి సమయాన్ని ఎన్నుకోగలవాడు కాదు. దక్కన్‌లో రాజప్రతినిధి మూఅజ్జామ్ రాకుమారునికి యుద్ధానుగుణమైన లక్షణాలు లేని శాంతి ప్రియుడు. ఆ సమయంలో దక్కన్‌లోని మొఘల్ సేనానులలో గణుతికెక్కిన వారెవ్వరూలేరు. ఖాండేష్ గవర్నర్ దావూద్ ఖాన్ ఖురైషీ మాత్రమే చురుకుగా శక్తిమంతుడుగా ఉండేవాడు. మొఘల్‌లు ఆకస్మిక విపత్తులో పడ్డారు. ఔరంగజేబ్ వాయవ్య ప్రాంతంలో మథుర చుట్టూ ఉన్న జాట్ ప్రాంతంలో అలజడులను ఎదుర్కొనవలసి వచ్చింది.

శివాజీ 1670 లో మొఘల్‌ల పై ఆగ్రహోదగ్రుడై చేసిన దాడికి వారు దిమ్మెరపోయారు. తన మాతృభూమి నుంచి మొఘల్‌లను వెళ్ళగొట్టడం ఆయన ప్రథమలక్ష్యం. పురందర్ సంధి ప్రకారం శివాజీ (వారికి) 23 దుర్గాలను 4 లక్షల హన్లు లేక సుమారు 16 లక్షల రూపాయల విలువగల భూభాగాన్ని అప్పగించవలసి ఉందని మరచిపోకూడదు.

దుర్గాలపై, లోయలలో పట్టణాలలో మొఘల్‌లను ఎక్కడ కనబడితే అక్కడ వారిపై దాడి చేశాడు. ఆ సంఘర్షణ బాధాకరంగా కొనసాగింది. దుర్గం తరువాత దుర్గం, వాటిలో కొన్ని వీరోచిత పోరాటాల తరువాత శివాజీకి లొంగాయి ఉత్సాహాన్ని రేకెత్తించే జనప్రియగాథ ఒకటి 1670 ఫిబ్రవరి 4 న పూనా సమీపంలోని సంహగఢ్‌ను మరాఠాలు స్వాధీనం చేసికోవడానికి సంబంధించినది. దానిపై దాడికి సుప్రసిద్ధ మరాఠా వీరుడు తానాజీ మాలుసరే నాయకత్వం వహించాడు. రాజపుత్రుడైన దళాధిపతి ఉదయభాన్ అకుంఠితధైర్యంతో దుర్గరక్షణకు పూనుకొన్నాడు. ఆ ఇద్దరు నాయకులు ద్వంద్వయుద్ధం సాగించగా అది వారి మరణానికి దారి

తీసింది. ఆ దుర్గం మరాఠాల హస్తగతమయింది. సాహసి అయిన తానాజీని కోల్పోయిన శివాజీ అమితి విచారానికి గురిఅయాడు. అతను వేదనాభరితుడై, "నేను దుర్గాన్ని (గఢ్) జయించాను కాని సింహాన్ని పోగొట్టుకొన్నాను" అని ఆక్రోశించాడు.

అంతే పటిష్టమైన దుర్గం పురందర్ 1670 మార్చి 8 న మరాఠాల స్వాధీనమయింది. రక్షణ దళాధిపతి రజిద్దీన్ వారి చేజిక్కాడు. మరాఠాలు లోహగడ్ దుర్గపు గోడలకు ఎగబ్రాకి దానిని స్వాధీనపరచుకొన్నారు. రోహిదా దుర్గానికి అదే గతి పట్టింది.

మొఘల్‌లలో అరాజకత్వం పూర్తిగా వ్యాపించింది. దక్కన్‌లోని ప్రతి భాగంలోనూ మరాఠాలు పోరాడుతూ ఉన్నారు. మొఘల్‌ల వార్తా లేఖలు అట్టి సమాచారంతో నిండిపోయాయి. ఉదా: 1670 జనవరి 24 నాటి వార్తా లేఖ ఇలా వుంది. "శివాజీ సైన్యాలు బేరార్ రాష్ట్రాన్ని కొల్లగొడుతున్నాయి. ఆ సామ్రాజ్య భూభాగం నుంచి వారు 20 లక్షల రూపాయలు ప్రోగుచేశారు."

"ప్రస్తుతం మరాట్వాడాకు చెందిన ఉస్మానాబాద్ జిల్లాలో గల ఔసా దుర్గానికి గవర్నరైన బార్‌ఖుర్‌దార్ ఖాన్ ఇలా వ్రాశాడు: 20,000 సైనికులతో కూడిన శివాజీ సైన్యాలు ఈ ప్రాంతానికి వచ్చి చేరాయి. మరాఠాలు రాష్ట్రాన్ని కొల్లగొట్టి, దోపిడీ సొమ్మును ప్రోగుచేస్తున్నారు. ఈ దుర్గానికి రెండు కోసుల (సుమారు 6 కి.మీ.) దూరంలో వారు మకాం చేస్తున్నారు. శివాజీ నా జాగీరును కొల్లగొట్టాడు. నాకు జీవ నాధారాలు లేకుండా పోయాయి. నాకు కొంత సొమ్ము అనుగ్రహించగలరని భావి స్తున్నాను. (దానిపై) చక్రవర్తి మరాఠాలు కొల్లగొట్టారనే సాకుతో ఇంకా ఎక్కువమంది వ్యక్తులు సహాయన్ని అభ్యర్థించవచ్చు. వారందరి క్లేశాలను పరిహరించడం ఏవి ధంగా సాధ్యపడుతుంది ?"

సాహులీ దుర్గంలోని మొఘల్ దళాధిపతి మనోహర్‌దాస్ గౌడ్ ఆ దుర్గాన్ని సాహసోపేతంగా రక్షించాడు. మరాఠాలు తమ బలాలను ఉపసంహరించారు. కానీ మనోహర్ దాస్ ఆయుధాల మందు గుండు సామగ్రి ఆహార పదార్థాల కొరతను నిశి తంగా గ్రహించినవాడై తన పదవికి రాజీనామా చేశాడు. మొఘల్ సేనాని దావూద్ ఖాన్ ఖురైషీతో అతను, "దుర్గంలో తగిన బలగం లేదు. ఆయుధాలు, మందుగుం డుసామగ్రి కూడా సరిపడినంతగా లేవు. శత్రువు సంఖ్యాబలంకలవాడు అయినప్ప టికీ నేను నా శక్తిని పూర్తిగా వినియోగించి దుర్గరక్షణ చేశాను. దానిని రక్షించడం నా శక్తికి మించిన పని. నా ఉద్యోగానికి రాజీనామా చేస్తున్నాను. నాపరువును కాపాడు కున్నాను. ఇది నాకు అన్నిటికి మించిన ఆస్తి."

మనోహర్‌దాస్ తన మనస్సును మార్చుకొనేటట్లుగా నచ్చచెప్పడానికి తన యావ

చ్ఛక్తినీ వినియోగించాడు. కానీ ప్రయోజనం లేక పోయింది. గత్యంతరం లేక దావూద్‌ఖాన్ అల్లావర్దీఖాన్ అనే ఉద్యోగిని తాత్కాలికంగా దుర్గరక్షణ దళాధిపతి పదవిలో నియమించాను. దుర్గరక్షణ దళ సంఖ్యను 200 సైనికులను అదనంగా చేర్చి, పెంచారు. దావూద్ ఖాన్ జున్నార్‌కు మరలిపోయాడు (జున్నార్ వద్దనే అతని కొలువులో సమకాలీన చరిత్రకారుడు భీమ్‌సేన్ సక్సేనా ఉద్యోగాన్ని సంపాదించాడు).

మరాఠాలు ఈ అవకాశం కొరకు వేచి వున్నారు. దావూద్‌ఖాన్ మాహూలీ నుంచి వెళ్ళిపోయిన తర్వాత వెంటనే శివాజీ దానిపై దాడిచేశాడు. అల్లా వర్దీఖాన్ పోరాడుతూ మరణించాడు. కొంకణ్‌లో ప్రధాన దుర్గమైన మాహులీ 1670 జూన్ 15 న మరాఠాల హస్తగత మయింది.

అంతకుమునుపే మరాఠాలు కళ్యాణ్, భివాండీలను స్వాధీన పరచుకొన్నారు. వాటి రక్షణ దళాధిపతి ఉజ్బెక్ ఖాన్‌ను సంహరించారు. మొఘల్ ఉద్యోగి లోధీ ఖాన్ తీవ్రంగా గాయపడి, ఆ ప్రాంతం నుంచి పారిపోయాడు. భీమ్‌సేన్ వ్రాసిన దాని ప్రకారం గణనీయమైన సంఖ్యలో మొఘల్ ఉద్యోగులు చాలా హీనస్థితిలో ఔరంగాబాద్ చేరుకొన్నారు.

తరువాత మాధేరాం సమీపంలోని ప్రభవాల్‌గఢ్ దుర్గం మరాఠాల స్వాధీనమయింది. దాని సమీపంలోని కర్నాలా 1670 జూన్ 23 న వశమయింది. జూన్ నెల ఆఖరుకి మరాఠాలు (ఫిబ్రవరి 4 న) సింహగఢ్‌ను, (మార్చి 8 న) పురందర్‌ను, (మార్చి 15 న) కల్యాణ్‌ను, (జూన్ 16) మాహులీని, (జూన్ 22 న) కర్నాలాను, (జూన్ 24 న) రోహిదాను వశపరచుకొన్నారు.

### మూఅజ్జామ్‌తో దిలేర్‌ఖాన్ సంఘర్షణ

మరాఠాలకు వ్యతిరేకంగా దండయాత్రలు నిర్వహించడానికి గోండ్ ప్రాంతంలో యుద్ధ కార్యకలాపాలు నిర్వహిస్తున్న దిలేర్ ఖాన్ దక్కన్ చేరుకొన్నాడు. మూ అజ్జామ్ రాజకుమారునితో, అతని సలహాదారు మహరాజా జస్వంత్‌సింగ్‌తో ఖాన్ సంబంధాలు సరిగా ఉండేవి కానీ సద్భావపూరితమయినవి కావు. త్వరలోనే వారి మధ్య సంఘర్షణ ప్రారంభమయింది. మూఅజ్జామ్ జస్వంత్‌సింగ్‌లు తరుముకు రాగా దిలేర్‌ఖాన్ పారిపోసాగాడు. ఔరంగజేబ్ దిలేర్‌ఖాన్‌ను గుజరాత్‌కు పంపి మూ అజ్జామ్ రాకుమారుని వెనక్కి తిరగమని ఆజ్ఞాపించాడు. జస్వంత్‌సింగ్‌ను కూడా తరువాత అతనికాలంలోనే బదిలీ చేశాడు. ఆశ్చర్యకరంగా మూ అజ్జామ్ రాకుమారుడు, దిలే

ర్ఖాన్‌ను వెంబడించులులో తనకు తోడ్పడవలసిందిగా శివాజీని కోరాడు. ఇది సునా యాసంగా మోసగించడానికి ఒక ఎత్తుగడ మాత్రమే. శివాజీ తెలివిగా అందులో పాల్గొనడానికి నిరాకరించాడు.

జనవరి నుంచి సెప్టెంబరు వరకు మొఘల్ ప్రభుత్వం వాస్తవానికి పూర్తిగా చలనరహిత స్థితిలో పడింది. అంతేకాదు. శివాజీ మరొకసారి సూరత్‌ని ఘోరంగా ముట్టడించాడనే అదురు పుట్టించే వార్త అందింది.

శివాజీ 10,000 అశ్విక దళంతో, అంటే సంఖ్యలో కాల్బలంతో కూడిన సైన్యం, ప్రతాపరావ్ గుజార్, పీష్వా మోరోపంత్ తదితర ప్రసిద్ధి సేనానులు ఉద్యోగులు వెంటరాగా కళ్యాణ్ నుంచి పురోగమిస్తూ సూరత్‌ను మొదటి దాడి సమయంలో వెళ్ళిన మార్గాన్నే అనుసరించాడు. ఆ బాట ఈనాటి థానా, నాసిక్, దాంగ్ జిల్లాల ద్వారా వెళుతుంది. శివాజీ సూరత్ గోడలను 1670 అక్టోబర్ 3న సమీపించాడు. దాని రక్షణ దళం కోట ఫిరంగుల ఆశ్రయంలో పారిపోయింది.

శివాజీ పై ఇంగ్లీషు పట్టీ పుస్తకాలు ఇలా ఉల్లేఖించాయి.[1] "మరాఠాలు పట్టణా న్నంతటినీ స్వాధీన పరచుకొనగలిగారు. తార్‌తార్‌లు వారి గృహాలను అటుపైన భద్రంగా ఉంచుకో లేక పోగా రాత్రివేళ వారి రాజును కోటకు పంపించి వారి గృహాన్ని శివాజీకి ఆహారంగా వదలిపెట్టారు. అక్కడ అతను బంగారు, వెండి, విలు వైన పాత్ర సామాను, ఒక బంగారు పట్టిమంచం, ఇతర విలువైన గృహోపకరణాలతో నిండిన ఒక విస్తార నిక్షేపాన్ని కనుగొన్నాడు. ఆ మధ్యలో శత్రువులు సంపన్న గృహా లను తాపీగా కొల్లగొట్టి వాటిలో అపార నిక్షేపాలను, విలువైన వస్తువులను కనుకొన్నా రు. వారు అనేక స్థలాలలో నిప్పంటించి దాదాపు సగం పట్టణాన్ని నేలమట్టం అయేంతవరకు నాశనం చేశారు."[1]

శివాజీ మూడవ రోజున సూరత్ నుంచి వెళ్ళిపోతూ తన వెంట 50 లక్షల రూపాయలకు మించిన బ్రహ్మాండంగా కొల్లగొట్టిన సొమ్మును వెంటతీసుకొని పోయా డు. సూరత్‌పై తన దాడిని సమర్థించడానికి చెప్పిన కారణం సూరత్ గవర్నర్‌కు దాని ప్రసిద్ధ పౌరులకు వ్రాసిన లేఖనుంచి స్పష్టం అవుతుంది.[2] "మూడవసారిగా ఇదే చివరిదని, నేను ప్రకటిస్తూండగా మీ ప్రభుత్వం క్రింద వసూలు అయ్యే ఆదా యంలో నాలుగవ వంతును లేక చౌత్‌ను నేను కోరుతున్నాను. మీ చక్రవర్తి నా ప్రజల నా దేశం రక్షణకై ఒక సైన్యాన్ని నేను నిర్వహించేటట్లు చేసి నందున,

---

[1] ఇంగ్లీషు రికార్డ్సు, శివాజీపై, పుట 173.

[2] జె.యస్. సర్కార్, శివాజీ పై, పుట 187.

అతని అధీన ప్రజలే ఆ సైన్యానికి అయ్యే ఖర్చును భరించాలి." ఈ చివరి ముఖ్యమైన వాక్యం శివాజీ ఉద్దేశ్యాలను, లక్ష్యాలను స్పష్టంగా అవగాహన చేసికోవడానికి వీలుకల్పిస్తుంది.

సూరత్ దోపిడి మొఘల్‌లను అశనిపాతంవలె తాకింది. దక్కన్‌లో రాజప్రతినిధి మూ అజ్జామ్ రాకుమారుడు శివాజీని అడ్డగించమని ఖాండేష్ గవర్నర్ దావూద్‌ఖాన్ ఖురైషీకి వెంటనే ఆజ్ఞ జారీచేశాడు.

(ప్రస్తుతం గుజరాత్ రాష్ట్రంలో ఉన్న) దాంగ్ జిల్లా, నాసిక్ జిల్లాలోని సతానా, కల్యాణ్, సుర్గానా, పేఠ్ తాలూకాలు మొఘల్‌ల కాలంలో బగ్లానా అనే పేరు కలిగి ఖాండేష్ రాష్ట్రంలో ఒక జిల్లాగా ఉండేవి. అదే విధంగా (ప్రస్తుతం నాసిక్ జిల్లాగా ఉన్న) ధూలియా మన్మాడ్ మధ్య ప్రాంతం ఖాండేష్ రాష్ట్రంలో ఒక జిల్లాగా ఎర్పడింది. ఆ జిల్లా కేంద్రం మన్మాడ్ మాలెగావ్ పట్టణానికి 22 కి.మీ. ఉత్తరంగా ఉన్న గుల్నాదుర్గం.

(ప్రస్తుతపు నాసిక్ జిల్లా) మన్మాడ్ సమీపంనుంచి వాణి వద్ద గల సప్త శ్రేణి దేవాలయం వరకు తూర్పు నుంచి పశ్చిమానికి విస్తరించిన ఒక పర్వత శ్రేణి (చాంద్ వాడ్ పర్వత శ్రేణి) విభజించింది. ఈ పర్వత శ్రేణికి ఉత్తరంగా సంపన్న గుజరాత్ రాష్ట్రం సరిహద్దుల్లో బగ్లానా జిల్లా ఉండేది. ఈ పర్వత శ్రేణిలో చాంద్ వాడ్, ఇంద్రాణి, కాంచన్ మంచన్, దోడప్, అహివంత్, అచలగిరి, హనుమంత్ గఢ్, మార్కండ్, సప్తశృంగి అను సుమారు పది దుర్గాలు ఉండేవి.

సూరత్ నుంచి తిరిగి పోతూ బగ్లానా జిల్లా కేంద్రమైన మల్హార్ పట్టణాన్ని శివాజీ కొల్లగొట్టాడు. అప్పుడాయన ఆ పర్వత శ్రేణికి దక్షిణంగా పయనించాడు. కాంచన్ మంచన్ వద్ద ఆ పర్వత శ్రేణిని అతను దాటుతుండగా మొఘల్‌లను అతను ఎదుర్కొనవలసి వచ్చింది. అప్పుడు జరిగిన వాణిదిండోరి యుద్ధాన్ని గురించి మనకు సమకాలీన మరాఠీ పర్షియన్ గ్రంథాలలో చక్కని వృత్తాంతాలు లభ్యమవుతున్నాయి. సభాసద్ భీమ్‌సేన్ సక్సేనా ఇరువురూ దానిని గురించి వ్రాశారు. (నిజానికి కంచన్ మంచన్ యుద్ధంగా తెలియదగిన) వాణి దిండోరి యుద్ధం శివాజీ మొఘల్‌ల చేసిన కొద్ది యుద్ధాలలో ఒకటి.

ఆ యుద్ధ సమయంలో హాజరైన భీమ్‌సేన్ సక్సేనా చెప్పింది సంక్షిప్తంగా ఇది: "శివాజీ కాంచన్ మంచన్ కనుమను సమీపిస్తున్నాడని వినగానే దావూద్ ఖాన్ (1670 అక్టోబర్ 16) చాంద్‌వాడ్‌ను రాత్రివేళ చేరుకొన్నాడు. చాంద్‌వాడ్ సైన్యాధికారి అయిన బాకీ ఖాన్ దుర్గంలో తలదాచుకొన్నాడు. అతను దావూద్ ఖాన్‌ను కలిశాడు. అర్ధరాత్రి

సమయంలో శివాజీ కాంచన్ కనుమను దాటి నాసిక్ వైపు వెళుతున్న వార్తను వార్తా హరులు తీసుకువచ్చారు. చాంద్‌వాడ్‌లో తన కొద్దిపాటి ప్రయాణ సామగ్రిని వదలి, అతను ముందుకి పురోగమించాడు. గాలిబ్ ఖాన్, నారోజీ, బస్వంత్ రావ్ వెన్నుద న్నుగా ఉన్న రక్షణ దళంలో నిలిచారు. వారు ప్రయాణ సామగ్రితో కదలి పోతున్నా రు. (రచయిత భీమ్‌సేన్ అధికారిగా వారివెంట ఉండిపోయాడు.) అబ్దుల్ కరీమ్ కుమారుడు బీజాపూర్‌కు చెందిన బహలూల్‌ఖాన్ మనుమడు అయిన ఇఖ్లాస్‌ఖాన్ మియానా పురోగామి దళానికి నాయకత్వం వహించాడు. అయిదువేళ (అశ్వికదళ) మన్సబ్ కలవాడతను. తన స్వల్ప సైనిక దళంతో, అతను ముందుగానే రణస్థలికి చేరుకున్నాడు. మరాఠాలు యుద్ధక్రియకు సిద్ధంగా ఉన్నట్లు అతను కనుగొన్నాడు. ఆవేశపరుడైనందువల్ల ఇఖ్లాస్ ఖాన్, దావూద్‌ఖాన్ అతనితో కలియడానికి వేచి వుండ కుండా, తొందరపాటుతో మరాఠాలను ఎదుర్కొన్నాడు. ఆ దాడి వినాశంగా పరిణమిం చింది. ఇఖ్లాస్‌ఖాన్ తీవ్రంగా గాయపడి, తన గుఱ్ఱం నుంచి క్రిందకు పడిపోయాడు.

"ఇంతలో దావూద్‌ఖాన్ రణస్థలికి త్వరత్వరగా రాసాగాడు. (భీమ్‌సేన్ వ్రాసిన దాని ప్రకారం, మరాఠా సైన్యం సంఖ్య 15,000 మించింది.) దావూద్ ఖాన్ వెంటనే మకరంద్ ఖాత్రీని స్వయంగా తన సోదరుడే ఆయన షేక్ సఫీని, చాందేరీ రాజుకొ లువులో అధికారి అయిన పురోహిత్ ఖాన్‌ను, సంగ్రామ్ ఖాన్ ఘోరీని ఇఖాస్ ఖాన్‌కు తోడ్పడటానికి పంపాడు. తరువాత తాను స్వయంగా వారితో చేరాడు. ఒక చిన్న కొం డగుట్ట పై చుట్టూ వాగు ప్రవహిస్తున్న జనశూన్యమైన గ్రామం ఒకటి ఉంది. బాకీ ఖాన్, ఇబ్రహీం పానిఖాన్ నిర్వహణలో ప్రయాణ సామగ్రులను అక్కడ వదలి పెట్టా రు. చాంద్‌వాడ్ నుంచి వస్తున్న మరికొన్ని సామానులను వెన్నుదన్నుగా ఉన్న రక్షణ దళాన్ని ఆ జనశూన్యమైన గ్రామంలో నిపిపివేయ వలసిందిగా ఆదేశాలు ఇచ్చారు. (భీమ్‌సేన్ బాహీఖాన్‌తో జత కలిశాడు) దావూద్ ఖాన్ పంపిన అధికారులు మరాఠా లకు వ్యతిరేకంగా పోరాడారు. ఆ పోరాటంలో మొఘల్‌లు సైనికులు మరణించిన వారికి, గాయపడిన వారికి, సంబంధించిన విపరీత నష్టాలకు గురి అయారు. సంగ్రామ్ ఖాన్ అతని కుమారులు బంధువులు గాయపడ్డారు. మరాఠా దాడి విజృంభించకుండా తుపాకులతో పోరాడిన బుందేలాలు మాత్రమే నివారించగలిగారు.

"ఇంతలో దావూద్ ఖాన్ యుద్ధస్థలానికి వచ్చి చేరాడు. అతను యుద్ధభూ మిలో క్రిందకుపడిన ఇఖ్లాస్ ఖాన్‌ను పైకి లేవతీశాడు. మరాఠాలు శత్రువును అన్ని వైపులనుంచి ముట్టడిస్తూ, 'బార్గిగిరీ' (అనగా అవిచ్ఛిన్నమైన దాడి) అనే పేరుగల వారి పోరాట పద్ధతిని చివరకు అవలంభించారు.

యుద్ధభూమిలో మరొకచోట ఫిరంగి దళాధిపతి, (రచయిత భీమ్‌సేన్ స్నేహితుడు) అయిన మీర్ అబ్దుల్ మబూద్ మరాఠాల దాడికి గురి అయాడు. మబూద్ కుమారుడు, కొందరు సైనికులు మరణించగా, మబూద్ తీవ్రంగా గాయపడ్డాడు (అతనిని బాకీ ఖాన్, భీమ్‌సేన్ రక్షించి శిబిరానికి తెచ్చారు).

ఆ సమయంలో దావూద్ ఖాన్ వద్దగల సైనికదళం రెండువేలకు మించిలేదు. సాయం సమయంలో తిరిగి మరాఠాలు మొఘల్‌లపై దాడి చేశారు. మొఘల్‌లు వారిని ప్రతిఘటించారు. మరాఠాలు అప్పుడు యుద్ధరంగం నుంచి తప్పు కొని సూరత్ నిక్షేపంతో వెళ్ళిపోయారు.

"మొఘల్‌ల లక్ష్యం శివాజీని అడ్డగించడం కాగా శివాజీ మొఘల్‌లను పక్కకు నెట్టి సూరత్ నుంచి తెస్తున్న నిక్షేపాన్ని త్వరగా, సురక్షితంగా చేరవేయాలని ఆశించాడు. ఈ లక్ష్యసాధనలో ఆయన కృత కృత్యుడయాడు. మొఘల్‌లు మనుష్యులు, వస్తువులు రెండింటిలో భారీ నష్టాలను పొందారు." ఈ (రణ) స్థలంలోనే మూర్ఛ నుంచి తేరుకొన్నప్పుడు అబ్దుల్ మబూద్ తన నిర్వహణ బాధ్యతను తాత్కాలికంగా రచయిత భీమ్ సేన్‌కు అప్పగించాడు. భీమ్‌సేన్ యుద్ధంలో మొఘల్‌లకు విజయం కలిగిందని తీర్మానించాడు.

"మరుసటిరోజు మొఘల్‌లు నాసిక్ చేరుకొన్నారు. గాయపడిన వ్యక్తులను ఔరంగాబాద్ పంపారు. మొఘల్‌లు అహ్మద్ నగర్‌కు వెళ్ళే ముందుగా సుమారు ఒక నెలపాటు నాసిక్‌లో మకాం చేశారు."

## మరాఠా దాడులు

మొఘల్‌లు నాసిక్ వద్ద మకాం చేస్తుండగానే, పీష్వా మోరోపంత్ నాయకత్వంలో మరాఠాలు బలీయమైన దుర్గం త్ర్యంబక్‌పై దాడి చేసి దానిని 1670 అక్టోబర్ 25 న స్వాధీనపరచుకొన్నారు.

బేరార్ రాష్ట్రంలో మరాఠాలు నిరాఘాటంగా అగ్నినీ, కత్తినీ వినియోగించారు. శివాజీ 1670 నవంబరులో బేరార్‌లోని సంపన్న పట్టణం కరంజాపై దాడి చేశాడు. ఆ పట్టణాన్ని మూడు రోజుల పాటు కొల్లగొట్టి, దానిని ఆమూలాగ్రంగా త్రవ్వి పెట్టారు.

స్థిరంగా మొఘల్ పాలన క్రిందగల రాష్ట్రాలలో మరాఠాలు కొనసాగించిన విధ్వంసకాండను 1671 జనవరి 13 నాటి (నాడు బేరార్ లోని నేడు నాందేడ్ జిల్లాలోని) "ఇంతలో అబ్దుల్లాఖాన్ షిరాజీ మాహూర్ రాజు ఉదారాం సమర్పించిన విజ్ఞాపన విశదీకరిస్తుంది. మాహూర్ విభాగానికి (సర్కార్‌కు) సైనికాధికారిగా (ఫౌజ్‌దార్)గా

నియమితుడయాడు. శివాజీ సైన్యం ఉదాజీరాం జాగీరులో చేరిన ఉంబర్‌ఖేడ్ పర గణాను పూర్తిగా నాశనం చేసింది. మాహూర్ శత్రువు ఆ ప్రాంతంలోనే ఉండి. ప్రతి పరగణా సామ్రాజ్యానికి పన్నులో నాలుగవ భాగం (చౌత్) చెల్లించమని కోరుచు న్నాడు. ఉదాజీరాం జాగీరు యావత్తూ బీడుగా మారింది.”

మొఘల్ భూభాగంలో శివాజీ దాడులు తూర్పున బేరార్‌లోని అంబర్ ఖేడ్ నుంచి పశ్చిమాన కాండేష్ లోని నందుర్బార్ వరకు విస్తరించాడు. ఆ తరువాత మరాఠా చరిత్రలో నిర్ణయాత్మకమైన పాత్రను వహించనున్న చౌత్ అనే పదం మొఘల్ మరాఠా పత్రాలలో ఈ సమయం నుంచి ప్రత్యక్షమయింది.

మొఘల్‌లు సమ 'స్థితి'ని కోల్పోవునట్లు శివాజీ చేశాడనే విషయం సత్యం ఆయన వారికి నిలువనీడలేకుండా చేశాడు. వారిని తన స్వదేశమైన కొంకణ్ నుంచి భీమానదికి దక్షిణంగా ఉన్న భూభాగం నుంచి వెళ్ళగొట్టాడు. మొఘల్‌లు దాడులు చేయకుండా దాని పరిస్థితిని చక్కబరచాడు. మొఘల్ భూభాగంలోకి యుద్ధాన్ని విస్తరించి శత్రువుకు విశ్రాంతి లేకుండా చేయటమే దానిని సంరక్షించే ఉత్తమ మార్గం. ఔరంగాబాద్ నాందేడ్ బేరార్ రాష్ట్రాలలో మొఘల్ ఉద్యోగుల జాగీర్లను నాశనం చేసి చౌత్‌ను విధించి దుర్గాలపై ముఖ్య స్థలాలపై దాడులు చేసి పెద్ద ఎత్తున అల జడులు సృష్టించడం శివాజీ వ్యూహం. ఈ రాష్ట్రాలలో భూభాగం ఆక్రమణ ఆయన లక్ష్యం కాదు.

ఖాండేష్ రాష్ట్రంలోని బగ్లానా జిల్లాలోనే శివాజీ మొఘల్ భూభాగాన్ని ఆక్ర మించి స్వాధీన పరచుకొన్నాడు. మొఘల్‌లు ఈ భూభాగాన్ని స్థిరమైన పరిపాలన కలదానిగా అనగా సామ్రాజ్య భూభాగం 'ముల్క్-ఇ-బాద్షాహి'గా పరిగణిస్తుండేవా రు. అప్పటివరకూ శివాజీ బీజాపూర్‌ను నష్టపరచి భూభాగాలను సంపాదించాడు. కాగా మొదటిసారిగా మొఘల్ సామ్రాజ్యంలో ఒక చిన్న భాగాన్ని ఆక్రమించి, శాశ్వ తంగా స్వకీయమొనర్చుకొనడానికి ఆయన నిర్ణయించాడు.

బగ్లానా ఆక్రమణ గుజరాత్‌పై దండయాత్రలు చేయడానికి ఒక స్థావరాన్ని సంపాదించినట్లు భావించాలి. సంపన్న ప్రాంతమైన ఖాండేష్‌లో మొఘల్‌ల ఉనికికి అది శాశ్వత ప్రమాదం కాగలదని కూడా దాని అర్థం. పద్దెనిమిదవ శతాబ్దిలో దభా డేలు, గయక్వాడ్‌లు బగ్లానాలోని వారి స్థావరాలనుంచి గుజరాత్ శాశ్వత ఆక్రమ ణకు ఉపక్రమించారు.

నాసిక్ జిల్లాలో ప్రాగ్దిశ నుంచి పశ్చిమానికి విస్తరించిన పర్వత శ్రేణి పశ్చిమ భాగంలోని దుర్గాలను అప్పటికే ఆక్రమించాడు. ఈ పర్వత శ్రేణికి ఉత్తరంగా సల్హై

ర్, ముల్హేర్ అనే ముఖ్య దుర్గాలు కలవు. రెండవది మొఘల్ జిల్లా ఆయన బగ్లానాకు ప్రధాన కార్యస్థానం. శివాజీ (ఈనాడు గుజరాత్‌లోని దాంగ్ జిల్లాకు కొన్నిమీటర్ల దూరంలో మాత్రమే ఉన్న) సల్హేర్‌ను గుజరాత్‌కు వెంటనే చేరుకోవడానికి వీలుకలిగిస్తుంది కనుక, వశపరచుకోవడంపై తన దృష్టిని ప్రసరించాడు.

శివాజీ దావూద్ ఖాన్ ఖురైషీని మన్మాడ్ సమీపంలోని అతని శిబిరం నుంచి దూరంగా వెళ్ళేటట్టు చేయడానికి పన్నుగడ వేశాడు. మరాఠాలు ఖాందేష్ రాజధాని అయిన బుర్హాన్‌పూర్‌ను సమీపించారు. దావూద్‌ఖాన్ బర్హాన్‌పూర్ నిర్వహణ బాధ్యతను తన కుమారుడు హమీద్‌ఖాన్‌కు వదలిపెట్టాడు. బుర్హాన్‌పూర్ పొలిమేరల్లో ఉన్న బహదూర్‌పురాను కొల్లగొట్టారు. తన కుమారుని నుంచి సహాయం కొరకు అభ్యర్థనలు అందుకొని దావూద్ ఖాన్ బుర్థాన్‌పూర్ సహాయం కొరకు అభ్యర్దనలు అందుకొని దావూద్‌ఖాన్ బుర్థాన్‌పూర్ వైపు త్వరత్వరగా పయనించాడు. మరాఠాలు కాలహరణం లేకుండా సల్హేర్ దిశగా కదలిపోయి దానిని ముట్టడించారు. దావూద్ ఖాన్ వేగంగా వారి వెంటపడ్డాడు. ముల్హేర్ నుంచి ఇరవైరెండు కిలోమీటర్ల దూరంలో గల సల్హేర్‌కు అతను వెళుతున్నప్పుడు, అతనికి మరాఠాలు సల్హేర్‌ను వశపరచుకొన్నట్లు, ఆ సందర్భంలో (1671 జనవరి 5 న) జరిగిన పోరాటంలో ఆ దుర్గ రక్షణ దళాధిపతి ఫతేహుల్‌ల్లాఖాన్ తన ప్రాణాలను కోల్పోయినట్లు తెలిసింది. శివాజీ రాజ్యంలో ఉత్తర భాగాంతానికి గుర్తుగా సల్హేర్ నిలిచింది.

ఈ దండయాత్రలో భీమ్‌సేన్ సక్సేనాకు కలిగి ఆసక్తిజనకమైన అనుభవం ఈ పోరాటం మతభేదాలకు అతీతంగా ఎలా కొనసాగిందో తెలియజేస్తుంది. దావూద్‌ఖాన్‌ను సల్హేర్‌కు అనుసరించి దారి తప్పిన భీమ్‌సేన్ ఇలా అన్నాడు. “దావూద్ ఖాన్ బరువైన ప్రయాణ సామగ్రులను ముల్హేర్‌లో నిల్వఉంచవలసిందిగా ఆదేశాలు జారీచేశాడు. దావూద్‌ఖాన్ వేకువనే వెళ్ళాడు. నేను బద్ధకించాను. నేను ప్రధాన సైన్యం వైపు వెళుతున్నప్పుడు నాతో కొందరు కాల్బలానికి చెందిన వారు ఉన్నారు. అప్పటికే దావూద్‌ఖాన్, సైన్యంతో కలసి నాకు దూరంగా పురోగమించాడు.”

“సల్హేర్ ముల్హేర్ మధ్య ఉన్న ఒక జనశూన్యమైన గ్రామాన్ని నేను చేరుకొన్నాను. దానికి సమీపంలో ఒక కొండగుట్ట ఉంది. నేను నిలబడిన కొండగుట్ట నుంచి కొందరు సైనికులు మావైపు వస్తున్నట్లుగా గుర్తించాను. చివరకు వారు మరాఠాలుగా అవుపించారు. కొండమొదలుకు వారు చేరుకొన్నారు. నేను ఎటూ తోచని స్థితిలో పడ్డాను. నన్ను సమీపిస్తున్న అశ్వికుడు తన తోడివారిపై తిరిగి, ‘మీరు ఇక్కడ ఉండండి. నేను ఈ అశ్వికుని గుర్తిస్తున్నట్లుగా భావిస్తున్నాను,’ అన్నాడు. అతను అప్పుడు ఇద్దరు అశ్వికులు

వెంటరాగా నన్ను సమీపించాడు. నా పేరుతో నన్ను, పిలిచి, 'ఇక్కడ నీవు ఒంటరిగా ఉండటం ఎట్లా సంభవించింది' అని ప్రశ్నించాడు.

"నాకు విపరీతమైన భయం కల్గింది. నేనా మనిషిని గుర్తించలేక పోయాను. 'నేను నూర్‌ఖాన్‌ను' అని అతను చెప్పాడు. తన అశ్వికుల వైపు అతను తిరిగి 'మీ పనికి తిరిగి వెళ్ళండి,' అని అతను ఆజ్ఞాపించాడు. అప్పుడు అతను నా వైపు తిరిగి నీ శిబిరం వరకు నీ రక్షణార్థం వెంట వచ్చి అప్పుడు తిరిగిరాగలను. మనం కలుసుకోవడం మంచిదయింది. లేనట్లయితే నీ ప్రాణాలను పోగొట్టుకుని ఉండేవాడివి."

"నూర్‌ఖాన్ ఔరంగాబాద్‌లో నా తండ్రిని ఎరిగి ఉన్నట్లుగా చివరకు తెలియవచ్చింది. తరువాత తన ఉద్యోగాన్ని పోగొట్టుకొని, అతను చిక్కుల్లో పడ్డాడు. అప్పుడు అతడు కొందరు అశ్వికులను పోగుచేసి శివాజీ కొలువులో చేరాడు. బగ్లానా ప్రాంతంలో (కర్తవ్యనిర్వహణకు) అతను నియమితుడయాడు. నూర్‌ఖాన్ నా వెంట దావూద్ ఖాన్ శిబిరం వరకు వచ్చాడు. నేను అతనిని సత్కరించాను. అతనికి కొన్ని బహుమానాలు నగదు ఇవ్వగోరాను కానీ, అతను వాటిని పుచ్చుకోవడానికి అంగీకరించలేదు. మధ్యాహ్న సమయంలో అతను నా వద్ద శెలవు తీసుకొన్నాడు."

శివాజీ కొలువులో ఉన్న నూర్ ఖాన్ మొఘల్‌ల సేవలో ఉన్న భీమ్‌సేన్ ఒకరి కొకరు సహాయపడటం విచిత్ర విషయం కదా! మొఘల్-మరాఠాల సంఘర్షణ ప్రాయకంగా రాజకీయ మైనదనే వాస్తవాన్ని దానికంటే చక్కగా మరేదీ విశదీకరించదు. భూమిపుత్రులు విదేశీ శక్తికి, విదేశీ ఉద్యోగిస్వామ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసినట్లు (దానివలన) తెలియగలదు.

ఔరంగజేబ్ (1633 లో దౌలతాబాదును పట్టుకొని, తద్వారా అహ్మద్ నగర రాజ్య సమాప్తిని రూఢి చేసిన ప్రసిద్ధ సేనాని కుమారుడు) మహబత్ ఖాన్‌ను శివాజీపై దండయాత్రను నిర్వహించేసేనానిగా నియమించాడు. అంతకు మునుపు కాబూల్ గవర్నర్‌గా ఉన్న మహబత్‌ఖాన్ 1671 జనవరి 3 న బర్హాన్‌పూర్ వచ్చాడు. అతను 1671 జనవరి 10 న ఔరంగాబాద్‌లో మూఅజ్జామ్ రాకుమారుని సందర్శించాడు. మహబత్ ఖాన్ సైన్యానికి వెన్నుదన్నుగా నిలిచే రక్షణ దళాధిపతిగా దావూద్‌ఖాన్ నియమితుడయాడు. వారు (ఏప్రిల్ – మే నెలల్లో) అహివంత్, మార్కండా, జావ్లా, అంచలగిరి దుర్గాలను వశపరచుకొన్నారు. దావూద్‌ఖాన్ కూడా మరాఠాలతో తీవ్ర ప్రతిఘటనతో కూడిన యుద్ధాలు చేశాడు. అయితే వారు బగ్లానాపై వారి పట్టును సడలించలేదు. మొఘల్‌ల పక్షంలో శక్తిమంతుడు. చురుకైన కార్యసాధకుడు అయిన సేనాని ఖాందేష్ గవర్నర్ అయిన దావూద్‌ఖాన్ ఖురైషీ మాత్రమే! అతను సోమరి,

ఆడంబరి అయిన మహబత్ ఖాన్‌తో కలసిమెలసి పనిచేయలేక పోయాడు. విసుగుపుట్టి దావూద్ ఖాన్ దక్కన్ నుంచి బదిలీ చేయించుకొన్నాడు. దావూద్ ఖాన్ శిబిరంలో ఉన్న రచయిత భీమ్ సేన్ (అతనితో వెళ్ళకుండా) ఉండి పోవడానికి నిశ్చయించాడు. అతను మహబత్‌ఖాన్ కొలువులో ప్రవేశించాడు.

మొఘల్‌లు వర్షాఋతువులో యుద్ధ కార్యకలాపాలు, కొనసాగించడానికి తీవ్ర అయిష్టాన్ని, ప్రదర్శించేవారు. మహబత్ ఖాన్ ఈ విషయంలో తక్కువకాదు. వర్షాకాలంలో అతను పార్నెర్ వద్దగల సైన్య నివాసస్థలానికి తరలిపోయాడు. అతను ప్రయోజనశూన్యమైన కార్య కలాపాల్లో తన కాలాన్ని వ్యర్థం చేస్తుండగా మరాఠాలు దక్కన్‌లో ఒక వైపునుంచి మరొక వైపుకి యథేచ్ఛగా సంచరించారు.

పార్నెర్ వద్ద మహబత్ ఖాన్ శిబిరంలో ఉన్న భీమ్‌సేన్ ఆ శిబిరంలోని పరిస్థితులను గురించి వినోదకరమైన వృత్తాంతాన్ని చెప్పాడు. అతని మాటలలో[1] "మహబత్‌ఖాన్‌ను శిబిరం పార్నెర్ వద్ద ఉండేవి. ఆ సంవత్సరం చాలా భారీ వర్షాలు కురిశాయి. అంటు రోగాలు వ్యాపించి మనుషులు పశువులు గొప్ప సంఖ్యలో మరణించటం జరిగింది. పార్నెర్ వద్ద మహబత్ ఖాన్ తన కాలాన్ని అనుభవిస్తూ గడపసాగాడు. ప్రతిరోజూ ఏదో ఒక మొఘల్ ప్రభువు (అమీర్) విడిదిలో వినోద కార్యకలాపాలు కొనసాగుతూవుండేవి. శిబిరంలో కాబూల్, లాహోర్‌లకు చెందిన 400 మంది గణికలు ఆడుతూ పాడుతూండేవారు. వీరిని బహుమానాలతో ముంచెత్తుతుండేవారు. మహబత్ ఖాన్ శివాజీతో రహస్య అవగాహనను కుదుర్చుకొని చిత్తశుద్ధితో శివాజీని అణచడానికి శక్తివంచన లేకుండా కృషిచేయడంలేదని ఎవరో చక్రవర్తికి ఫిర్యాదు చేశారు."

ఔరంగజేబ్ మహబత్ ఖాన్‌ను దక్కన్ నుంచి వెనక్కు రప్పించి అతని స్థానంలో గుజరాత్ గవర్నర్ బహదూర్ ఖాన్‌ను నియమించాడు. మహబత్ ఖాన్ నిష్క్రమణం 1671 సెప్టెంబర్‌లో సంభవించింది. బహదూర్ ఖాన్ వెంట దిలేర్‌ఖాన్, కుతుబుద్దీన్ ఖాన్ వంటి యోధులు వచ్చారు.

## సల్హేర్ యుద్ధం

బహదూర్‌ఖాన్ శక్తి సమన్వితంగా తన యుద్ధకార్యక్రమాన్ని ప్రారంభించాడు. శివాజీ భూభాగంపై దాడులు కొనసాగించి అనేక యుద్ధాలు చేశాడు. వాటిలో 1672 ప్రారంభంలో జరిగిన సల్హేర్ యుద్ధం నుంచి మొఘల్ సాయుధ శక్తి అతి ఘోరమైన

---

[1] భీమ్‌సేన్ సక్సేనా, తారీఖ్-ఇ-దిల్‌కుషా.

విపత్తుకు లోనయింది. మొఘల్‌లు సల్హేర్ దుర్గాన్ని ముట్టడించారు. దాన్ని స్వాధీన పరచుకోవడం మొఘల్‌లకు ప్రతిష్ఠాకరమైన విషయంగా పరిణమించింది. శివాజీ మొఘల్‌లు ఆ ముట్టడి ఉపసంహరించేటట్లుగా చేసేందుకు కృతనిశ్చయుడయాడు.

శివాజీ జీవిత చరిత్రకారుడు సభాసద్ ఆ యుద్ధాన్ని సవివరంగా వర్ణించాడు. మరాఠా సైన్యంలో పీష్వా మోరోపంత్, సైన్యాధ్యక్షుడు ప్రతాపరామ్ గుజార్‌వంటి దీర్ఘకాల యుద్ధానుభవంగల వారు ఉన్నారు. అదొక గొప్ప యుద్ధం, మొఘల్ సైన్యం చిత్తుగా ఓడిపోయింది.

భీమ్‌సేన్ కూడా (దానిని గురించి) ఇలా వ్రాశాడు: "ఆ యుద్ధంలో ఇఖ్లాస్ ఖాన్ మియానా, ముహ్‌కామ్ సింగ్ గాయపడి బందీలయారు. ముహ్‌కామ్‌సింగ్ తండ్రి రావు అమర్ సింగ్ చంద్రావత్ రణరంగంలో చనిపోయాడు. మొఘల్‌ల యుద్ధ సాధనాలన్నీ మరాఠాల వశమయాయి. బహదూర్ ఖాన్ సల్హేర్ చేరుకోవడానికి వేగంగా రాసాగాడు. కానీ అతను బగ్లానా చేరే సమయానికి మరాఠాలు కొంకణ్‌లో ప్రవేశించారు. మొఘల్‌లనుంచి స్వాధీనపరచుకొన్న యావత్తు సామగ్రినీ వారు వెంట తీసుకుపోయారు." సల్హేర్ యుద్ధం మరాఠా చరిత్రలలో, జానపదుల పాటల్లో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తుంది. హిందీ కవి భూషణ్ కూడా పసగలిగిన పద్యాలను ఆ యుద్ధవర్ణనకు వినియోగించాడు.

ఔరంగాజేబ్‌కు ఆపత్కాలం దాపురించింది. వాయవ్య సరిహద్దు ప్రాంతంలోని ఆటవిక తెగలు బహిరంగంగా తిరుగుబాటు చేశాయి. కీర్తిశేషుడైన ప్రధాన మంత్రి మీర్జుమ్లా కుమారుడు మహమ్మద్ అమీన్ ఖాన్‌ను కాబూల్ రాష్ట్ర గవర్నర్ పదవిలో ఔరంగజేబ్ నియమించాడు. అమీన్ ఖాన్ ఖైబర్ కనుమగుండా పోతున్నప్పుడు అఫ్ఘన్ తిరుగుబాటుదారులు అతనిపై దాడి చేశారు. అది మొఘల్‌లకు వినాశకరంగా పరిణమించింది. మహమ్మద్ అమీన్‌తన కుమారుని పోగొట్టుకొన్నాడు. అతని అంతఃపురస్త్రీలు శత్రువుల వశమయారు. అతను ఎంతో కష్టంతో మాత్రమే పెషావర్‌కు తప్పించుకుని పోయాడు. కాబూల్ గవర్నర్ పదవికి నియమించిన మహబత్‌ఖాన్ అక్కడ 1672 డిసెంబరు నుంచి 1673 డిసెంబర్ వరకు ఉన్నాడు. మేవాత్ జిల్లా లో 1672 లో సంభవించిన సత్నామీ తిరుగుబాటు ఔరంగజేబ్‌కు వ్యాకులాన్ని కలిగించిన కారణాల్లో మరొకటి. చాలా ప్రయాసపడి ఆ తిరుగుబాటును అణచివేశారు.

బహదూర్‌ఖాన్ ఆధ్వర్యంలో మొఘల్‌లు తమ శక్తినంతా ఉపయోగించి శివాజీతో పోరాడారు. శివాజీకి చెందిన సముద్ర తీరప్రాంతాలపై దాడి చేయవలసిందిగా జంజీరాకు చెందిన సిద్ధీలను వారు ప్రేరేపించారు. వారు సిద్ధీల వనరులను ఇనుమడింపజేయడానికి

సూరత్ నుంచి దయనీయస్థితిలో వున్న ఒక చిన్న నౌకాదళాన్ని కూడా పంపారు.

ఇంతవరకు బ్రిటిషువారు శివాజీని ఒక చీడపురుగు వలె. న్యాయబద్ధంగా స్థాపితమైన ఔరంగజేబ్ అధికారం పట్ల ఒక తిరుగుబాటు దారుగా పరిగణించారు. కానీ శివాజీ మొఘల్‌లను జయప్రదంగా వ్యతిరేకించగలగడంలో వారి మొత్తం వైఖరిలో మార్పు వచ్చినట్లు ఈ కొన్ని ఉత్తరాలు తేటతెల్లం చేస్తున్నాయి.

మార్చి 30. 1670 "శివాజీ కార్యకలాపాలు ఈ అభిప్రాయానికి కొంత ప్రాముఖ్యాన్ని కలిగిస్తున్నాయి. కారణం అతనిప్పుడు. గతంలో వలె రహస్యంగా కాక. బహిరంగంగానే 30 వేల మంది. మనుషులతో కూడిన సైన్యంతో. వెళ్ళిన అన్ని తావుల్లోనూ విజయాన్ని సాధిస్తూ, దగ్గరలోనే రాకుమారుడు (మూఅజామ్) ఉన్నప్పటికీ నిర్భయంగా ముందుకు సాగిపోతున్నాడు. ఎదురుగా ఉన్న భూభాగాన్ని భుక్తంచేసికొని నియమించిన తన శత్రువులకు ఎక్కడ నుంచి సరఫరాలు అందుతున్నాయో చెప్పగలిగిన శివాజీకి ఈ ద్వీపం (బొంబాయి) ఎట్లా కనిపిస్తున్నదో తెలిసినందున..." "ఇప్పుడు శివాజీని గురించి ప్రస్తావిస్తున్నాము. నువ్వు భారతదేశంలోని రాజులందరితోనూ విరివిగా ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగిస్తున్నాట్లుగానే అతనితో (శివాజీ) కూడ సాగించడం ఉపయోగకరమని మేము భావిస్తున్నాము. ఈ పనిని నీవు చట్టబద్ధంగా బొంబాయినుంచి చేయవచ్చు.[1] అనే తీవ్రవాంఛకు బీజాపూర్ గురి అయింది. కాని శివాజీ స్వంత ప్రణాళికలు తయారుచేసికొని సరిఅయిన కాలంకొరకు వేచియున్నాడు"

## గోల్కొండలో అలజడి

దక్కన్ రాజ్యాలు. అహ్మదనగర్, బీజాపూర్, గోల్కొండ, మూడింటిలో అహ్మదనగర్ రాజ్యాన్ని మొఘల్‌లు అంతమొందించారు. మిగిలిన బీజాపూర్, గోల్కొండ రాజ్యాలను మొఘల్ సామ్రాజ్యంలో చేర్చే తమ అంతిమ లక్ష్యాన్ని ఎన్నడూ దాచి పెట్టలేదు. గొల్కొండ 1635 నాటి సంధి ద్వారా కప్పంచెల్లించే సామంతరాజ్యం స్థితిని దాదాపుగా అంగీకరించింది. అయితే అహమ్మదనగర్, రాజ్యాన్ని అంతమొందించటంలో బీజాపూర్ సహకారానికి మూల్యంగా, దానికి వేరు ప్రతిపత్తిని ఇచ్చారు.

దక్కన్ రాజ్యాలతో శాంతి 20 సంవత్సరాలపాటు అమలులో ఉంది. దక్కన్‌లో రాజ ప్రతినిధిగా అత్యాశగల ఔరంగజేబ్ 1656 లో గోల్కొండపై దాడిచేసి ఆ

[1] ఇంగ్లీషు రికార్డులు- శివాజీపై. పుట 144. ఆగష్టు 30. 1670.

బలహీన రాజ్యాన్ని నీచమైన షరతులకు అంగీకరింపచేశాడు. తరువాత ఔరంగజేబ్ 1657 లో బీజాపూర్ పై దండయాత్ర సాగించాడు. షాజహాన్ అనారోగ్యం తత్ఫలితంగా జరిగిన అంతర్యుద్ధం ఔరంగజేబ్ ఉత్తర భారతానికి త్వరగా వెళ్ళవలసిన స్థితిని కల్పించింది. మొఘల్‌లు 1665 లో బీజాపూర్‌పై మరొకసారి దండయాత్ర చేశారు. ఈ సారి మొఘల్ సైన్యం అధిపతిగా జయసింగ్ బీజాపూర్‌పై దాడి చేశాడు. ఆ దండయాత్ర సఫలీకృతం కాలేదు.

దక్కన్ రాజ్యాలు శాశ్వతంగా భయాందోళన స్థితిలో పడ్డాయి. అయినప్పటికి అవి మొఘల్‌లతో పోరాటానికి సమైక్యం కాలేకపోయాయి. రెండు రాజ్యాలలోనూ మొఘల్‌లతో సహకరించే శక్తులు చురుకుగా పనిచేస్తూవుండేవి

శివాజీ మొఘల్‌లకు వ్యతిరేకంగా తన కార్యకలాపాలను విస్తృతపరచడం లక్ష్యంగా పెట్టుకొన్నాడు. బీజాపూర్‌లో పఠాన్లు ఒక పక్షం, దక్కన్ ముస్లింలు, అబిసీనియా జాతి నుంచి ఉద్భవించిన సిద్ధీలు మరొక పక్షం కాగా వాటి మధ్య ఆధిక్యం కొరకు సంఘర్షణ కొనసాగింది. కాని గోల్కొండలో శివాజీకి లభ్యమైన అవకాశాన్ని అతను పూర్తిగా స్వప్రయోజనానికి వినియోగించుకొన్నాడు.

గోల్కొండ రాజు అబ్దుల్లా కుత్‌బ్‌షా 1672, ఏప్రిల్ 21 న కాలధర్మం చెందాడు. అతని తర్వాత సింహాసనం అధిష్ఠించిన అతని అల్లుడు అబుల్‌హసన్ గోల్కొండ రాజుల్లో చివరి రాజు అయాడు. మరాఠా చరిత్ర 'జేధే శాఖావళి' క్లుప్తంగా గోల్కొండతో శివాజీ మైత్రిని ఈక్రింది మాటల్లో వర్ణించింది: "శివాజీ రాయబారి నిరంజీపంత్ భాగ్యనగర్ (హైదరాబాద్) వెళ్ళి ఒక లక్ష హన్లకు మైత్రిని కుదుర్చుకొని, 66 వేల హన్లను తన వెంటకొనితెస్తూ శివాజీ వద్దకు తిరిగి వచ్చాడు."

"మొఘల్‌ల ప్రతిఘటించడానికి-తక్కిన దక్కన్ రాజ్యాలతో మైత్రి మత విభేదాలకు అతీతంగా శివాజీ సాగిస్తున్న రాజకీయ సంఘర్షణకు అనుగుణమైనది-కనుచూపుమేరలో ఉన్నది."

శివాజీ అప్పటికి మొఘల్‌లకు వ్యతిరేకంగా వీలైనమేరకు ఎక్కువ సంఖ్యలో ఆయాశకులను రెచ్చగొట్టడానికి కృతనిశ్చయుడయాడు. మొఘల్‌ల క్రింద ఉద్యోగిగా ఉన్న యువబుందేలా రాజాపుత్ర నాయకుడు ఛత్రసాల్‌తో ఆయన సమావేశాన్ని ఛత్రసాల్ ఆస్థాన కవి అయిన లాల్‌కవి ఛత్ర ప్రకాష్[1] అనే తన జీవిత చరిత్రాత్మకమైన కావ్యంలో విశదంగా వర్ణించాడు. ఛత్రసాల్ 1672 లో మొఘల్ పక్షాన్ని

[1] ఛత్ర ప్రకాష్, డాక్టర్ మహేంద్ర ప్రతాప సింగ్‌చే సంపాదితం, శ్రీ పటాల్ ప్రకాశన్, న్యూఢిల్లీ, 1973 పుటలు 88-89.

వదలి, పూనాకు వెళ్ళి, శివాజీతో గణనీయమైన కాలంపాటు నివాసంచేసి సాయుధ శిక్షణను పొందాడు. శివాజీ అతనికి బుందేల్‌ఖండ్ వెళ్ళమని మొఘల్‌లకు వ్యతిరేకంగా ప్రతిఘటనను వ్యవస్థీకరించని తన మాతృభూమికి స్వేచ్ఛను కలిగించుమని సలహా ఇచ్చాడు. ఛత్రసాల్ నడుముకు ఆయన ఒక కత్తిని కట్టి అతనికి ఆశీర్వదించాడు. తరువాత మొఘల్‌లతో పోరాడటానికి అతను బుందేల్‌ఖండ్ తిరిగి వెళ్లేందుకు ఆయన అనుమతించాడు.

ఛత్రసాల్‌తో ఆయన చెప్పిన మాటలు ఇలా వున్నాయి. "ఓ ఘనత వహించిన నాయకుడా మనం (ఒకరికొకరం) ఎన్నడూ పరాయివారంకాదు. నీ దేశానికి వేగంగా వెళ్ళి మొఘల్ సైన్యాలను నాశనంచేయి. తురుష్కుల వలన భయం చెందకు వారు ఏనుగులైనట్లుయితే నీవు నాశనం చేయగల నిజమైన సింహానివి. తురుష్కులకు సాధ్యాసాధ్య వివేచన (దూరదృష్టి గల జ్ఞానం) లోపించింది. వారు మమ్ముల్ని తిరస్కరించారు. భవానీ దేవత నాకు మార్గదర్శి అయింది. మొఘల్‌లు వారికి అనుకూలమైన మార్గంలో ముందుకు సాగలేకపోయారు. మేము మా దేశానికి చాకచక్యంతో తిరిగి వచ్చాము. ఇప్పుడు మొఘల్‌లు వారి సేనానులను మాకు వ్యతిరేకంగా పంపారు. తురుష్కులపై మా కత్తులు దూశాము. వారిపై దాడి చేయగలము. నీవు నీ దేశానికి వెళ్ళు. నీ కత్తిని ఉపయోగించి, తురుష్కులను[1] నాశనంచేయి. నీ హృదయంలో వ్రజనాథ్ భగవానుని జ్ఞప్తి వుంచకుని చేతిలో కృపాణాన్ని ధరించు. ఈ రెండు భగవంతునిపై విశ్వాసము, చేతిలో కత్తి నిన్ను రక్షించగలవని నమ్ము. ఇక్కడ నా కొలువులో నిన్ను ఉంచినట్లయితే, నీ కార్య కలాపాలను నాకు ఆపాదించగలరు. అందువల్ల నీ దేశానికి తిరిగి వెళ్ళి మొఘల్ సైన్యాలను నిర్జింపుము. నీ ఘనమైన యోగ్యమైన విజయ వార్తలను మాకు వినిపించు." ఈవిధంగా పలికి ఆయన ఒక కత్తిని తెప్పించి ఛత్రసాల్ నడుముకు బంధించాడు. తరువాత ఆయన ఛత్రసాల్‌కు గౌరవపురస్కారంగా వీడ్కోలు చెప్పాడు. శివాజీ మహాదానంద భరితుడయాడు. తరువాత తన వృద్ధాప్యంలో ఛత్రసాల్ స్వయంగా ఈ సందర్భనను గురించి తన కుమారునికి వ్రాశాడు: "నేను పూనా వెళ్ళి శివాజీని కలిశాను, శివాజీతో కలసి చాలాకాలం ఉన్నాను.విలువిద్యామొదలైన వాటిలో నేను శిక్షణ పొందాను."[2]

---

[1] శత్రువును ముస్లింలుగా కాక తురుష్కు జాతివారుగా సంభోదించడం గమనార్హ మైనది. ఇది పోరాటాన్ని సరి అయిన దృక్కోణంలో చూపిస్తుంది.

[2] ఇతహాసిక్ ప్రమాణావళి ఔర్ ఛత్రసాల్, డా. మహేంద్రప్రతాప్‌సింగ్‌చే సంపాదితం, శ్రీ పటల్ ప్రకాశన్.

ఛత్రసాల్ జీవిత యాత్ర సుప్రసిద్ధమైనది. బుందేల్‌ఖండ్‌లో ఛత్రసాల్ ఉనికి గట్టిపడుతున్న గోల్కొండ వైఖరి శివాజీ కలిగించిన ఆవేశంతో కొత్తమార్గాలను కనుగొన్నాయి. మొఘల్ మరాఠా సంఘర్షణ ఔరంగజేబ్ మతమౌఢ్య విధానాల వలన, అసహనానికి అర్థరహితమైన దౌర్జన్యానికి వ్యతిరేకంగా జాతి వ్యాప్తమైన పోరాట రూపాన్ని ధరించింది. అది మత పరమైన, ప్రాంతీయమైన హద్దులను అధిగమించింది. కాగా పైన పేర్కొన్న సాక్ష్యాధారాల దష్ట్యా శివాజీ పోరాటాన్ని సంకుచితమైనదిగా, లేక మతపరమైనదిగా చూసే ఒక పండితవర్గ వైఖరి శోచనీయమైనది మాత్రమే.

బహదూర్‌ఖాన్ దక్కన్‌లోని మొఘల్ సైన్యాల సైన్యాధ్యక్ష పదవీ బాధ్యతలను 1672 లో స్వీకరించగా మూ అజ్జామ్ రాకుమారుడు దక్కన్‌లో రాజ ప్రతినిధిగా కొనసాగాడు. ఔరంగజేబ్ అప్పుడు మూ అజ్జామ్ రాకుమారుని వెనక్కి పిలిపించి, బహదూర్‌ఖాన్‌ను రాజ ప్రతినిధిగా నియమించాడు. మూ అజ్జామ్ చక్రవర్తి ఆస్థానానికి చేరుకొని, చక్రవర్తిని 1672 జూలై 25 న ప్రత్యేకంగా సందర్శించ కోరాడు.

మొఘల్‌లు బగ్లానాలో అంటే ఈ నాటి నాసిక్ జిల్లాలోని పశ్చిమ భాగాలలో, చిక్కుపడినట్లు తెలుస్తుంది. శివాజీ అనుసరించిన గొప్పవ్యూహంవల్ల ఇది సంభవించింది. మొఘల్‌లు దక్షిణంగా పురోగమించి తన మాతృభూమిలోకి ప్రవేశించకుండా చేసేందుకు ఆయన బగ్లానాలోని దట్టమైన అరణ్యాలలో మొఘల్‌లు పోరాటంలో నిమగ్నమయేట్లు చేశాడు. అక్కడ తన పట్టును కాపాడుకొంటూ మొఘల్‌లు మరాఠాలను తరుముతూ గోల్కొండ సరిహద్దులవైపు, ఉత్తరాన బేరార్ ఖాండేష్‌ల దిశగా వెళ్లేటట్లు చేశాడు. కొన్నిసార్లు మొఘల్‌లు పూనాకు తమ దాడులు కొనసాగించారు. బహదూర్ ఖాన్ అహమ్మద్‌నగర్‌కు దక్షిణంగా 93 కి. మీ. దూరంలో భీమానదిపై గల పెడ్‌గాన్ వద్ద తన సైనిక విడిదిని ఏర్పాటు చేశాడు. దానికి బహదూర్ గఢ్ అనే పేరు పెట్టాడు. అక్కడ ఒక దుర్గాన్ని అతను నిర్మించాడు. శంభాజీ 1689 లో మరణించేవరకు బహదూర్ గఢ్ మొఘల్‌లకు పురోగామికేంద్రంగా ఉండేది!

నాసిక్ జిల్లాలో చేసిన ఆక్రమణ యుద్ధాల ద్వారా దక్కన్‌లో అనేక ప్రాంతాలలో కొనసాగించిన దాడుల ద్వారా శివాజీ తన స్వంత భూభాగాలకు వాంఛనీయమైన భద్రతను సాధించాడు. మొఘల్ సేనానులు మొదట ఔరంగజేబ్ తర్వాత మారాఠాలను నాసిక్ నుంచి వెళ్ళగొట్టి, కొంకణ్‌లో చొచ్చుకొని పోవడానికి పథకాలు వేయడానికి 19 సంవత్సరాల దీర్ఘ కాలం పట్టింది. ఆవిధంగా శివాజీ తన రాజ్య పాలనాకాలంలోనే గాక, తన కుమారుని హయాంలో కూడా సురక్షితం చేశాడు. ఆయన కుమారుడు మృతి చెందిన తరువాతనే మొఘల్‌లు కొంకణ్‌లోకి చొచ్చుకొని పోయి పూనా దాని

చుట్టూ ఉన్న దుర్గాల వైపు పురోగమించగలిగారు.

ఈ యుద్ధం శివాజీని గొప్ప సేనానిగా, యుద్ధతంత్ర రచయితగా ఆవిష్కరిస్తున్నది. ఈనాడు కూడా ఆయన సైనిక ఎత్తుగడలు, లోతుగా అధ్యయనం చేయదగినవి. ఈ ఆసాధారణ వ్యక్తి శైలిలో పద్ధతిలో మొఘల్‌లను మించిపోయినట్లు స్పష్టమవుతూంది.

భిన్న వర్గాలతో నిండిన మొఘల్ సైన్యం ఉద్రిక్తలకు అతీతంగా లేదు. చరిత్రకారుడు భీమ్‌సేన్ ఈ (వాస్తవాలను) బహిర్గతం చేసే సంఘటనను నివేదించాడు. "బహమార్ ఖాన్ భీమానది గట్టులపై మకాం చేశాడు. దిలేర్ ఖాన్ ఆధ్వర్యంలోని ఆఫ్ఘన్ సైనికులు మోటువారు. దుష్టస్వభావం గలవారు. వారు ప్రయాణికులను కొల్లగొట్టారు. ఆ ప్రయాణికులలో ఒకడు మరణించాడు. బహదూర్‌ఖాన్ కుమారుడు ఈ వ్యవహారంపై దర్యాప్తు జరిపాడు. ఆఫ్ఘన్‌లను దారికి తేవడానికి బహదూర్ ఖాన్ తన ఫిరంగి దళాన్ని సిద్ధ పరచాడు. రోహిల్లాలు అతని ఫిరంగులను లక్ష్య పెట్టకుండా, ముందుకు నెట్టుకొని వచ్చారు. బహదూర్‌ఖాన్ ఫిరంగి దళాన్ని కాల్పులు చేయమని ఆజ్ఞాపించాడు. అనతి కాలంలో 600 మంది రోహిల్లాలు హతులయారు."

# 7

# 1673 నాటి యుద్ధము

మొఘల్‌లతో యుద్ధం కొనసాగుతుండగా బీజాపూర్ పాలకుడు అలీ అదిల్షా 1672 నవంబర్ 24 న మృతిచెందాడు. ఇది శివాజీకి కొత్త దిఙ్మండలాలను తెరిచింది. తన మాతృభూమి స్వరాజ్యం నుంచి మొఘల్‌లను వెళ్ళగొట్టి వారినుంచి దానిని రక్షించడానికే శివాజీ ప్రధానంగా వారి పై దాడిచేశాడు. అతను మొఘల్ భూభాగాలలోనికి చొచ్చుకొనిపోయి ప్రస్తుతపు నాసిక్ జిల్లాలోని దుర్గాలను కొంత భూభాగాన్నీ స్వాధీన పరచుకున్నాడు. మొఘల్‌లను దక్షిణ దిశగా పురోగమించకుండా చేసి, వారిని తూర్పు వైపు మళ్ళించి, గుజరాత్‌కు వెళ్ళే మార్గాన్ని వశపరచుకొని దానిని పటిష్టంగా తన ఆక్రమణలో ఉంచే ఆయన గొప్ప వ్యూహంలో అది ఒక భాగము.

నిస్సంశయంగా మొఘల్ భూభాగం నుంచి శివాజీ స్వాధీన పరచుకొన్న ఏకైక ప్రాంతం దుర్గాలతో సహా నాసిక్‌లో పశ్చిమభాగము, దాని ఆక్రమణ ఆయన మాతృభూమిని సురక్షితంగా ఉంచే ఆయన లక్ష్యంలో భాగము.

మొఘల్ భూభాగంలో పెద్ద స్థలాలను ఆక్రమించే విషయంలో శివాజీకి ఎటువంటి భ్రమ లేదు. మొఘల్‌ల వలె భారత దేశ వ్యాప్తమైన ఏ శక్తీ తన భూభాగంలో ఒక విభాగాన్ని వేరు పరుస్తున్నప్పుడు చేతులు ముడుచుకొని ఊరుకొని వుండలేదు. మొఘల్‌లు నాసిక్ జిల్లానుంచి మరాఠాలను తొలగించేందుకు శక్తివంచన లేకుండా పోరాడ గలరని శివాజీకి తెలుసును. వారు ఆయన స్వంత భూభాగం పై దాడిచేయడానికి పథకం వేయగలిగే ముందు 19 సంవత్సరాల దీర్ఘకాలం పాటు పోరాడేటట్లు చేయడం ఆయన ప్రతిభకు తార్కాణం. కానీ ఆ దండయాత్ర 1689 లోనే శివాజీ మరణించిన తర్వాత తొమ్మిది సంవత్సరాలకు ఔరంగజేబ్ దక్కన్‌లో మకాం పెట్టిన 8 సంవత్సరాల తర్వాత సంభవించింది.

బీజాపూర్‌తో వ్యవహారం పూర్తిగా భిన్నమైన కథ. శివాజీ రాజ్యం, (నాసిక్‌లోని చిన్ని మొఘల్ ప్రాంతం మినహా) చాలావరకు బీజాపూర్ రాజ్యం నుంచి రూపొందిన, వాస్తవాన్ని మరువరాదు. శివాజీ నాటికి పూనా, కొంకణ్ ప్రాంతాలపై ఆధిపత్యం

కలిగి ఉన్నాడు. మొఘల్‌లతో చేసికొన్న పురందర్ సంధి ప్రస్తుతపు సతారా, సాంగ్లీ, కొల్లాపూర్ జిల్లాతో వాటి పొరుగున ఉన్న నేటి కర్ణాటక రాష్ట్రంలోని ప్రాంతంతో (బెల్గాం, కార్వార్ ధార్వార్‌లోని విభాగాలు) కూడిన, బాలాఘాట్ అనే పేరు కలిగిన దానిని వశపరచుకొనేందుకు ఆయనకు స్వేచ్ఛనిచ్చింది.

అలీ అదిల్షా మరణంతో బీజాపూర్ రాజ్యం తిరిగి గందరగోళ స్థితిలో పడింది. ఉద్దేశపూర్వకంగా చేసిన విధ్వంసకాండ వలన ఆ రాజ్యం క్రమేపీ ముక్కచెక్కలు కాజొచ్చింది. సికందర్ అదిల్షా నాలుగు సంవత్సరాల చిరుతప్రాయంలో సింహాసనారూఢుడు కావడం, అధికార సంపాదన కోసం ప్రభువర్గీయులలో స్పర్థ ఆరంభం కావడానికి నాంది పలికింది. గోల్కొండ రాజకీయాలలో ఎటువంటి పాత్ర వహించలేని పఠానులు బీజాపూర్ రాజకీయాలలో గణనీయమైన శక్తిగా మారారు. ఇది అబిసీనియన్లను దక్కన్ ముస్లింలను ప్రత్యర్థి శిబిరంలో చేర్చింది. వారి సంఘర్షణ రాజ్యాన్ని (బీజాపూర్) దాదాపుగా విభజించడం ద్వారానే పరిష్కారమయింది.

(బీజాపూర్) రాజ్యపాలనను సుమారు 12 సంవత్సరాల పాటు నిర్వహించిన ప్రధానమంత్రి అబ్దుల్ మహమ్మద్ కొత్త ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి తొందరపడలేదు. రాజ్యంలో ఈక్రింది విధంగా వ్యవస్థను ఏర్పరచడానికి అదిల్షా సమ్మతిని అతను పొందాడు. (1). పూర్వపు ప్రధానమంత్రి ఖాన్ మహమ్మద్ ఖాన్ ఖానన్ (1648-1657) కుమారుడు ఖవాస్ ఖాన్ బాలరాజు సంరక్షకుడిగా వ్యవహరించి పరిపాలనను నిర్వహించగలడు, (2). అబ్దుల్ మహమ్మద్ తన స్వాధీనంలో నల్‌దుర్గ్ గుల్బర్గాలను ఉంచుకోగలడు. అవసరమైతే మొఘల్‌లకు వ్యతిరేకంగా అతను బీజాపూర్‌ని రక్షించవలసి ఉంటుంది; (3). బీజాపూర్‌లోని ప్రధాన పఠాన్ ప్రభువర్గీయుడు అబ్దుల్ కరీమ్ బహలూల్ ఖాన్ పన్హాలా మిరాజ్‌ల నిర్వహణ బాధ్యతవహించి శివాజీపై దండయాత్రను కొనసాగించగలడు; (4). ముజఫర్ ఖాన్ కర్ణాటక జిల్లా నిర్వహణ బాధ్యతను స్వీకరించగలడు.

శివాజీ అటువంటి అవకాశం కొరకే వేచియున్నాడు. అతను వెంటనే బీజాపూర్‌పై దండయాత్ర చేశాడు. అతను పటిష్ఠదుర్గం పన్హాలాను ముట్టడించి 1673 మార్చి 6 న దానిని స్వాధీనపరచుకొన్నాడు. బీజాపూర్‌పై తరువాత యుద్ధచర్యలను నడిపిస్తూ ఒక నెల పాటు పన్హాలాలో ఉన్నాడు. తర్వాతి కాలంలో సజ్జన్‌ఘఢ్‌గా ప్రసిద్ధిచెంది శ్రీరాందాస్ స్థావరమైన పర్లీ దుర్గం 1673 ఏప్రిల్‌లో పతనమయింది. సతారా జూలై 27 న స్వాధీనమయింది. ఈ దండయాత్రకు ఊహించిన విధంగా బీజాపూర్ తీవ్రంగా స్పందించింది. రెండు సమకాలీన రచనలు-బీజాపూర్ ఆస్థాన కవి అయిన సస్రతీ

దక్కనీ ఉర్దూలో వ్రాసినది ఒకటి, రాధా-మాధవ్-విలాస చంపూ రచయితగా ప్రసిద్ధుడైన జయరాం పిండ్యే సంస్కృతంలో వ్రాసినది మరొకటి-పన్హాలా ముట్టడి ఉమ్రాని యుద్ధాన్ని వస్తువుగా కల్గినది.

ఖవాస్ ఖాన్ శివాజీ తెచ్చిన ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి గొప్ప ఏర్పాట్లు చేశాడు. జయరాం వ్రాసినది; "రాజు అనుమతిని పొంది, బహలూల్ ఖాన్ తికోటా చేరాడు. రెండు రోజుల తర్వాత అతను (బీజాపూర్‌కు పశ్చిమంగా 58 కి.మీ. ఉన్న) ఉమ్రానీ వద్ద ఉన్నాడు. అక్కడ అతనిని ప్రధానమంత్రి ఖవాస్‌ఖాన్ రంగ్నా దుర్గసమీపంలో మకాం చేస్తున్న షర్జాఖాన్ ముజఫర్ మాలిక్‌ల సహాయాన్ని పొందుమని చెప్పాడు. తక్కిన బీజాపూర్ సేనానులు, ఆదోనికి చెందిన సిద్ధీమసూద్, కర్నూల్‌కు చెందిన అబ్దుల్ అజీజ్ నల్‌దుర్గ్‌కు చెందిన ఖిజర్‌ఖాన్ పన్నీలను మొఘల్ సేనాని దిలేర్‌ఖాన్‌తో, సంబంధం ఏర్పరచుకొని బహుమానాల్చి సైనికుల ఆయుధాల రూపేణా సహాయం చేయవలసిందని అతనికి నచ్చచెప్పమని ఆదేశించారు."

బీజాపూర్ శివాజీపై దాడి చేయాలని తలపట్టింది.

ఇంతలో శివాజీ, శత్రువులు తనకు వ్యతిరేకంగా సమైక్యం కావడానికి ఎన్నడూ అనుమతించనందున బహలూల్ ఖాన్‌తో అతని సేనానులు చేరకమునుపే అతనిపై దాడి చేయడానికి నిర్ణయించాడు. ఆయన ఆదేశాల ప్రకారం మరాఠా సైన్యాధ్యక్షుడు 1673 మార్చిలో బహలూల్ ఖాన్ పై తలపడ్డాడు.

జయరాం పిండ్యే, సభాసద్, నస్రతీ ఆ యుద్ధాన్ని గురించి చెప్పిన వృత్తాంతాలు దానిని తీవ్ర పోరాటంగా నిర్దేశిస్తున్నాయి. బహలూల్ సైన్యాన్ని చుట్టుముట్టిన మరాఠాలు జలాధారానికి దాని ప్రవేశాన్ని నిరోధించారు. సూర్యాస్తమయం వరకూ తీవ్ర పోరాటం కొనసాగింది. ఇరు పక్షాలలోనూ చనిపోయిన వారి, గాయపడిన వారి సంఖ్య భారీగా ఉంది. సూర్యాస్తమయ సమయం కాబోతూండగా అన్నింటికీ తెగించిన యత్నం చేసిన తరువాత జలాశయాన్ని ప్రవేశించగలిగారు.

రాత్రి వేళ ఏదైనా రహస్య అవగాహన ఫలితంగా కాబోలు మరాఠా (యుద్ధ స్థలం నుంచి) వెళ్ళిపోయారు. బహలూల్ ఖాన్ తప్పించుకొనేందుకు అనుమతించిన తన సేనాని ప్రతాపరావ్ గుజార్‌ను శివాజీ నిందించాడు. బహలూల్‌ఖాన్ తప్పించుకొని వెళ్ళి పోవడానికి అనుమతించడంలో ప్రతాపరావ్‌కు స్వీయ హేతువులు ఉండి ఉంటాయి. యుద్ధంలో గాయపడిన వారి సంఖ్య భారీగా ఉండవచ్చు బహుశా బహలూల్ శిబిరానికి అదనపు దళాలు వస్తూ మార్గ మధ్యంలో ఉండి ఉండవచ్చు.

మరాఠాలు దక్షిణాభిముఖంగా కదలిపోయి హుబ్లీ పట్టణాన్ని ముట్టడించారు.

ఆ పట్టణాన్నంతటినీ ఏప్రిల్ రెండవ వారంలో కొల్లగొట్టుటలో ఒక బ్రిటిషు వ్యాపార కేంద్రానికి కొంత నష్టం సంభవించింది. బ్రిటిషువారు ముందుగా రాజపూర్‌లో, తర్వాత హుబ్లీలో కలిగిన నష్టాలను పరిష్కరించుకోవడానికి శివాజీ వద్దకు థామస్ నికొల్స్‌ను పంపాడు. ఖాందేష్‌లోని వారి వ్యాపారకేంద్రాలు కూడా నష్టానికి గురిఅయాయి. శివాజీతో 1673 మే 19 నుంచి జూన్ 17 వరకు నడచిన బ్రిటిషు రాయబారాన్ని గురించిన సవివరమైన వర్ణన మనకు లభిస్తుంది. రీక్లాఫ్ వాన్ గోయెన్స్ ఆధిపత్యంలోని డచ్ నౌకాదళం బొంబాయి రేవునూ దుర్గాన్ని వశపరచుకుంటూ వుండగా శివాజీ 3000 సంఖ్యాబలంగల సైన్యంతో బొంబాయిని ముట్టడించి నందుకు ప్రతిఫలంగా దండారాజపురిని స్వాధీనపరచుకోవడంలో సహాయం చేయడానికి డచ్చివారి ప్రతిపాదన శివాజీ తిరస్కరించడంతో బ్రిటిషువారికి ప్రోత్సాహం లభించింది.[1] డచ్చివారి ప్రతిపాదనను త్రోసివుచ్చే ముందు నిస్సందేహంగా శివాజీ దానిని జాగ్రత్తగా పరిశీలించి ఉంటాడు. శివాజీ వ్యక్తిత్వాన్ని, మూర్తిమంతాన్ని, ఆలోచనా సరళినీ వెలుగులోకి తేవడం ద్వారా ఆసక్తిదాయకమైన నికొల్స్ రాయబారం జయప్రదం కాలేదు.

విదేశీయులతో వ్యవహరించటంలో శివాజీ అప్రమత్తంగా ఉండేవాడు. కొయ్యకలప రవాణాపై విధించే సుంకాలనుంచి మినహాయింపువంటి అల్ప ప్రాధాన్యం గల విషయాలపై హామీయివ్వడంపై అంగీకారం కుదిరినప్పటికీ రాజపూర్ లేక హుబ్లీలొ సంభవించిన నష్టాలకు పరిహారం విషయమై బ్రిటిష్‌వారి కోర్కెలపై నిర్ణయం తీసుకోలేదు.

అటువంటి కోర్కెల విషయంలో శివాజీ వైఖరి వివేకవంతుడైన ఏ పాలకుడైనా అవలంభించేదే. అన్నీ పరిగణించినట్లయితే మరాఠాలు మొఘల్‌లు యుద్ధంలో మునిగి ఉన్నారు. మొఘల్ భూభాగానికి మరాఠాలు నష్టాలు కలిగించినట్లయితే మొఘల్‌లు వారి అధీన ప్రజలను రక్షించవలసిందని కోరవలసింది మొఘల్‌లనే కానీ మరాఠాలను కాదు. అందువలన శివాజీ బ్రిటిష్‌వారి కోర్కెలను అంగీకరించలేదు. వారు 1660 లో పన్హాలా ముట్టడి సందర్భంగా సిద్ధీజవహర్‌కు ఆయుధాలతో ప్రేలుడు సామాగ్రితో ఏ విధంగా తోడ్పడ్డారో ఆయన విస్మరించకూడదు. మరాఠా సిద్ధీ సంఘర్షణలో వారు పోర్చుగీసువారు ఏవిధంగా సిద్ధీ పక్షం వహించారో కూడా ఆయన ఎఱుగును. వ రు వారి పొరుగులో శక్తివంతమైన మరాఠా రాజ్య ఆవిర్భావం పట్ల సంతసింపలేదని తేటతెల్లమయింది. బ్రిటిషువారు తన రాజ్యంలో వ్యాపారం చేసుకొవ

---

[1] ఇంగ్లీషు రికార్డ్స్, శివాజీ, 1673 మార్చి 28, పుట 240.

డానికి అనుమతిస్తూనే సహజంగా మరాఠా రాజ్య ప్రయోజనాలను కాపాడడం ఆయన ప్రధాన లక్ష్యంగా ఉండేది.

**మొఘల్‌లు**

హుబ్లీ గవర్నర్ ముజఫర్ ఖాన్‌ను ఆలస్యంగా హుబ్లీ చేరుకోవడంలో చూపిన నిర్లక్ష్యానికి బీజాపూర్ ప్రభుత్వం అవమానానికి గురిచేసింది. అతను అధికారాన్నంతటినీ పోగొట్టుకొన్నాడు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా అతను తిరుగుబాటు చేశాడు. కార్వార్ ఉప గవర్నరయిన మియాన్ సాహెబ్ కూడా తిరగబడ్డాడు. ఆవిధంగా బీజాపూర్ తన అరాజకశక్తులను అణచుటలో నిమగ్నం కావలసివచ్చింది. కొల్హాపూర్ వద్ద స్థానాన్ని నిర్వహించ పూనుకొన్న బహులూల్ ఖాన్ మాత్రమే మరాఠాలతో నిర్విరామంగా పోరాడసాగాడు. కొల్హాపూర్‌లో పటిష్ఠమైన స్థానం లభ్యంకాగా శివాజీ కార్యకలాపాలు ఆయనను పొరుగున ఉన్న కర్ణాటక జిల్లాలకు కొనిపోయింది. మరాఠీ చరిత్ర 'జేధేశాఖావళి' బంకాపూర్‌ను 1673 అక్టోబర్ 10 న శివాజీ కొల్ల గొట్టినట్లు నమోదు చేసింది.

బొంబాయిలోని బ్రిటిషువారి మనస్సులో శివాజీ ఒంటరిగా బీజాపూర్‌తో, మొఘల్‌లతో సాగించిన పోరాటం స్పష్టంగా నాటుకుంది. వారు ఇలా వ్రాశారు. "శివాజీ పరిస్థితి వారు అతన్ని గురించి వ్రాసినంత చెడ్డగా లేదు. శత్రువులనందరినీ అతను తృణీకరించి వారి పట్ల పౌరుషం గల వానివలె నడచుకొంటున్నట్లు చెప్పడం వాస్తవానికి ఎక్కువ దగ్గరగా ఉంటుంది."[1]

వాయవ్య సరిహద్దులో ఔరంగజేబ్ వ్యవహారాలు సాఫీగా సాగిపోలేదు. కాబూల్ గవర్నర్, మహమ్మద్ అమీన్ 1672 మే 6 న పఠాన్ల వలన ఘోర పరాజయాన్ని పొందగా అతని స్థానే మహబత్ ఖాన్ నియమితుడయాడు. పఠాన్లను అణచి వేయమనే ఆదేశాలతో 1673 నవంబర్ 17 న పెషావర్ చేరుకొన్న తరువాత మొఘల్ సేనాని రాడ్ అందాజ్ ఖాన్ కూడా 1674 ఫిబ్రవరి 24 న మాటునుంచి వారి ఆకస్మిక దాడికి గురి అయి మరణించాడు. కాబూల్ రాష్ట్రంలో ఈ సంతోషదాయకం కాని పరిణామాల వల్ల ఔరంగజేబ్ స్పష్టంగా వ్యధ చెందాడు.

మొఘల్ సేనాని బహదూర్ ఖాన్ శివాజీని అదుపులో ఉంచడానికి సాహసోపేతమైన ప్రయత్నాలు చేశాడు. అప్పుడప్పుడూ అతను శివాజీ భూభాగంలోనికి

---

[1] ఇంగ్లీషు రికార్డులు, శివాజీ పై, పుట 283.

కూడా చొచ్చుకొనిపోయాడు. అటువంటి ఒక జయప్రదమైన పోరాటాన్ని గురించి భీమ్‌సేన్ సక్సేనా ప్రస్తావించాడు. అతను చెప్పినది: "ఈసారి పూనా ప్రాంతంలో మరాఠాలు గణనీయమైన సంఖ్యలో ప్రోగయినట్లు వార్తలు అందాయి. బహదూర్ ఖాన్ చాంబర్ గొండావద్ద తన ప్రయాణ సామగ్రిని భారీ యుద్ధసాధనాలను వదలి పెట్టి మరాఠాలను వెంటాడాడు. తరువాత జరిగిన సంఘర్షణలో సుభాకరణ్ బుందేలా అను సమ శౌర్యంతో పోరాడాడు. మరాఠాలను వెనుతిరిగి పోయేట్లు చేశారు." సాకీ మస్తయిద్‌ఖాన్ వ్రాసిన ఔరంగజేబ్ జీవిత చరిత్ర 'మసీరే అలంగిరి' లోని ఒక ప్రస్తావనను బట్టి తీర్మానించినట్లయితే ఈ యుద్ధం 1673 సెప్టెంబర్ లో అస్పష్ట మైన తేదీన సంభవించి ఉంటుంది.[1]

ఔరంగజేబ్‌కు వ్రాసిన ఒక ఉత్తరంలో బహదూర్ ఖాన్ సహాయకుడు, బగ్లానా ఉపగవర్నర్ అయిన నాందర్ ఖాన్ 1673 జూన్ 3 న సల్హేర్ సమీపంలోన మరాఠా లను ఓడించినట్లు స్వాతిశయంతో వెల్లడించాడు.

## నేసారీ యుద్ధం

శివాజీ ఈ యుద్ధంలో తన శక్తిసమన్వితుడైన సైన్యాధ్యక్షుడు ప్రతాపరావ్ గుజా ర్‌ను కోల్పోయిన విచారాన్ని అనుభవించవలసి వచ్చింది. ఉమ్రానీ యుద్ధంలో బహ లూల్ ఖాన్‌ను తప్పించుకొని పోవడానికి అనుమతించినందుకు ప్రతాపరావ్‌ను ఆయన నిందించాడు. అందుకు వెంటనే నొచ్చుకొనిన ప్రతాపరావ్ 1674 ఫిబ్రవరి 24 న నేసారీ వద్ద బహలూల్ ఖాన్ శిబిరంపై తొందరపాటుతో దాడి చేశాడు. 'కానున్నది కాక మానదు కదా!' ప్రతాపరావ్ ఆ దాడిలో మరణించాడు.

మరాఠా సైన్యాధ్యక్ష పదవిని 1674 ఏప్రియల్‌లో హంబీర్‌రావ్ మోహితే స్వీక రించాడు. అంతకు మునుపే సేనానులలో ప్రతాపరావ్ తరువాతివాడు, చుట్టూఉన్న బీజాపూర్ భూభాగంపై దాడిచేయటానికి సైన్యాన్ని సమాయత్తం చేశాడు. బహ లూల్ ఖాన్ ఆనందరావ్ వెంట పడ్డాడు. దిలేర్ ఖాన్ నాయకత్వంలోని మొఘల్‌లు కూడా బహలూల్ ఖాన్‌తో కలిశారు. బ్రిటిషువారి (వ్యాపార) ప్రతినిధి నారాయణ్ షెనాయ్ 1674 ఏప్రియల్ 4 న తన ఉత్తరంలో పూసగుచ్చినట్లు ఇలా వ్రాశాడు. "దిలేర్‌ఖాన్, బహలూల్ ఖాన్ ఆనందరాయ్‌తో పోరాడ్డానికి త్వరపడ్డారు. కానీ అత నికి అటువంటి ఇద్దరు సాహసోపేతులైన శత్రువులు తన ముందుకనపడగా వారితో

---

[1] మసీరే అలంగీరె.

పోరాడటానికి ధైర్యంచాలలేదు. కాగా రోజుకు 15 లీగ్ల దూరం (సుమారు 45 మైళ్ళు) ప్రయాణిస్తూ కెనరా వైపు పోసాగాడు. అతను ముందుపోతూండగా ఆ ఇద్దరు ప్రభువులూ అతనిని వెంబడించారు. కానీ కొన్ని రోజులు ససైన్యంగా పోయిన తరువాత, అతనిని వెంబడించటం తప్ప మరేమీ చేయడానికి సాహసం చాలనందున వారు ఇరువురూ తిరిగి వచ్చేశారు. దిలేర్‌ఖాన్ పన్హాలాను ముట్టడించడానికి వెళ్ళాడు. కానీ 5 రోజుల పాటు అక్కడ ఉన్న తరువాత తన పూర్వ స్థలానికి తిరిగి వచ్చాడు. బహలూల్ ఖాన్ కొల్హాపూర్ వెళ్ళాడు. ఆనందరాయ్ (ఆనందరావ్) దేశంలో ప్రతిభాగంలో ఎక్కువగా ప్రయాణం చేస్తూ బహలూల్‌ఖాన్ జాగీరుకు చెందిన బంకాపూర్‌కు 8 లీగ్ల (సుమారు 24 మైళ్ళ) దూరంలోని పెంచ్ అను పేరుగల పట్టణాన్ని దోచుకొన్నాడు. అక్కడనుంచి అతను మూడువేల ఎద్దులు బరువైన వస్తువులను మోస్తూ ఉండగా తిరిగి వచ్చాడు. ఆ సంగతి తెలిసిన బహలూల్ ఖాన్ ఖిజర్ ఖాన్ వారి యావత్తు సైన్యంతో అతనిని అడ్డగించాలని తలపెట్టారు. బంకాపూర్ సమీపంలో వారు తారసిల్లగా అక్కడ సంభవించిన దారుణ యుద్ధంలో ఆనందరాయ్ విజయాన్ని సాధించాడు. ఆ యుద్ధంలో బహలూల్‌ఖాన్ బంధువు ఖిజర్‌ఖాన్ సోదరుడు అసువులు కోల్పోయాడు. ఆనందరాయ్ ఆ శత్రుసైన్యాన్నంతటినీ దోచుకొని 500 గుర్రాలను రెండు ఏనుగులను ఇతర వస్తువులను తెచ్చాడు. బహలూల్‌ఖాన్ ఖిజర్‌ఖాన్ పారిపోయారు. తాను కొల్లగొట్టి తెచ్చిన సొమ్మును శివాజీ వద్ద వదలిపెట్టి మరి కొన్ని పట్టణాలను కొల్లగొట్టడానికి తిరిగి బాలాఘాట్ వెళ్ళాడు."

పైన పేర్కొన్న ఉత్తరంలో కొంకణ్‌పై మొఘల్‌ల పన్నుగడలను గురించి ఇలా వ్రాసి వుంది. "బహదూర్ ఖాన్ కొంకణ్‌లోనికి చొచ్చుకొని పోవాలని ఆశించాడు. కానీ రాజా శివాజీ పర్వతాల మధ్యగల దారులను, రహదారులను పగులగొట్టి, కనుమలు దుస్తరంగా ఉన్నచోట ఎడతెగని కాపలా దళాలను ఏర్పాటు చేసి పర్వత కనుమలను చొరరానివిగా చేశాడని తెలుసుకొని అతను బయులుదేరిన చోటికి తిరిగిపోయాడు."

నారాయణ్ షెనాయ్ 1674 ఏప్రిల్ 4న వ్రాసిన అదే ఉత్తరం మొఘల్ నౌకా దళాధిపతి సిద్ధీసంబోల్ మరాఠా దళాధిపతి దౌలత్‌ఖాన్‌ల మధ్య సంభవించిన ఒక యుద్ధాన్ని గురించి ప్రస్తావించింది. ఈ సమాచారాన్ని నారాయణ్ షెనాయ్‌కి శివాజీ స్వయంగా అందించాడు. బ్రిటిషువారికి వారి వ్యాపార ప్రతినిధి నారాయణ్ వ్రాసిన లేఖలో ఇలా వుంది. "మాన్యులైన మీకు సిద్దీ సంబోల్‌ను గురించి నేను విన్న వార్తను కుప్తంగా అందచేస్తాను. అతను సాతోస్లీ (సతావలీ, రాజాపూర్) నదిలో దౌల

త్‌ఖాన్ నౌకాదళంతో యుద్ధానికి తలపడ్డాడు. దానిలో ఒక వంద మందికి పైగా సిద్దీలు. 44 మంది దౌలత్ ఖాన్ నావికులు చనిపోయారు. దౌలత్ విజయాన్ని సాధిం చాడు కానీ బాణం తగిలి గాయపడ్డాడు. అదే విధంగా సిద్దీ సంబోల్ గాయపడ్డాడనీ, అతని చేతులు కాలిపోయాయని తెలుస్తున్నది. పైన చెప్పిన నదిలో మంచి విజ యాన్ని పొందనందుకు అతను వెస్సింగ్ సమీపంలోని హరేస్సర్‌కు వెళ్ళాడు. ఈ వార్తలు శివాజీ స్వయంగా నాకు తెలిపాడు."

బ్రిటిషువారికి, శివాజీకి మధ్యలో కొనసాగిన 1674 లో జయప్రదంగా ముగిసిన ఆ సంధిని ఖాయపరచడానికి శివాజీ వద్దకు హెన్రీ ఆక్రిన్‌డెన్‌నుపంపవలెనని బ్రిటిషు వారు నిర్ణయించారు. కాగా ఆ పనిని 1674 జూన్ 12 న పూర్తి చెశారు. రాజపూర్ వ్యవహారం పరిష్కారమైనందుకు వారిని తన భూభాగంలో వ్యాపారం చేసుకోవడా నికి అనుమతిస్తూ 1674 ఏప్రిల్ 6 న శివాజీ వాగ్దాన పత్రాన్ని జారీ చేసినందున బ్రిటి షువారు సంతోషించారు. శాంతి సమైక్యత స్నేహములకు సంబంధించిన ఆ (సంధి) నిబంధనలు, ఒప్పందం చేసుకొన్న పక్షాలను ఔదార్యంగల పాలకుడు శివాజీ రాజు గా, గౌరవనీయమైన బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీగా వర్ణిస్తున్నది. శివాజీని బందిపో టుదొంగ అనిన మునుపటి బ్రిటిషువారి తలంపుకు ఇది పూర్తిగా భిన్నమైనది. బ్రిటి షువారు వారి మొదటి వైఖరిని మార్చుకున్నారు. శివాజీ జంజీరాకు చెందిన సిద్ధీల మధ్య మధ్యవర్తిత్వం వహించడానికి కూడా వారు ప్రతిపాదన చేయగా దూరదృష్టిక లిగిన రాజనీతిజ్ఞుడైనందున శివాజీ ఆ ప్రతిపాదనను గట్టిగా తిరస్కరించాడు. సిద్ధీ లకు గుణపాఠం నేర్పడానికి ఆయన కృతనిశ్చయుడయాడు. సిద్ధీలకు దూరంగా ఉండవలసిందని వారికి ప్రత్యక్షంగా లేక ప్రచ్ఛన్నంగా ఎట్టి సహాయం చేయవద్దనీ ఆయన బ్రిటిషువారిని హెచ్చరించాడు. వివేచనాబుద్ధి కలిగిన బ్రిటిషువారు రహ స్యంగా వ్యవహరించ తలచారు.

బీజాపూరుకు వ్యతిరేకంగా కార్వార్ ప్రాంతంలో తిరుగుబాటు జరిగింది. ప్రభుత్వ యంత్రాంగం యావత్తూ దానిని సంబాళించుటలో నిమగ్నమైనది. బీజాపూర్ ప్రభుత్వం కాద్రా, కార్వార్, అంకోలా శివేశ్వర్‌లను తిరుగు బాటుదారు మియాన్‌ఖాన్ నుంచి తిరిగి స్వాధీనపరచుకొని, రుస్తుంజమాన్‌ను రాజప్రతినిధిగా నియమించినప్పుడు 1674 ఏప్రిల్‌లో మాత్రమే తిరుగుబాటు అంతమయింది. శివాజీకి వ్యతిరేకంగా ఇటువంటి దుడుకు చర్యకు దిగే స్థితిలో బీజాపూర్ లేదు.

ఇంతలో వాయవ్య ప్రాంత పఠాన్ తెగల తిరుగు బాటు అపాయకర స్థాయికి చేరుకుంది. రాడ్ అందాజ్‌ఖాన్ (షుజల్ ఖాన్) పఠాన్‌లతో పోరాడుతూ 1674 ఫిబ

వరి 24 న తన ప్రాణాలను కోల్పోయాడు. వాయవ్య ప్రాంతానికి వేగంగా మొఘల్ సైన్యాలను తరలించారు. ఔరంగజేబ్ కూడా 1674 ఏప్రిల్ 7 న (వాటిని) అనుసరించాడు. దక్కన్‌లో మొఘల్ రాజప్రతినిధి బహదూర్ ఖాన్ తన శ్రేష్ఠులైన ఉద్యోగులను దిలేర్ ఖాన్‌తో సహా ఉత్తర భారతానికి పంపాడు. మొఘల్ కార్యకలాపాలలో విరామ స్థితి నెలకొన్నది. స్థానిక ఆంధ్ర ప్రజలకు అధికారం హస్తగత మయ్యేటట్లుగా చేసిన గోల్కొండలోని రాజకీయ విప్లవం దానిని మరాఠాలకు సన్నిహితం చేసింది. తనను నాశనం చేయడానికి ఉద్దేశించిన మొఘల్ పన్నుగడల పట్ల భీతిల్లిన గోల్కొండ మరాఠాలకు చేరువయింది. మొఘల్‌లకు వ్యతిరేకంగా దక్కన్ రాజ్యాల మైత్రి అంతకు పూర్వంకంటే వాస్తవరూపం దిద్దుకుంది.

శివాజీ అధీనంలో చేరువగల భూభాగం, సమర్థవంతమైన సైన్యం రూపుదిద్దుకున్నాయి. మొఘల్‌లు నిశ్చేష్టులుగా, బీజాపూర్ కల్లోల భరితమైనదిగా, గోల్కొండ స్నేహ సంబంధిగా, పోర్చుగీసు వారు బలహీనులుగా, బ్రిటిషువారు మంచి నడతకలిగినవారుగా ఉన్నస్థితి అది. ఇది 1674 లో దక్కన్ తాలూకు సమగ్ర చిత్రం. ఔరంగజేబు రావల్పిండి సమీపంలోని హసన్ అబ్దుల్‌కు వెళుతున్న సమయంలో శివాజీ 1674 జూన్ 6 న రాజమకుటాన్ని ధరించి సర్వాధికారియైన రాజుగా తననుతాను ప్రకటించుకున్నాడు.

# 8
# పట్టాభిషేకం, అనంతరం

శివాజీ పట్టాభిషేకం, భారతదేశ చరిత్రలో ఒక మైలురాయి. మొఘల్‌ల ఆధిపత్య కాలంలో భారతీయులు, విదేశీయులూ కూడా భారతదేశంలోని మొఘల్ సామ్రాజ్యాన్ని భారత ప్రభుత్వానికి సమానంగా ఎంచారు. మొఘల్‌లతో అంతర్జాతీయ సంధులను, ఒప్పందాలను, భారతదేశంతో సంధులుగా పరిగణించారు. "ఘనుడైన మొఘల్, మొఘల్ సార్వభౌముడు," 'భారత చక్రవర్తి' వంటికొన్ని పదాలను వాటి అంతర్జాతీయ భాషలో స్వేచ్ఛగా వినియోగిస్తుండేవారు.

దక్షిణాన కేరళతీరంలో చిన్న విదేశీ స్థావరంవంటి అంచులలో ఉన్న వాటిని మినహాయిస్తే భారతదేశంలో స్వతంత్ర రాజ్యమని పిలువదగినది ఏదీ లేదు. అధిక భారత భూభాగంలో ప్రత్యక్ష మొఘల్ పరిపాలన నెలకొన్నది. ఉత్తరాన రాజపుత్ర రాజ్యాలు, దక్కన్ రాజ్యాలైన బీజాపూర్, గోల్కొండ మాత్రమే దాని పరిధుల్లో లేవు. రాజపుత్ర రాజ్యాలు జాగీర్ల లేక జమీందార్ల స్థితికి త్వర త్వరగా దిగిపోగా వాటి రాజులు వంశపారంపర్య హక్కు ద్వారానే పరిపాలిస్తున్నట్లుగా వాదించే స్థితిలో లేరు. ప్రతి సింహాసన వారసత్వం లాంఛన ప్రకారం, మొఘల్ చక్రవర్తుల అనుమతికి లోనై ఉండేది. ఏ రాజపుత్ర పాలకుడైన మరణించినపుడు, సిద్ధాంతరీత్యా, ఆ రాజ్యం సామ్రాజ్యానికి సంక్రమించినట్లు భావిస్తుండేవారు. కొత్త సింహాసన అధిరోహణాన్ని పూర్తిగా కొత్తగా అనుమతించవలసిన వ్యవహారంగా పరిగణించేవారు. సింహాసనాన్ని అధిష్ఠించగానే రాజపుత్ర రాజును అశ్విక దళ హోదాకు నియమించగా, అది మొఘల్ చక్రవర్తి ఆజ్ఞమేరకు తన రాజ్యం వెలుపల కర్తవ్య నిర్వహణ చేయడంతో సమానంగా ఉండేది. అతను ఒక చోటు నుంచి మరొకచోటుకు బదిలీ చేసే అధికారానికి జవాబుదారీ వహించేవాడు. రాజపుత్ర పాలకులను దుర్గాధిపతులుగా దూర ప్రాంతపు సైనిక అధికారులుగా లేదా ఒక సేనాని క్రింద ఉపసేనాని పదవులకు నియమిస్తుండేవారు. ప్రత్యేకంగా పేర్కొనవలెనంటే మాన్సింగ్ ఒరిస్సాను జయించి బెంగాలును లోబర్చుకొనగలిగేవాడు. జయసింగ్ శివాజీకి లేక బీజాపూర్‌కు వ్యతిరేకంగా మొఘల్

సైన్యానికి నాయకత్వం వహించేవాడు. జస్వంత్‌సింగ్ గుజరాతు గవర్నర్ కాగలిగాడు. అయితే వీరు సాధారణ సూత్రం కాక మినహాయింపులవంటివారు. వారితో పోల్చినపుడు రాజపుత్ర రాజులలో హెచ్చు మంది మధ్య స్థాయి ఉద్యోగాలనే నిర్వహించారు.

అమర్‌సింగ్ (పాలన) కాలంలో మొఘల్ సార్వభౌమాధికారాన్ని ఒకసారి అంగీకరించిన తర్వాత ఉదయపూర్‌కూడా మినహాయింపు లేకుండా పోయింది. ఆస్థానంలో హాజరునుంచి మినహాయింపు మాత్రమే మహారాణాకు లభించిన రాయితీ. మహారాణాకు మొఘల్ సైన్యంలో మన్సబ్ ఉండేది. ఉదయపూర్ రాజవంశంలో కనిష్ఠులైన రాకుమారులు తక్కిన (రసపుత్ర) రాకుమారుల వలె మొఘల్‌ల కొలువును అపేక్షించి, వాంఛాసిద్ధిని పొందుతుండేవారు. ఉదయపూర్ నుంచి వచ్చిన సైనిక దళాలు దక్కన్‌లో పనిచేస్తుండేవి. రాజపుత్ర రాజ్యాలను వతన్ (పన్ను చెల్లించని) జాగీర్లు అని పిలుస్తుండేవారు. మొఘల్ మన్సబ్‌దారీ వ్యవస్థ రాజపుత్ర అధీనంలోని స్వయంపాలనాధికారాలను హరించి, వారిలో విశ్వాస వైరుధ్యాలను సృష్టించి వారి భూభాగాలను క్రమేపి లోబరుచుకుంటూ ఉండేది. శివాజీకి కూడా ఆయన కుమారుడు శంభాజీ మొఘల్‌ల పక్షంలోనికి జారుకుని వారికింద మన్సబ్‌ను పొందినప్పుడు ఇదే విధమైన విషమ పరిస్థితి ఎదురైనది.

మొఘల్‌ల ఆధ్వర్యంలోని పాలకవర్గం చాలావరకు మధ్య ఆసియా, ఇరాన్‌లనుంచి వచ్చిన నిర్మాణ భాగాలతో కూడినది. దానిలో భారతీయ విభాగం అతి చిన్నది. భారతీయ ముస్లింలు కూడా మనసబ్‌దారులలో అతి స్వల్ప శాతంగా ఉండేవారు. మొఘల్ పాలకులు వారి తురుష్కవారసత్వాన్ని జ్ఞాపకముంచుకున్నారు. షాజహాన్ ఏలుబడిలో వారు మధ్య ఆసియాలోకి చొచ్చుకొని పోవడానికి కూడా యత్నించారు. కానీ లక్ష్యసిద్ధి కలుగలేదు. వాయవ్య ప్రాంతంలోను తూర్పు ప్రాంతం (అస్సాం) లోను, దక్కన్‌లోనూ విరుద్ధ ఫలితాలు సంభవించినందున ఔరంగజేబ్ తన బలాన్ని నిలబెట్టుకొనేందుకు ఉదార వర్గాలకు భిన్నమైన మత మౌఢ్యమైన, సంప్రదాయశక్తులపై ఆధారపడసాగాడు. తత్ఫలితంగా పాలకుల, పాలితుల మధ్య అంతరాన్ని సృష్టించే అనేక చర్యలు తీసుకోవడం జరిగింది. ఈ అన్యాధీకరణను సూచిస్తూ పర్షియన్ భాషలో మొఘల్ వార్తా లేఖలు, సమకాలీన గాథలు, చరిత్రలు భారతీయ భాషలో లభ్యమయ్యే విస్తార చరిత్ర సాధనాలు ఈ అన్యధీకరణను సూచిస్తున్నాయి. పఠానులు, సిక్కులు, జాట్లు, బుందేలాలు, మరాఠాలు (మొఘల్) పాలనారీతిని వ్యతిరేకించారు. రాజపుత్రులతో సంఘర్షణకు కొద్ది సంవత్సరాల వ్యవధి మాత్రమే ఉన్నది. ప్రజల భావాలను పరిగణింపని ఈ స్థితి ఔరంగజేబ్ రాజనీతిజ్ఞుడుగా పొందిన అపజయాన్ని

విశదపరుస్తుంది.

శివాజీ పట్టాభిషిక్తుడయి సార్వభౌమాధికారంగల పరిపాలకుడిగా స్వయంగా రూపొందడం దేశంలోని అన్ని ప్రాంతాలకూ చెందిన భారతీయ ప్రజల అభ్యున్నతికి చిహ్నంగా ఉంటుంది. అది మరాఠా చారిత్రిక ఆధారాలలో ఉపయోగించిన పదాన్ని అనుసరించి హిందూ స్వరాజ్యాన్ని (భారతీయ పాలనను) సాధించడానికి చేసిన యత్నము.

శివాజీ జయించిన భూభాగాలు ఎంత విస్తృతమైనవి అయినప్పటికీ, 1674 వరకు, ఆయన సాంకేతికంగా మొఘల్ చక్రవర్తికి అధీనుడు. మొఘల్‌ల, బీజాపూర్ రాజుల కొలువులో ఉన్న గర్విష్ఠులైన మరాఠాల నాయకులు, అప్పటికీ శివాజీని బీజాపూర్‌కు చెందిన అదిల్షా కంటే తక్కువ హోదాకలిగిన వాడుగా భావించారు. కాగా శివాజీ సాధించిన స్థితిని చట్టబద్ధంచేసి రాజరికవ్యవస్థను స్థాపించడమే జరగ వలసినది. అన్ని వర్గాల ప్రజలలోనూ శివాజీని రాజుగా కిరీటం ధరించేటట్లుగా చేయాలనే బహుళంగా వ్యాపించి ఉన్నట్లు కానవచ్చింది. వారణాసికి చెందిన గొప్ప బ్రాహ్మణ పండితుడు గాగాభట్టా అనే నామంతరం గల విశ్వేశ్వర్ మాత్రమే ప్రజలకు ప్రీతి పాత్రమైన ఆ భావాన్ని వ్యక్తం చేయగలిగాడు. ఆ కిరీటధారణ ఉత్సవాన్ని తిలగించిన మరాఠా చరిత్రకారుడు సభాసద్ మాటల్లో "అప్పుడు గాగాభట్టా అనే ఒక వ్యక్తి రాజుకీర్తి గురించి విన్నందున అతనితో ముఖాముఖీ సంభాషణ ఆపేక్షించి, వారణాసి నుంచి వచ్చాడు. ముస్లిమ్ రాజులు సింహాసనా రూఢులై రాజ ఛత్రాలను తమ (తలల) పై పట్టి ఉంచేటట్లు చేసి సార్వభౌమాధికారాన్ని చలాయిస్తూండగా నాలుగు రాజ్యాలలో ప్రాబల్యం కలిగి 75,000 అశ్విక దళాన్ని సృష్టించి దుర్గాలను స్వాధీన పరచుకున్న శివాజీ రాజ సింహాసనం లేక సార్వభౌమాధికార హక్కులను చలాయించకుండా ఉండటం అతన్ని బాధించింది. అతను మరాఠా రాజు ఛత్రపతి అయిన రాజుగా ఉండాలని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. ప్రధాన వ్యక్తులందరినీ సంప్రదించగా అందరూ ఆ భావంతో ఏకీభవించారు. గాగాభట్టా శివాజీతో నీవు సింహాసనాధిరోహణ చేయాలి," అని అన్నాడు.

ఒక స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించటమే శివాజీ లక్ష్యము. మొఘల్‌లతో 1670 లో ప్రారంభమైన ఎడతెరిపి లేకుండా సాగిన యుద్ధం ఆయన కృతనిశ్చయాన్ని తెలియచేస్తుంది. స్వీయపట్టాభిషేకం జరిగిన తరువాత, శివాజీ తన స్వాతంత్ర్యానికి చిహ్నాలుగా నాణేలు ముద్రించి కొత్త శకాన్ని ఆరంభించాడు. తరువాత శివాజీ ఆయుధ శిక్షణ ఇచ్చి ఆశీర్వదించిన బుందేలా నాయకుడు ఛత్రపాల్ బుందేల్‌ఖండ్

(మధ్య భారత్)లో స్వీయ రాజ్యాన్ని స్థాపించి శివాజీ ఉదాహరణను శక్తివంచనలేకుండా అనుకరిస్తూ క్రీస్తు శకం 1687 లో రాజుగా కిరీటధారణ చేశాడు.

తరువాత మే 19 న శివాజీ ప్రతాప్‌గఢ్‌ను సందర్శించి భవానీ దేవతకు తన విధేయతను ప్రకటించాడు. ఆ దేవతకు మూడు మణుగుల బరువు 56 వేల రూపాయల విలువగల ఒక బంగారు గొడుగును కానుకగా సమర్పించాడు.

శివాజీ క్షత్రియుడు అనగా ఆయన యుద్ధవీరుల కులానికి చెందిన వాడు. కానీ రాజకీయమైన అశాంతి పరిస్థితులు వలస క్షత్రియుల పాటించే కొన్ని కర్మ కాండలను నిర్వర్తించలేకపోయాడు. అందువలన ముందుగా జంధ్యధారణ సంస్కారాన్ని చేయవలసి వచ్చింది. తరువాత తులాభారం తూచి అప్పుడు విష్ణువు స్వర్ణ ప్రతిమను దానంగా (తులా పురషదానం) ఇచ్చారు. ఆ తరువాత భార్యలతో (రెండవసారి) వివాహమహోత్సవాన్ని చేయించారు. ఈ ఆచార కాండలు ఒక దాని తర్వాత మరొకటి మే 29, 30, తేదీలలో కొనసాగాయి.

రాయగఢ్‌లో ఆనాటి బ్రిటిషు ప్రతినిధి, హెన్రీ ఆక్సెండెన్ తులాభార ఉత్సవాన్ని గురించి ఇలా వ్రాసాడు: "ఈ రోజు రాజాను హిందూ సంప్రదాయ ప్రకారం సుమారు 60,000 పగోడాల విలువగల బంగారం పైసాలలో తూచారు. ఆ సొమ్ముని మరొక లక్ష పగోడాలతో కలిపి ఆయన పట్టాభిషేకం అనంతరం చుట్టుపట్ల ఉన్న దేశాలనుంచి పెద్ద సంఖ్యలో గుమికూడిన బ్రాహ్మణులకు పంచిబెట్టబోతున్నారు. ఖచ్చితమైన వేదోక్తమైన కర్మకాండను అనుసరించి పట్టాభిషేక ఉత్సవము కొనసాగింది." శివాజీ 1674 జూన్ 6 నాటి ఉదయం సింహాసనాన్ని అధిష్ఠించాడు. అది నిజంగా చారిత్రాత్మకమైన రోజు. సభాసద్ ఇచ్చిన నవివరమైన వర్ణన ప్రకారం: "అతి జాగరూకతతో ఎన్నుకొన్న మిక్కిలి విలువగల నవరత్నాలను కోశాగారము నుంచి సంపాదించి తాపడం చేసిన 32 మణుగుల బరువుగల స్వర్ణ సింహాసనాన్ని తయారు చేశారు. పెద్ద నదులు ఏడింటి నుంచి ఇతర గణనీయమైన నదులనుంచి సముద్రాలనుంచి ప్రసిద్ధికెక్కిన పవిత్ర స్థలాలనుంచి కూడా జలాలను తెచ్చారు. బంగారు కూజాలను తయారు చేశారు. ఆ ఎనిమిది కూజాల నీటితో అష్ట ప్రధానులను (మంత్రుల్ని) అభిషేకించాలని నిశ్చయమైనది. తరువాత శుభప్రదమైన రోజున...రాజు సింహాసనాన్ని అధిరోహించాడు. రత్నాలు తాపిన రత్నాఖచితమైన ఎనిమిది స్తంభాలు అలంకారంగా కలిగినది ఆ సింహాసనము. ఈ సందర్భంలో శాస్త్రాలు నిర్ణయించిన అన్ని ఆచార క్రియలను సంస్కారాలను పాటించారు. ఈ పట్టాభిషేకోత్సవానికి అయిన ఖర్చు ఒక కోటీ నలబై రెండువేల హన్లు వరకు ఉంటుంది. అష్ట ప్రధానులు ఒక్కొక్కరికి

ఒక లక్ష హొన్నులుకాక ఒక ఏనుగు, గుఱ్ఱం వస్త్రాలు, నగదు లభించాయి. ఆవిధంగా రాజా సింహాసనారూఢుడయాడు. ఇప్పటి వరకు ఈ యుగంలో మ్లేచ్ఛరాజులు భూమిని పాలించారు. (మ్లేచ్ఛ అనే పదం యూరోపియన్లతో సహా విదేశీయులందరికీ వర్తిస్తుంది. ఏ మత వర్గాన్ని అది చూచించదు. దానిని 'భారతీయేతర' అని భాషాంతరీకరించవచ్చు.) ఒక మరాఠా రాజు ఇప్పుడు తొలిసారిగా 'ఛత్రపతి' కాగలిగాడు. ఇది అసాధారణ ప్రాధాన్యం గల సంఘటన."

హెన్రీ ఆక్సిండెన్ చేసిన వర్ణన ఇంతే చిత్రావహంగా ఉంటుంది. అతను ఇలా అన్నాడు: "జూన్ 6 వ తేదీ (1674) సుమారు ఏడు లేక ఎనిమిది గంటల కాలం. ఆస్థానానికి వెళ్ళగా ఒక దేదీవ్యమానమైన సింహాసనంపై ఆసీనుడై విలువైన వస్త్రాలు ధరించిన ప్రభువర్గీయులతో పరివేష్టితుడైన రాజాను చూశాను. ఆయన కుమారుడు శంభాజీ రాజా, పీష్వా మోరో పండిట్ (మోరోపంత్), ఒక సుప్రసిద్ధ బ్రాహ్మణుడు సింహాసనానికి దిగువగా ఉన్నతాసనాలను అధిష్ఠించి ఉండగా తక్కినవారితో పాటు సైన్యాధికారులు నిలబడివున్నారు. నేను దూరమునుంచి నా వందనాలను అర్పించగా నారాయణ్ షెనాయ్ అతనికి బహూకరించదలచిన వజ్రపుటుంగరాన్ని చేతితో పట్టుకొన్నాడు. అతను మా ఇరువురినీ తక్షణమే గమనించి దగ్గరకు, సింహాసనం అడుగుభాగం వరకు కూడా రావలసిందని ఆజ్ఞాపించాడు. అక్కడ విలువైన వస్త్రాలను పొందిన తరువాత, మమ్మల్ని కోరినట్లుగా వెనుకకు తిరిగి వచ్చాము. కానీ అంత త్వరగా కాదు, మేము సింహాసనానికి ఇరువైపులా (మోరే పద్ధతి (ప్రకారం) బంగారపు పూత పూసిన బల్లెముల తలలపై వ్రేలాడుతున్న అనేక ప్రభుత్వ, సార్వభౌమత్వ చిహ్నాలను, దక్షిణ భాగాన, చాలా పొడవైన దంతాలు గల బంగారపు తలలున్న రెండు పెద్ద చేపలను, వామభాగాన అనేక గుఱ్ఱపు తోకలను బాగుగా అలంకరించిన బల్లెం అగ్రబాగాన అటునిటు జరగకుండా సమస్థితిలో ఉన్న న్యాయచిహ్నం ఒక బంగారు త్రాసును గమనించాము. రాజభవన ద్వారానికి మేము తిరిగి వచ్చే సరికి ద్వారం రెండు వైపులా రెండు చిన్న ఏనుగులు బంగారు కళ్ళేలు విలువైన ఉపకరణాలు గల రెండు అందమైన గుఱ్ఱాలు నిలిచి వున్నాయి. వాటిని రాజభవనం నిలచిన కొండపైకి కష్టసాధ్యం ప్రమాదకరం అయిన మార్గం ద్వారా తెచ్చిన విధానాన్ని మేము శ్లాఘించక తప్పిందికాదు."

ఈ కాలంలోనే, 1674 జూన్ 17 న, శివాజీ తల్లి జిజాబాయి, మరణించింది. ఆయన జీవిత పర్యంత సమరంలో అమెయే విఖ్యాతుడైన తన కుమారునికి ఉత్తేజాన్ని కలిగించిన ఉత్తమ ఆధారము. తల్లీకుమారులు (ఆవిధంగా) పరస్పరం ప్రేమ, శ్రద్ధ

కలిగిఉండే ఉదారహణలు చరిత్రలో అరుదుగా వుంటాయి.

మొఘల్‌లు శివాజీ పట్టాభిషేకాన్ని నిర్లక్ష్యం చేశారు. ఆయన 1674 సెప్టెంబరు 24 న ప్రజల్లో ఒక గణనీయమైన భాగాన్ని సంతృప్తి పరచడానికి తాంత్రిక విధుల ప్రకారం ఆ పట్టాభిషేక ఉత్సవాన్ని తిరిగి నిర్వహించాడు. ఈ సంఘటన కూడా నిర్లక్ష్యానికి గురి అయింది. కానీ మొఘల్‌లతో వారి ఆశ్రితులైన జంజీరాకు చెందిన సిద్ధీలతో శివాజీ యుద్ధం కొనసాగింది. మరాఠాలు బేరార్, ఖాందేష్‌లలో విస్తృతంగా దాడులను బుర్హాన్‌పూర్ గోడలవరకు చేశారు. బ్రిటిషువారు ధరంగావ్‌లోని తమ వ్యాపార కేంద్రం 1675 జనవరి 20 న నష్టపడినట్లు ఫిర్యాదుచేశారు. ఈ దాడులలో శివాజీకి వ్యతిరేకంగా మొఘల్‌లు చేయగలిగినది చాలా స్వల్పం. శివాజీ జంజీరాకు చెందిన సిద్ధీలను స్థిరమైన ఒత్తిడికి గురిచేశాడు. సిద్ధీలకు బ్రిటిష్‌వారు కలిగిస్తున్న సౌకర్యాలను ఆపివేయవలసిందిగా ఆయన చేసిన హెచ్చరిక 1674 ఆగస్టు 26 నాటి వారి ఉత్తరంలో బహిర్గత మవుతుంది: “శివాజీనుంచి అధ్యక్షునికి మన రేవులో సిద్ధీ నౌకాదళాలను ఇక మీదట లంగరు వేయటానికి అనుమతించినట్లయితే అతనికి మనతో శాంతి సంబంధాలు ఉన్నప్పటికీ మన నౌకాశ్రయంలోని అతని శత్రువులపై దాడిచేసి మనపై యుద్ధాన్ని ప్రకటించగలనని సలహాను పంపాడు. అతనికంటే సిద్ధీలపట్ల ఎక్కువ అనుకూలాన్ని మనం ప్రదర్శిస్తున్నట్లు అతను ఊహిస్తున్నందున దానిని తీవ్రంగా పరిగణించాము. ఆపైన కార్యదర్శి నౌకాదళాధిపతి అయిన దామసే నికాల్స్‌ను వెంటనే సిద్ధీవద్దకు పంపి శివాజీ అధ్యక్షునికి పంపిన సందేశాన్ని అతనికి తెలియజేసి అతని నౌకాదళం ఈ రేవు నుంచి వెంటనే వెళ్ళి పోవలసిందిగా అతనికి నిర్భయంగా చెప్పాము.”

## ప్రాదేశిక విస్తృతి

బీజాపూర్‌ను నష్టపరచి ఇంకా ఎక్కువ భూభాగాలను సంపాదించే లక్ష్యం మీద శివాజీ తన హృదయాన్ని లగ్నం చేశాడు. బీజాపూర్ వ్యవహారాలు కొల్హాపూర్ మెట్ట ప్రాంతాలను కార్వార్‌ను స్వాధీన పరచుకొని బీజాపూర్ పాలనను ఆ ప్రాంతం నుంచి తొలగించడం ద్వారా దక్షిణ కొంకణ్‌లోని తన అధీన ప్రాంతాలకు సంపూర్ణత్వం కలిగించునట్లు ఆయనను ప్రేరేపించాయి. ఇందుకుగాను గోవా సమీపంలోని బీజాపూర్ గవర్నర్ అధికార కేంద్రమైన ఫోండా స్వాధీనం ఆవశ్యకమయింది.

మొఘల్‌లు బీజాపూర్‌కు తోడ్పడటానికి వేగిర పడకుండా ఉండరని శివాజీకి నమ్మకం కలుగలేదు. మొఘల్‌లతో శాంతియుతంగా ఉండదలచామని ఆయన మొఘల్

రాజప్రతినిధి బహదూర్ ఖాన్‌కు హామీ ఇచ్చాడు. శివాజీ మాటలకు బహదూర్‌ఖాన్ మోసపోయిన రీతిని వినోదకరమైన కథగా భీమ్‌సేన్ సక్సేనా మాటలలో ఇలా అన్నాడు: "శివాజీ తలపెట్టిన మోసం బహదూర్‌ఖాన్ అవగాహనకు అతీతమైనది. అతను శివాజీ విజ్ఞప్తిని (తన కుమారుని మొఘల్ శిబిరానికి పంపడానికి వీలుగా క్షమాభిక్షను కోరుతూ) పంపిస్తూ చక్రవర్తికి స్వయంగా లేఖ వ్రాసాడు. చక్రవర్తి రావల్పిండి సమీపంలోని హసన్ అబ్దుల్ వద్ద బసచేస్తున్నాడు. అతను బహదూర్ ఖాన్‌కు, జిత్తులమారి వ్యక్తి (శివాజీ) మాటలకు మోసపోవద్దు. మాలిక్ బర్ఖుర్‌దార్‌కు నా స్వభావంతో పరిచయం ఉంది. హిందువుల స్వభావంతో పరిచయంగా నీ అధికారులను మాలిక్ బర్ఖుర్‌దార్‌ను కూడా శివాజీ వద్దకు పంపు. దౌత్యరీతిలో అతనితో సంప్రదింపులు సాగించు. శాంతిని కోరడంలో శివాజీ ఉద్దేశాలను తెలుసుకో. అతని సాధారణ ప్రవర్తనను కనిపెట్టి ఈ విషయాలను కచ్చితంగా తేల్చుకొని అప్పుడు నాకు వ్రాయి , అని వ్రాశాడు."

"బహదూర్ ఖాన్ శివాజీని కలుసుకోవడానికి తన కార్యదర్శి మహమ్మద్ సయీద్, గంగారామ్ గుజరాతీని మాలిక్ బర్ఖుర్‌దార్‌ను పంపాడు. ఈ సమయానికే శివాజీ తన రహస్య పన్నాగడలను అమలుచేశాడు. ఆయన బీజాపూర్ నుంచి పన్హాలా గఢ్‌ను (ఫోండా అయి ఉండాలి) జయించాడు. బహదూర్ ఖాన్ పంపిన అధికారులు శివాజీని పురందర్ దుర్గంలో కలిశారు. శివాజీ వారు మకాం చేయడానికి మేలైన ఏర్పాట్లు చేసి, సాదరంగా ఆహ్వానించాడు. ఇది మొదటి రోజు చర్య. మరుసటి రోజు శివాజీ వారితో నిష్కర్షగా, 'నేను మీతో శాంతి చేసుకోవడానికి తగిన సాహసకృత్యాలు మీరు ఏమి చేశారు?' ఈ స్థలంనుంచి మీరు త్వరగా వెళ్ళిపొండి లేదా మీరు అవమానానికి గురికాగలరు," అన్నాడు.

"ఆ అధికారులు నిరాశ చెంది తిరిగి వచ్చేశారు. వారు బహదూర్ ఖాన్‌కు ఆసంఘటనలను వివరించారు. తను చక్రవర్తికి నివేదిక పంపాడు. ఇంతలో ఔరంగజేబ్ వారు బహదూర్‌ఖాన్ సిఫార్సుపై శంభాజీకి మన్సబ్‌ను ప్రసాదించాడు. 'మసీరే అలంగీరి' లో 1675 జూలై 7 నాటి నమోదైన అంశం ఇలా ఉంది: "జాఫర్ జంగ్ (బహదూర్ ఖాన్ కొత్త బిరుదు) కోరికపై శివాజీ కుమారుడు శంభాజీకి 6,000 (అశ్వక) దళ హోదాను, 80,00,000 దామ్లను, బహుమానంగా నగారాలను, తకాన్నీ, పట్టు దుస్తులను, ఆజ్ఞాపత్రాన్ని వేత్రహస్తుని ద్వారా పంపటమయింది."[1]

---

[1] 'మసిరే అలంగీరి,' జె. యన్. సర్కార్ అనువాదితం, పుట 88.

మొఘల్‌లను సంప్రదింపుల్లో నిమగ్నులయేటట్లు చేసి, శివాజీ సైన్యం కొల్హాపూర్ ప్రాంతంలో విస్తరించింది. ఆయన స్వయంగా గోవా సమీపంలోని ఫోండా ను జయించడానికి పురోగమించాడు. ఆయన ఫోండాకు వెళ్ళే మార్గంలో ఉండగా బ్రిటిషు వ్యాపార కేంద్రానికి చెందిన జాన్ చైల్డ్ రాజపూర్ వద్ద 1675 మార్చి 22 న ఆయన్ని కలిశాడు. శివాజీతో అతని ముఖాముఖీ సంభాషణను గురించి అతను ఆసక్తిదాయకమైన వర్ణన ఇచ్చాడు.[1]

శివాజీ 1675 ఏప్రిల్ మొదట్లో ఫోండా చేరాడు. ఏప్రిల్ 1 నాటి ఇంగ్లీషు రికార్డుల ప్రకారం.[2] "అతనితో 15,000 అశ్వికులు 14,000 కాల్బలం గడ్డపారలు, గునపాలు, చిన్నగొడ్డళ్ళు మొదలైన వాటితో వెయ్యిమంది పనివాళ్ళతో కూడిన సైన్యం వచ్చింది."

"అతను కొల్హాపూర్‌ను స్వాధీన పరచుకొన్నాడు. పైపెచ్చు రైబాగ్‌ను త్వరలో వశపరచుకోగలడని వార్త అందింది."

ఫోండా ముట్టడి ఆరంభమయింది. ఫోండా గవర్నర్ మహమ్మద్ ఖాన్ పట్టువిడవకుండా పోరాడాడు. బీజాపూర్ సేనానులు బహలూ ఖాన్ రుస్తుంజమాన్‌ల సహాయాన్ని అతను అర్థించాడు. కానీ శివాజీ వారు కొంకణ్‌లోకి చొచ్చుకొని రాకుండా అడ్డగించాడు. ఇంగ్లీషు రికార్డులు చెప్పినట్లుగా: 'రాజ మార్గాలను ఉద్దేశపూర్వకంగా నరికి పడవేసిన చెట్లతో నింపి, వాటికి ఇరువైపులా (కాపలా) మనుష్యులను నియమించాడు.' ఫోండా పై ఒత్తిడి తేవడానికి అతను వెన్గుర్లాకు 40 నౌకలను కూడా పంపాడు. దుర్గరక్షణదళానికి తోడ్పడటానికి పోర్చుగీసు వారు ప్రయత్నించినప్పటికీ అది నెరవేరలేదు. దుర్గంలో ప్రేలుడు మందు పెట్టి బురుజులను ధ్వంసం చేశారు. ఈ కార్యకలాపాల్లో శివాజీ ఉద్యోగి ఇబ్రహీంఖాన్ నిర్వహించిన వీరోచితమైన పాత్రను గురించి శివాజీ జీవిత చరిత్ర కారుడు సభాసద్ ప్రస్తావించాడు.

ఫోండా 1675 ఏప్రిల్ 17 న మరాఠాల స్వాధీనమయింది. ఆ దుర్గపు గవర్నర్ మహమ్మద్ ఖాన్ బందీగా పట్టుబడ్డాడు.

మరాఠాలు కార్వార్ జిల్లాలోకి బలోపేతంగా ముందంజ వేశారు. మే 21 నాటికి మరాఠాలు అంకోలా, శివేశ్వర్లను వశపరచుకొన్నారు. కార్వార్ కూడా తర్వాత ఆపై నెల లేక రెండు నెలల్లో వారి హస్తగతమయింది. శివాజీ భూభాగం గంగానది అంకోలాకు దక్షిణంగా సముద్ర సంగమమయ్యేచోటును తాకింది. అప్పుడు సము

---

[1] ఇంగ్లీషు రికార్డులు, శివాజీపై, రెండవ సంపుటి, పుట 44.

[2] ఇంగ్లీషు రికార్డులు, శివాజీపై మొదటి సంపుటి, పుట 41.

ప్రతీరంలో అనుసంధించి ఉన్న మార్గాలతో బీజాపూర్ సంబంధం తెగిపోయింది

జూలై నాటికి మరాఠాలు కొల్హాపూర్‌ను ఆక్రమించారు మరాఠాల కొల్హాపూర్ ఆక్రమణను గురించి బ్రిటిషువారి నివేదిక చదవటానికి ఆసక్తి జనకంగా వుంది బ్రిటిషువారు 1675 ఆగస్టు 7 న (కొల్హాపూర్ సమీపంలోని) రైబాగ్ నుంచి ఇలా వ్రాశాడు: "30 వ తేదీన (జూలై 1675) కొల్హాపూర్‌లోని శివాజీ పక్షం రాజుకొరకు గవర్నర్‌ను పట్టుకొన్నట్లుగా వేకువ జామున వార్త అందింది. పట్టణవాసులు అనేకులు దానిని విడిచి పోసాగారు. కానీ శివాజీ సైనికులు సవ్యంగా వ్యవహరిస్తామనే వాగ్దానంతో అందరూ నిలచిపోయేటట్లు చేశారు. కాగా పట్టణ ప్రజలు ప్రశాంతంగా కొంత భద్రతతో ఉండగలిగారు. శివాజీ ఆ పట్టణాన్ని రక్షించవలసి వుండగా దానిలోని రెండు వేలమంది మనుషులను మూర్ జాతి (వాయవ్య ఆఫ్రికాలోని బెర్బరా -అరబ్ మిశ్రమజాతి) గవర్నర్‌ను పన్హాలా కోటకు కొనిపోయి అక్కడ అతన్ని ఖైదీగా ఉంచారు."

ఆ తీవ్రమైన భూభాగ నష్టం బీజాపూర్ వ్యవహారాలను గందరగోళంలో పడవేసింది. దక్కనీయులు అబిసీనియన్లు ఒక పక్షం పఠానులు మరో పక్షం కాగా వారి విభేదాలు రాజ్యాన్ని ఛిన్నాభిన్నం చేశాయి. పఠాన్లకు బహలూల్ ఖాన్ నాయకుడుగా, ప్రతిపక్షానికి రాజ సంరక్షకుడుగా ప్రధానమంత్రి అయిన ఖవాస్ ఖాన్ ఆధిపత్యం వహించాడు. బహలూల్ ఖాన్ శివాజీ నుంచి తగిన బహుమతులను, అతని జాగీరులపై దాడులు చేయకుండా ఉండే వాగ్దానాన్ని పొందాడని అనేకులు విశ్వసించారు. దానికి ప్రతిఫలంగా శివాజీ దండయాత్ర కాలంలో అతను ఉద్దేశపూర్వకంగానే కర్తవ్య విముఖుడయాడు.

శివాజీకి బీజాపూర్ కోల్పోయిన భూభాగాలను తిరిగి వశపరచుకోవడానికి ఖవాస్‌ఖాన్ కృతనిశ్చయుడయినట్లు సుస్పష్టము. పఠాన్ పక్ష ఔద్ధత్యాన్ని తగ్గించడానికి కూడా అతను నిశ్చయించాడు. ఆ విధంగా అతను మొఘల్‌లకు సన్నిహితుడయాడు.

మొఘల్ రాజప్రతినిధి బహదూర్‌ఖాన్ బీజాపూర్ ప్రధానమంత్రి ఖవాస్ ఖాన్ 1675, అక్టోబర్‌లో పండర్‌పూర్ వద్ద సమావేశ మయారు. బీజాపూర్ (అప్పుడు) చేసిన ప్రతిపాదనలు: బాలరాజు సికందర్ అదిల్షా సోదరితో ఔరంగజేబ్ కుమారునికి వివాహం జరగాలి. మొఘల్‌లు బీజాపూర్ సంయుక్తంగా శివాజీ ఆధిపత్యాన్ని నాశనం చేయడానికి కృషిచేయాలి. బీజాపూర్ ఏటేటా చెల్లించవలసిన కప్పం ఔరంగజేబ్ వదలివేయాలి, సికందర్‌కు పాదుషా అనే బిరుదు లభించాలి.

ఈ షరతులలో అధిక భాగాన్ని (మొఘల్‌లు) అంగీకరించారు. బహలూల్ ఖాన్ నాయకత్వంలోని తన పఠాన్ విరోధులను అధికారంలో ప్రతిష్ఠించడానికి యత్నం పగలరనే భయంతో, బహలూల్ ఖాన్ 1676 జనవరి 18 న ఖవాస్ ఖాన్ అంత మొందించాడు.

ఈ చర్య బీజాపూర్‌లో తీవ్ర అంతర్‌యుద్ధానికి సంకేతమయింది. ఆదోని (తుంగభద్రానదికి) దక్షిణం సమీపంలో 1676 మార్చి 21 న ఒక పెద్ద యుద్ధం సంభవించింది. దక్కనీలు చెల్లాచెదరై గొల్కొండకు పారిపోయారు. షేక్ మిన్హాజ్ గుల్బర్గాను తన ప్రధానకార్యస్థానంగా చేసుకొన్నాడు.

ఖవాస్ ఖాన్ హత్య మొఘల్ సేనాని బహదూర్ ఖాన్‌కు ఒక గొప్ప విపత్తుగా తోచింది. బహుమతిగా దక్కవలసిన బీజాపూర్ తన చేతులు దాటిపోతున్నట్లు కనిపించింది. ఔరంగజెబ్ బీజాపూర్ పై దండయాత్ర చేయమని బహదూర్ ఖాన్‌ను ఆజ్ఞాపించాడు. వాయవ్య ప్రాంతంలో ఆటవిక తెగల అశాంతిని చక్రవర్తి ఆదిలోనే త్రుంచివేశాడు. ఆతను రావల్పిండి సమీపంలోని హసన్ అబ్దుల్‌ను 1675 డిసెంబరు 29 న వదలిపెట్టి 1676 జనవరి 31 న లాహోర్ చేరాడు. ఆతను 1676 ఏప్రిల్ 5 న ఢిల్లీకి తిరిగి వచ్చాడు. బహదూర్ ఖాన్‌కు తోడ్పడటానికి దిలేర్‌ఖాన్ 1676 జూన్‌లో ఉత్తరభారతం నుంచి వచ్చాడు.

ఈలోగా శివాజీ సతారాలో 1675 లో తీవ్ర రోగపీడితుడై దీన స్థితిలో పడ్డాడు. పుకార్లు వ్యాపించాయి. 'ఇంగ్లీషు రికార్డుల్లో' ఆతనికి విషమిచ్చినట్లు అందుకు సంబంధించిన కుట్రలో ఆయన కుమారుడు. శంభాజీ పాల్గొన్నట్లు నమోదైనది ఇది ఆధారరహితమైన పుకారు. మార్చి 1670 లో శివాజీ బీజాపూర్ రాజ్యంలోని సౌభాగ్యవంతమైన పట్టణం అత్నిపై దాడి చేసినట్లు మనకు విదితంకాగా, ఆయన వ్యాధి 1676 ప్రారంభం వరకు ఉండి ఉంటుంది.

మొఘల్‌లు బీజాపూర్‌పై దండయాత్ర చేయడానికి సంసిద్ధులవుతున్నందున, వారు బీజాపూర్ శివాజీకి వ్యతిరేకంగా కలసి వ్యవహరించే ప్రమాదం తప్పింది. ఆయన మొఘల్‌లకు వ్యతిరేకంగా బీజాపూర్ పోరాటంలో తన సహకారాన్ని అందించేందుకు సిద్ధపడ్డాడు. బ్రిటిషువారు సూరత్ నుంచి 1676 మే 1 న వ్రాస్తూ ఇలా నమోదు చేశారు.: "ఇప్పుడు శివాజీ ఈ కలుషిత వాతావరణాన్ని అవకాశంగా తీసుకొని బీజాపూర్ సేనాని బహలూల్ ఖాన్ పక్షం వహించాడు."

బహదూర్‌ఖాన్ 1676 మే 31 న భీమానదిని దాటాడు.

బీజాపూర్ అవలంబించిన ఆత్మరక్షణ చర్యలు మొఘల్‌లకు అదురు పుట్టిం

చాయి. ఇండీ వద్ద 1676 జూన్ 13 న జరిగిన ఉగ్ర సంఘర్షణలో మొఘల్‌లకు ఘోర పరాజయం కొద్దిలో తప్పింది. కలవరపడిన బహదూర్ ఖాన్ భీమానది అవలి ఒడ్డుకు తిరిగి పోయినందున కోటను ముట్టడించాడు. ఇక్కడ కూడా అతను ముట్టడిని ఉపసంహరించుకోవలసి వచ్చింది. బీజాపూర్‌కు గోల్కొండ నుంచి సహాయం లభించింది.

**ఒక అపవిత్రమైన కూటమి**

బహదూర్‌ఖాన్ ఇప్పుడు సంకటస్థితిలో పడ్డాడు. భీమానదికి ఉత్తరంగా ఉన్న సల్‌దుర్గ్, అక్కల్ కోట్, గుల్బర్గా వంటి బీజాపూర్ ఆధీన ప్రాంతాలను ఆక్రమించడానికి అతను యోచన చేశాడు. మిత్రుల కోసం అన్వేషిస్తూ త్వరలోనే శివాజీతో ఒప్పందం కుదుర్చుకొన్నాడు.

అది నిజంగా దివ్యమైన అవకాశం. బీజాపూర్‌కు వ్యతిరేకంగా మొఘల్‌లతో కలసి ఉమ్మడి దండయాత్ర చేయడానికి 1660 లో షయిస్తఖాన్ కాలం నాటి నుంచి శివాజీ పదేపదే తన సహకారాన్ని ఇవ్వజూపాడు. శివాజీ వాస్తవానికి బీజాపూర్‌కి చెందిన కొంకణ్ మెట్ట ప్రాంతాల (బారాఘాట్)తో కలిసి తన చిన్న రాజ్యాన్ని రూపొందించుకొన్నాడు. ఆ ప్రతిపాదనను షయిస్తఖాన్ ఆధ్వర్యంలో మొఘల్‌లు తిరస్కరించగా, ఆ చర్యను తర్వాత మీర్జా రాజా జయసింగ్ తీవ్రంగా విమర్శించాడు. బీజాపూర్ మెట్టప్రాంతాలను ఎరగా చూపి బీజాపూర్ పై దండయాత్రలో శివాజీ తనతో చేరేటట్లుగా జయసింగ్ ఒత్తిడి చేయగలిగాడు. కానీ శివాజీ సహకారం సమాన హోదాకలిగిన వారు ఇచ్చునట్టిది కాదు. ఆ దండయాత్ర విషయంలో శివాజీ ఎక్కువ ఉత్సాహాన్ని ప్రదర్శించలేదు. స్వప్రయత్న పూర్వకంగా 1673 లో శివాజీ కొల్హాపూర్ బాలఘాట్‌ను ఉత్తర కెనరా ప్రాంతాన్ని బీజాపూర్ నుంచి వశపరచుకొన్నాడు.

కానీ ఇప్పుడు బీజాపూర్‌కు వ్యతిరేకంగా మొఘల్‌లు ఆయన సహాయాన్ని కోరారు. ఉత్తర దిశనుంచి బీజాపూర్‌ను ఆక్రమించడానికి మొఘల్‌లు సమీపిస్తున్నట్లు శివాజీకి తెలుసు. భీమా నదికి ఉత్తరంగా ఉన్న బీజాపూర్ భూభాగాలను బహదూర్ ఖాన్ త్వరలో ఆక్రమించబోతున్నాడు. పశ్చిమాన పఠాన్లు ధార్వార్ బంకాపూర్ జిల్లాల్లో జాగీర్లు కలిగి ఉన్నారు. బీజాపూర్‌కు సామంత రాజ్యాలైన బిద్నూర్, మైసూర్ దక్షిణాన అతి సమీపంగా వున్నాయి.

ఆగ్నేయ భాగాన భీజాపూర్‌కు చెందిన తమిళ ప్రాంతాలవైపు శివాజీ తన

దృష్టిని ప్రసరించాడు. శివాజీ సవతి తమ్ముడు బీజాపూర్ రాజోద్యోగి అయిన వెంకోజీ తంజాపూర్ పూర్వ రాజ వంశాన్ని తొలగించి అక్కడ తన రాజ్యాధికారాన్ని చేపట్టాడు. ప్రస్తుతం ఉత్తర దక్షిణ ఆర్కాట్ జిల్లాలుగా ఉన్న బీజాపూర్‌కు చెందిన తమిళ ప్రాంతాలను జయించి మరాఠా అధికారాన్ని కావేరీనది తీరం వరకు విస్తరించినట్లయితే శివాజీ రాజ్యం ఒక సముద్ర తీరం నుంచి మరొక సముద్ర తీరం వరకు వ్యాపిస్తుంది. షాజీ వెంకోజీల ఆధ్వర్యంలో మరాఠాలు మైసూర్ కర్ణాటకలోని బెంగుళూర్. హాస్‌కోట్ దొడ్డబలపూర్ ఇతర స్థలాలను తమ అధీనం క్రిందికి తెచ్చుకొన్న విషయం మరువకూడదు.

దక్షిణాదిన పరిణామాలు కూడా శివాజీ ఆశలకు అనుకూలించాయి. తండ్రి షాజీ వద్ద పనిచేసిన వెంకోజీ వద్ద అధికారిగా ఉన్న రఘునాథ్ హన్మంత్ దండయాత్ర అవకాశాలను గిరించి నివేదించడానికి దక్షిణాదినుంచి వచ్చాడు. మంత్రులు అక్కన, మాదన్నల పలుకుబడి క్రింద గోల్కొండ రాజ్యం మొఘల్‌ల పట్ల ప్రతిఘటన విధానాన్ని అవలంబిస్తూ వచ్చింది. బీజాపూర్‌పై ఆ రాజ్యం కూడా ప్రాదేశిక హక్కులను పరిష్కరించుకోవలసి ఉంది. గోల్కొండ మంత్రులు శివాజీతో అవగాహనకు వచ్చారు. ఈ మైత్రిని మొఘల్ దురాక్రమణకు వ్యతిరేకంగా దక్కన్ రాజ్యాల పోరాటంగా శివాజీ మార్చివేశాడు. శివాజీ పోరాటపు రాజకీయ స్వభావానికి కుతుబ్ షాహీల గోల్కొండ రాజ్యంతో ఆయన మైత్రి చక్కని తార్కాణము.

శివాజీకి బీజాపూర్‌లో నాడు ప్రాబల్యంగల పఠాను దురాక్రమణ దారులకు మధ్య పరస్పర సద్భావం లేదు. తక్కిన దక్కనీల వలె శివాజీ బీజాపూర్‌లో పఠాన్ ప్రాబల్యాన్ని విదేశీ ఆధిపత్యంగా పరిగణించాడు. ఈ వైఖరికి అనుగుణంగా మరాఠాలను బీజాపూర్ పట్ల విశ్వాసం నుంచి విముక్తి చెందినట్లుగా భావించవలసిందని ప్రబోధించాడు.

సభాసద్ వ్రాసినది: "శివాజీ అతని (బహదూర్‌ఖాన్) వద్దకు నిరాజీపంత్‌ను ధనం, ఆభరణాలు, విలువైన రత్నాలు బహూకృతితో పంపాడు. అతనితో రహస్య స్నేహం ఏర్పడింది. అతనికి, 'కర్ణాటకను జయించేందుకు నాకు ఒక సంవత్సరం వ్యవధి అవసరం. ఆ సమయంలో నా భూభాగాలకు ఉపద్రవం తెచ్చిపెట్టకు," అని చెప్పాడు. బహదూర్ ఖాన్ ఆ విధంగానే చేయడానికి సమ్మతించాడు.

శివాజీ దక్షిణాదిన ఉండగా అనుభవజ్ఞుడైన సేనాని సోమరిగా ఉండటానికి ఎలా అంగీకరించి నిద్రావస్థలోకి జారాడో అనేది ఒక చిక్కు సమస్య. ఈ వైఖరిని బహుశా బీజాపూర్‌ని నాశనం చేయడానికి సంకల్పించిన తీవ్రయత్నాలను మితిమీ

రిన అతిశయాన్ని దురాశను జోడించి వివరించవచ్చు. తర్వాత బహదూర్ ఖాన్ శివాజీల మధ్య కలయిక విషయమై తాను అధికారంలో వున్నట్లుగా ఔరంగజేబ్ నటించాడు. దక్కన్ నుంచి బహదూర్‌ఖాన్‌ను తొలగించి అతనికి బదులుగా దిలేర్ ఖాన్‌ను నియమింపబోయే ముందుగా ఔరంగజేబ్ బహదూర్‌ఖాన్ శివాజీల కలయి కల గురించి విభ్రాంతి చెందినట్లు స్పష్టంగా సూచించాడు.

ఇంతలో గోల్కొండ ద్వారా దక్షిణాది దండయాత్రకు శివాజీ సంసిద్ధుడయాడు. తాను లేని సమయంలో తన రాజ్యపాలనకు ఆయన చక్కని ఏర్పాట్లు చేశాడు. ఉత్తర భూభాగ నిర్వహణ బాధ్యతను పీష్వా మోరోపంత్ వహించాడు. దక్షిణ ప్రాంతం అన్నాజీ దత్తో నియంత్రణ క్రింద ఉండగా, పన్హాలాతో కూడిన మధ్యప్రాంతం దత్తాజీ త్రియంబక్ వెగ్నవీస్ పాలనలో ఉంది. రాహుజీ సోమనాథ్ రాయగడ్‌లో ఉండి దైనందిన పాలనను కొనసాగిస్తూవుండేవాడు.

శివాజీ కుమారుడు శంభాజీ నాటికి యుక్తవయస్కుడైన 19 ఏండ్ల యువకుడు. అతని చిఱుత ప్రాయంలోనే తల్లి మరణించింది. అయితే అతని నాయనమ్మ శివాజీ తల్లి అయిన పావని జిజాబాయి అతన్ని ప్రేమతో పెంచింది. తండ్రి వెంట అతను ఆగ్రా వెళ్ళాడు. అతను కొంత వరకు శివాజీ దండయాత్రలలో పరిపాలనలో పాల్గొన్నాడు.

శంభాజీ సవతి తమ్ముడు రాజారాం 1670 లో జన్మించగా తరువాత తల్లి సోయరాబాయి పలుకుబడి పెరిగినందున శంభాజీలో మార్పు కలిగి ఉండవచ్చు. తండ్రి వలె పరిశీలనా దృష్టి, సూక్ష్మబుద్ధి, ధైర్యసాహసాలు గలవాడు. కానీ అతను శంభాజీ అహంభావి అయిన యువకుడుగా పెరిగాడు. మగువ మధిరల సంపర్కంవల్ల సంభవించిన అతని యవ్వనప్రాయపు అవివేక కృత్యాలు నైతిక వర్తనకు ప్రతీక అయిన శివాజీకి వేదనను కలిగించాయి. పటిష్టంగా లేని మొఘల్‌లతో శివాజీ మైత్రి దృష్ట్యా రాయగడ్‌లో శంభాజీ ఉనికి వాంఛనీయంకాదని శివాజీ భావించాడు. ఈ వ్యవహారంలో ఇమిడి ఉన్న రాజనీతి గృహసంబంధ అంశాలపై ఎన్నో సమాలోచనలు జరిగిన తరువాత ఆయన 1677 లో శంభాజీని కొంకణ్‌లోని శృంగార్ పూర్‌కు పంపటానికి నిశ్చయించాడు. శంభాజీ భార్యగా విఖ్యాతి నొందిన ఏసుబాయి పుట్టినిల్లు ఆ స్థలం. ఆ ప్రాంతపు పాలనా నిర్వహణ బాధ్యతను శంభాజీకి అప్పగించారు. శివాజీ సేనానిగా ప్రసిద్ధికెక్కిన నేతాజీ పాల్కర్ 1665 లో శివాజీని త్యజించి మొఘల్ పక్షంలో చేరినట్లు ఈ సందర్భంలో జ్ఞప్తికి తెచ్చుకో దగినది. తర్వాత అతన్ని నిర్బంధించి ఆగ్రాకు కొనిపోయారు. అక్కడ అతను ఇస్లాంమతాన్ని స్వీక

రించాడు. మహ్మాద్ కులీఖాన్ అనేపేరు పెట్టుకొన్న అతన్ని వాయవ్య సరిహద్దు ప్రాంతంలో నియోగించారు. రెండుసార్లు అతను తప్పించుకోవడానికి ప్రయత్నించి పట్టుబడ్డాడు. తరువాత 1676 లో దిలేల్‌ఖాన్ ఆధ్వర్యంలోని సైనిక దళాలతో దక్కన్‌కు తిరిగి వచ్చాడు. అతను త్వరగా ఒక నిర్ణయానికి వచ్చి శివాజీ వద్దకు తిరిగి వెళ్ళాడు. శివాజీ అతనిని సాదరంగా ఆహ్వానించుటయేగాకు, హిందూమతానికి తిరిగి మార్పించాడు. 'జేధేచరిత్ర,' ప్రకారం, "శక సంవత్సరం 1598, నవ సంవత్సరం ఆషాఢ వైద్య చతుర్థి (జూన్ 19, 1976), నేతాజీ పాల్కర్ ప్రాయశ్చిత్త కాంద ద్వారా శుద్ధి అయాడు."[1]

ఈ చర్య వలన శివాజీ కాలానుగుణమైన అవసరాలను గురించి అసాధారణ చైతన్యం గలిగి ఉన్నట్లు తెలుస్తుంది. నేతాజీ (పాల్కర్)ని మరాఠా సమాజంలో సభ్యునిగా సగౌరవంగా అంగీకరించేముందు అతను సుమారు 10 సం॥ మహమ్మదీయుడిగా ఉండవలసివచ్చింది.

శివాజీ 1676 అక్టోబరు 6 వ తేదీన దసరా పండగ రోజున రాయగడ్‌నుంచి బయలుదేరాడు. కొంకణ్‌లోని చిప్లూన్ వద్దగల పవిత్ర పరశురామాలయాన్ని అతను సందర్శించాడు. ఆ తరువాత పశ్చిమ కనుమలు దాటి పావనుడైన మౌని బావా ఉన్న గ్రామాన్ని చేరి, అక్కడ వారి ఆశీర్వచనాలను అర్థించి, పొందాడు. సుప్రసిద్ధ పవిత్ర వ్యక్తి, మేధావి అయిన సమర్ధ రామదాసు కూడా శివాజీ సందర్శన సందర్భంలో ఆయన్ని ఆశీర్వదించాడు. శివాజీకి సమర్ధరామదాసు పట్ల ఎనలేని గౌరవం వున్నందున చఫల్ వద్ద ఒక రామాలయాన్ని నిర్మించాడు. ఆ దేవాలయాన్ని సుస్థితిలో ఉంచి నిర్వహించడానికి ఆయా పండగలను జరిపించడానికి శివాజీ భారీగా దానాలు చేశాడు. అంతేకాక సతారాకు 14 కి.మీ. దూరంలోని ప్రస్తుతం పజ్జన్‌గడ్ అని పేరొందిన పార్లీ దుర్గంలో శాశ్వత నివాసం ఏర్పరచుకొనవలసిందిగా రామదాసుని ఆయన కోరాడు. ఆ స్వామి అంగీకరించి 1677 లో సజ్జన్‌గడ్‌కు చేరుకొన్నాడు.

శివాజీ బీజాపూర్ పశ్చిమ జిల్లాలోని పఠాన్లతో తలపడడానికి తన సేనాని హంబీర్‌రావు మోహితే ఆధ్వర్యంయలో ఒక సైన్యాన్ని పంపాడు. పఠాన్లు హసన్ ఖాన్ మియానాను అతని సోదరుడు కర్ణాటక ప్రాంతపు రాయచూర్ జిల్లాలోని కొప్పాల్ దుర్గ దళాధిపతి అయిన ఖాసిం ఖాన్ ఆధ్వర్యంలో మరాఠాలతో యుద్ధానికి తలప

---

1 సోర్సు బుక్ ఆఫ్ మరాఠా హిస్టరీ, పుట 29.

ద్దారు. యల్‌బెర్గా వద్ద పెద్ద యుద్ధం జరిగింది. జనవరి 1677 లో అన్నిటికీ తెగించి పోరాడిన తరువాత పఠాన్లు చెల్లా చెదురై పారిపోయారు హుసన్‌ఖాన్, అతని సోదరుడు ఖాసింఖాన్ మరాఠాలకు బందీలుగా చిక్కారు. తరువాత హంబీర్ రావ్ హైదరాబాద్‌కు వెళ్ళే దారిలో శివాజీని కలుసుకున్నాడు.

మొఘల్ సేనాని బహదూర్‌ఖాన్, భీమా నదికి ఉత్తరంగా ఉన్న బీజాపూర్ భూభాగాల ఆక్రమణకు పూనుకొని 1677 మే 14 న నల్‌దుర్గ్‌ను, 1677 జులై 7 న గుల్‌బర్గాను జయిస్తున్న సమయంలో శివాజీ తమిళనాడులో బీజాపూర్ పాలనను రూపుమాపే, తన దండయాత్రను ప్రారంభించాడు.

శివాజీ 1677 ఫిబ్రవరిలోని అనిశ్చిత కాలంలో హైదరాబాద్ చేరుకొన్నాడు గోల్కొండ రాజు అబుల్ హసన్ ఆయన మంత్రులు ఆయనకు వైభవోపేతంగా స్వాగతం పలికారు. ఆ నగరానికి పండుగ శోభ కలిగింది. సభాసద్ వ్రాసినవాని ప్రకారం నగర వీధులలో కాషాయరంగు జలాలను జల్లి పూలమాలలతో అలంకరించారు. ధ్వజం జండాలు అటూనిటూ ఊగిసలాడాయి. పౌరులు అసంఖ్యాకంగా శివాజీని దర్శించడానికి గుమికూడారు. నగరంలోని స్త్రీలు ఆయనకు హారతులిచ్చి ఆయన ముందు తలలు వంచారు. శివాజీ పై స్వర్ణ పుష్పాలు రజత పుష్పాలు విరివిగా చల్లారు.

కుతుబ్షాకు చెందిన రాజభవనం గోషామహల్‌లో శివాజీ విడిది ఏర్పాటయింది లక్ష్మినారాయణ్ షఫీక్ ఔరంగబాదీ, బిసాతుల్‌గనైమ్ ముందు లిఖించినట్లుగా 1636 మే 23 నాటి విధేయతా పత్రం (ఇంకియాద్ నామా) ప్రకారం, 1656 ఫిబ్రవరి 24 నాటి రాజు క్షమాభిక్ష ప్రకారం, వాటిని అనుసరించిన ఏప్రిల్ 1674 నాటి ఔరంగజేబ్ షరతులు ప్రకారం 1674 మే 4 నాటి 'తాహూద్' అనే ఒప్పందం ప్రకారం, గోల్కొండ పూర్తిగా మొఘల్‌ల సామంత రాజ్యంగా మారింది. ప్రధానమంత్రి అయిన మాదన్న రెండు లక్ష్యాలను ఏర్పరచుకొన్నాడు. మొఘల్ పురోగమనాన్ని ప్రతిఘటించడం బీజాపూర్‌తో గల ప్రాదేశిక వివాదాలను పరిష్కరించడం. వీలయితే తమిళనాడులో బీజాపూర్ రాజకీయ ప్రభావాన్ని తొలగించి దాని స్థానే గోల్కొండ పాలనను ప్రతిష్ఠించడం, శివాజీతో మైత్రి ఈ లక్ష్యసాధనకు ఉద్దేశించబడింది.

శివాజీకి, సాధించవలసిన స్వీయలక్ష్యాలు వున్నాయి. ఆయన మొఘల్‌లకు వ్యతిరేకంగా, గోల్కొండ అవిధేయవైఖరికి మద్దతునివ్వడానికి తక్షణమే అంగీకరించాడు. బీజాపూర్‌లో ప్రబలులైన పఠానులను నాశనం చేయడం శివాజీ లక్ష్యాలలో ఒకటి గనుక ఆయన గొల్కొండ సహకారాన్ని ఆహ్వానించాడు.

శివాజీ హైదరాబాద్‌లో సుమారు నెలపాటు ముకాం వేశాడు. అప్పటి సంధి ప్రకారం దండయాత్ర కొనసాగినంత కాలం రోజుకు మూడు వేల హస్తు ధనసహాయం ఇవ్వడానికి అబుల్ హసన్ అంగీకరించాడు. బీజాపూర్ నుంచి శివాజీ వశపరచుకొన గల భూభాగాలను. తన జాగీర్లను మినహాయించి కుతుబ్‌షాకు అప్పగించాలి.

శివాజీ 1677 మార్చి ఆఖరికి హైదరాబాదును వదలి వెళ్ళిపోయాడు ఆయన సైన్యం 16,20 వేల అశ్వికదళంతో సుమారు 30 వేల కాల్బలంతో కూడివున్నది ఆయన కర్నూలుకు వెళ్ళాడు అప్పుడు కృష్ణ తుంగభద్రా నదుల సంగమ స్థలాన్ని నివృత్తి సంగమాన్ని దర్శించాడు కృష్ణానదిపై శ్రీశైలంలోని సుప్రసిద్ధ మల్లికార్జున స్వామి (శివ) ఆలయాన్ని సందర్శించాడు ఆ స్థలంలో నిండిన దైవభక్తి వాతావరణం ఆయన్ని వివశుణ్ణి చేసింది. సర్వసంగ పరిత్యాగం చేయాలనే తలంపు కూడా ఆయనకు కలిగింది. కానీ మనస్సును గట్టిచేసుకొని దక్షిణాదికి సాగిపోయాడు. ప్రస్తుతపు కడప జిల్లాలో పయనించి కాళహస్తి తిరుపతులలోని దేవాలయాలను సందర్శించాడు. మే 1677 మొదటి వారం నాటికి శివాజీ మద్రాసుకు పడమరగా 11 కి.మీ దూరంలో ఉన్న పెద్ద పోలమ్ చేరాడు.

తమిళనాడులో ఒక ప్రాంతం గోల్కొండ రాజ్యంలో దక్షిణ భూభాగంగా ఉండింది. సముద్ర తీరంలో మద్రాసుకు దక్షిణంగా ఉన్న కొన్ని కి.మీ. ప్రాంతం మాత్రమే గోల్కొండ ఆధీనంలో వుండి కడలూరుతో సహా ఉత్తర దక్షిణ ఆర్కాటు జిల్లాలు పాండిచ్చేరి పట్టణం బీజాపూర్ పాలనలోని భూభాగాలు తంజావూరు తిరుచిరాపల్లి (పూర్వం తిరుచునాపల్లి) సంస్థానాలు బీజాపూర్‌కు లొంగి వుండెను

తమిళనాడులోని బీజాపూర్ గవర్నర్ షేర్‌ఖాన్ వాల్గొండాపురం (ప్రస్తుతం తిరుచిరాపల్లి జిల్లాలో ఒక గ్రామం)లో ప్రధాన కార్యాలయాన్ని ఏర్పరచుకొన్నాడు. అతను బీజాపూర్‌కు పఠాన్ ప్రధానమంత్రి అయిన బహలూల్‌ఖాన్ అనుయాయుడు. శక్తిమంతుడైన జింజీదుర్గ దళాధిపతి నజీర్ మహమ్మద్ బహలూల్ ఖాన్ ప్రతి ద్వంది, హత్యకు గురిఅయిన ప్రధానమంత్రి ఖవాస్ ఖాన్ సోదరుడు.

ఈ (బీజాపూర్ లోని) అంతఃకలహం తమిళనాడుకు వ్యాపించింది. షేర్‌ఖాన్ నసీర్ మహమ్మద్‌ను నాశనం చేసి జింజీని స్వాధీనపరచుకొనతలపోశాడు. నిస్సహాయస్థితిలో పడిన నసీర్ మహమ్మద్ జింజీ దుర్గాన్ని గోల్కొండకు వశపరచడానికి చేసిన ప్రతిపాదన ఆమోదయోగ్యమైనది.

ఇదే సమయంలో శివాజీ రంగప్రవేశం చేశాడు. గోల్కొండకు చెందిన సైనిక దళం శివాజీ వెంట వచ్చింది. కనుక శివాజీకి జింజీ దుర్గాన్ని అప్పగించేటట్లుగా

ఆతనికి (నసీర్‌మహమ్మద్) నచ్చచెప్పడం తేలికపని అయింది. ఆ విధంగా ఎక్కువ శ్రమలేకుండా ఈ పటిష్టదుర్గం మరాఠాల హస్తగతమయింది. పాండిచ్చేరిలోని ఫ్రెంచి అధికారి మార్టిన్ తన దినచర్య పుస్తకంలో ఇలా వ్రాశాడు.[1] "షేర్‌ఖాన్‌ను జయించే యజమాని కాకుండా నివాళించడానికి సాధనాలను మాత్రమే అన్వేషిస్తున్న నసీర్ మహమ్మద్ షరతులతో ఎట్టి మార్పు చేయకుండా శివాజీ కర్ణాటకలో ఉన్నాడని తెలిసిన వెంటనే ఆతనికి స్వాగతం పలికి సంసిద్ధుడయాడు. మా మనుష్యులలో ఒకడు (1677) మే 28 వ తేదీన తిరిగి వచ్చాడు. ఆతను ఆ స్థలం సమీపంలో మకాం వేసిన శివాజీ సైన్యంనుంచి ఒక వెయ్యి అశ్విక దళం అక్కడకు రావడాన్ని స్వయంగా గమనించాడు. ఆ దళాధిపతి నసీర్ మహమ్మద్‌తో సమాలోచన చేయడానికి అక్కడికి వచ్చాడు. 31 తేదీ, ఉదయం మేము పాండిచ్చేరికి తిరిగి వచ్చాము. ఆదే రోజున శివాజీకి నసీర్ మహమ్మద్‌కు మధ్య ఒప్పందం నిర్ణయమైనట్లు, శివాజీ సైనికులు కొందరు ఆనాటికే జింజీలో ఉన్నట్లు, మాకు తెలిసింది. కొంత సొమ్ము నగదు రూపంలో 50 వేల ఎక్కువులు శాశ్వత ప్రతిపదికపై సంవత్సరాలుగా చెల్లించే కొన్ని భూ భాగలను నసీర్ మహ్మద్ స్వీకరించి తన కుటుంబంతో సహా ఆ స్థలాన్ని వదలి పోవడానికి సిద్ధపడుతున్నాడు.

తరువాత శివాజీ వెల్లూరుకు పోయి దానిని ముట్టడించాడు. దానిని స్వాధీనపరచుకోవడంలో కాలహరణం జరుగుతుందని గుర్తించి, వెల్లూరు ముట్టడి కొనసాగడానికి ఒక సైనిక దళాన్ని వినియోగించి, స్వయంగా చుట్టుపట్ల ఉన్న జిల్లాలను వశపరచుకోవడానికి ముందంజ వేశాడు.

శివాజీ లక్ష్యం దోపిడీ దోచుకున్న సొత్తు కాదు. శాశ్వతంగా భూభాగాల ఆక్రమణను కాంక్షించాడు. మహారాష్ట్రలోని వివిధ పాలనాశాఖల నుంచి శివాజీ గణనీయమైన సంఖ్యలో ఉద్యోగుల సహాయంతో పరిపాలనను ప్రవేశ పెట్టాడు.

## దుర్గ రక్షణ నిర్మాణాలు

ఆ ప్రాంతంలో రక్షణ ఏర్పాట్లను ఆయన ఇనుమడించాడు. జింజీదుర్గం ఆయన ప్రత్యేక శ్రద్ధకు పాత్రమయింది. మార్టిన్ (పాండిచ్చేరిలో ఫ్రెంచి ఉద్యోగి) వ్రాసినది: "దుర్భేద్యమైన రక్షణను కలిగించే జింజీ నిర్మాణ స్థలాన్ని పరిశీలించిన తరువాత శివాజీ దుర్గంలో ఒక భాగాన్ని పడగొట్టి కొత్త రక్షణ కట్టడానికి ఉత్తర్వులు జారీచేశాడు. ఫిబ్రవరి 1678 లో జింజీలో ఆ కోట గోడలోని ఒక భాగాన్ని పడగొట్టి

[1] ఎస్. యన్. సేన్, ఫారిన్ బయోగ్రఫీ ఆఫ్ శివాజీ, పుట 269.

దాని చుట్టూ ఉన్న ప్రాంతానికి రక్షణ ఏర్పాటు చేయడానికి చురుకుగా పనిచేయసా గారు."

జూలై 1678 లో వ్రాసిన జెసూట్లు ప్రకారం ఇలా వుంది. "తన మేధాశక్తిని అంతటినీ తన రాజ్యపు వనరులన్నింటినీ ప్రధాన కేంద్రాలలో రక్షణ ఏర్పాట్లకై శివాజీ వినియోగించాడు. ఆయన జింజీ చుట్టూ కొత్త బురుజులను నిర్మించాడు కందకాలను త్రవ్వించాడు. గోపురాలను కట్టించాడు. ఐరోపా జాతులు సిగ్గుపడే విధంగా అన్ని కట్టడాలను లోపరహితంగా తయారు చేయించాడు."

అదే సమయంలో శివాజీకి వ్యతిరేకంగా తన వనరులను సమీకరించడానికి షేర్‌ఖాన్ ప్రయత్నించసాగాడు. ఫ్రెంచి వారిని పాండిచ్చేరిలో నెలకొనేటట్లు చేయడానికి అతనే బాధ్యుడు. ప్రతిఫలంగా వారు షేర్‌ఖాన్ కొరకు పాండిచ్చేరికి 24 కి.మీ. పడమరగా ఉన్న వాల్‌దొర్‌ను నసీర్ మహమ్మద్ నుంచి వశపరచుకున్నారు. షేర్‌ఖాన్ ఫ్రెంచివారి సహాయాన్ని కోరాడు. ఫ్రెంచివారికి రక్షణ భద్రతల హామీలను కోరుతూ శివాజీ వద్దకు రాయబారిని పంపిన మార్టిన్ మాటలలో: "ఏ పక్షాన చేరకుండా పూర్తి భద్రతతో మేము పాండిచ్చేరిలో ఉండవచ్చునని శివాజీ మా రాయబారికి హామీ ఇచ్చాడు. అతని ప్రజలకు కించిత్తు అవమానం కలిగినట్లయితే రాజాపూర్ వద్ద గల వ్యాపార కేంద్రంలోని మన వారికి అతను దయాదాక్షిణ్యాలు చూపడు. పాండిచ్చేరిని పాలించడానికి కొద్దిరోజుల్లో అతను ఒక హవల్దారును పంపగలడు. మనం షేర్ ఖాన్ అధికారులతో వలెనే అతనితో కూడా కలసి ఉండటం అవసరం."

మార్టిన్ 1677 జూన్ 29 న షేర్‌ఖాన్‌ను కలిసినప్పుడు అతను ప్రగల్భాలు పలికాడు. బీజాపూర్ ప్రధాన మంత్రి బహలూల్‌ఖాన్, గోల్కొండరాజుకు శివాజీతో అతని మైత్రీబంధాన్ని తెంచుకొవలసినందిగా కోరుతూ ఆదేశాన్ని ఇచ్చినట్లు షేర్ ఖాన్ అతిశయోక్తులు చెప్పాడు. శివాజీ తనకి వ్యతిరేకంగా నాలుగు లేక అయిదు వేల అశ్వికదళాన్ని మాత్రమే పంపినట్లయితే తాను యుద్ధానికి వెనుతీయనని మార్టిన్‌కి తెలియజేశాడు.

మార్టిన్‌కు సందేహాలు కలిగాయి. శివాజీ సైన్యంలో 12,000 అశ్వికదళం అనేక వేల కాల్బలం ఉన్నట్లు అతనికి తెలుసు. యుద్ధం చేయడానికి షేర్‌ఖాన్‌కు తగినబలం లేదని మార్టిన్ భావించాడు. జూన్ 1677 లో ఆఖరికి ఆపద సంభవిం

---

[1] జి.యస్. శ్రీనివాసాచారి, 'ఎహిస్టరీ' ఆఫ్ జింజే అండ్ ఇట్స్ రూలర్స్, పుట 226.

చింది. నేడు తిరుమల్లపాడి అనే పేరు గల తిరువాడి కొలదున్ నదిపై తంజావూరుకు సుమారు 27 కి.మీ. దూరంలో ఉంది. అక్కడి యుద్ధంలో షేర్ ఖాన్ ఓడిపోయి పారిపోయాడు. అతను భావన్‌గిరి దుర్గంలో తలదాచుకోగా అక్కడ మరాఠాలు అతన్ని ఎదుర్కొన్నారు.

జూలై 2 న షేర్‌ఖాన్ తన భూభాగాలనన్నింటిని మరాఠాల స్వాధీనంచేశాడు. అదనంగా రెండు వేల పగోడాలు నగదుగా చెల్లించడానికి వాగ్దానం చేశాడు. అందుకు హామీగా తన జ్యేష్ఠపుత్రుని కుదువ పెట్టాడు. చివరి వరకు బీజాపూర్ నుంచి సహాయాన్ని ఆశించాడు. అది అడియాసగా మిగిలింది. ఆవిధంగా ఒక దెబ్బతో బీజాపూర్ తమిళనాడులోని తన భూభాగాలను, తంజావూర్ రాజ్యాలలో తన పలుకుబడిని కోల్పోయింది. శివాజీకి ఆయన సవతి తమ్ముడు వెంకోజీ పాలనలోని తంజావూర్ సమస్యగా పరిణమించింది. వెంకోజీ తండ్రి షాజీ నుంచి మైసూర్ కర్ణాటకలోని భూభాగాలను జింజీ ప్రాంతాన్ని వారసత్వంగా పొందాడు. కానీ, 1676 జనవరిలో తంజావూరును వశపరచుకొని దానికి రాజుగా నెలకొనడం వెంకోజీ సాధించిన ప్రధాన విజయము. వెంకోజీ చేసిన ఈ పనికి బీజాపూర్ తిరుగతోడే స్థితిలో లేదు. అందుకు తగిన వనరులు దానికిలేవు. కానీ వెంకోజీ రాజైన తరువాత కూడా బీజాపూర్ పై ఆధారపడే స్థితిలో ఉన్నట్లు సుస్పష్టం.

తంజావూరుతో సహా వెంకోజీకి చెందిన భూభాగాల నన్నింటినీ పూర్తిగా హస్తగతం చేసుకొనే యోచన చేశాడు శివాజీ. వెంకోజీని మహరాష్ట్రలో గాని లేదా కుతుబ్షా పోషణలో గోల్కొండలోగాని గణనీయమైన జాగీరుకు మార్చడానికి అంగీకరించి వుండేవాడు. బీజాపూర్‌కు తంజావూర్‌తోనేగాక మధుర, మైసూర్లతో గల అన్ని సంబంధాలను అంతమొందించవలెనను నిశ్చయమే ఈ అభిలాషకు కారణము.

అందువల్ల తన ప్రయోజనాల సాధనకై వెంకోజీని (వారిరువురూ 1677 జూలైలో తిరువాడి వద్ద ఆయన శిబిరంలో సమావేశమైనప్పుడు) వారి పిత్రీయ వారసత్వ భూభాగాల పంపిణీకి అంగీకరించమని లాంఛన ప్రాయంగా కోరాడు. శివాజీ మనస్సు పనిచేస్తున్న రీతిని వెంకోజీ గ్రహించాడు. భీతిచెంది అతను తంజావూరుకు పారిపోయాడు.

తంజావూరును వెంకోజీ స్వాధీనంలోనే ఉంచి శివాజీ బెంగుళూరు, హాస్ కోట్, కోలార్, జింజీ ప్రాంతంతో సహా మైసూర్ కర్ణాటకలను, వాస్తవానికి కావేరీకి ఉత్తరంగా ఉన్న యావత్ ప్రదేశాన్ని అతను ఆక్రమించేందుకు ఉద్యుక్తుడయాడు. తిరువాడి వద్ద ఆయన శిబిరానికి మధుర మైసూర్ రాజులు వేలూర్, ఉలందూర్ పేట

స్థానిక నాయకులు (పాలెగాళ్ళు), ఆయన సందర్శనానికై తమ ప్రతినిధులను పంపారు.

శివాజీ శక్తికి మూలం ఏమిటని స్పష్టంగా సూచిస్తూ ఫ్రెంచివారు శివాజీ శిబిరాన్ని గురించి వారు తెలుసుకున్నది ఇలా వర్ణించారు. "శిబిరం ఆడంబరం కాని, స్త్రీలుకాని లేనిది. ప్రయాణ సామగ్రిలేక సాదా ముతక అతి స్వల్పమైన గుడ్డకప్పిన గుడారాలు మాత్రమే. ఒకటి అతనికి, మరొకటి అతని ప్రధాన మంత్రికి ఉన్నాయి."[1]

మరొక సందర్భంలో మార్టిన్ ఇలా అన్నాడు: శివాజీ ఆశ్వికులు సాధారణంగా ప్రతినెలా రెండు పగోడాలు వారి జీతంగా పొందే వారని చెప్పడం అసందర్భం కాదు. అన్ని గుఱ్ఱాలు అన్ని నాయకులకు చెందినవిగా అతను వారి పరిరక్షణకు కొందరు నౌకర్లను నియమించేవాడు. ఆశ్వికులు వాటితో ఏవిధమైన అనవసర జోక్యం చేసుకునేవారు కాదు. సాధారణంగా ప్రతి ఇద్దరికీ మూడు గుఱ్ఱాలు వుండేవి. అతని మామూలు వేగానికి ఇది దోహదం చేసింది. అతను ఎంతో దూరాన ఉన్నట్లు అతని శత్రువులు భావిస్తున్నా తరుణంలో అతను వారిపై బడి తరచు వారిని ఆశ్చర్యచకితులుగా కూడా చేస్తుండేవాడు. ఈ భాగాలకు చెందిన ఆశ్వికుల కుటుంబాలకు భారతదేశపు పశ్చిమ తీర భూముల్లో నివాసం ఏర్పరచేవారు. అందుచేత వారు విడిచి పెట్టకుండా అతని కొలువు చేస్తుండేవారు. అంతే కాక ఈ నాయకుడు అతని గూఢచారులకు ఉదారంగా వేతనాలు ఇచ్చినందున వారు అతనికి నికరమైన సమాచారాన్ని అందజేసి అతని విజయానికి గణనీయంగా తోడ్పడుతుండే వారు."

ఆ ఫ్రెంచ్ జాతీయుని ఉద్దేశంలో చురుకైన ఆశ్వికదళం కదలికలు శ్రేష్ఠమైన మంచి వేతనాలు పొందే పంచమాంగ దళ సేవ శివాజీ విజయానికి ప్రధాన కారణాలు, శివాజీ గుడారం స్త్రీలు, భారీ ప్రయాణ సామాగ్రుల లేమి వలన సాదాగా ఉన్నట్లు కూడా అతను గుర్తించాడు.

శివాజీ ఆశ్వికులు క్రమంగా వేతనాలు పొందుతున్నట్లు వారికి స్వంత గుఱ్ఱాలు లేనట్లు కూడా అతను గమనించకపోలేదు. గుఱ్ఱాలు రాజ్యం ఆస్తి. మన్సబ్‌దార్‌ల ఆధిపత్యంలో మెల్లిగా కదలిపోయే మొఘల్ సైన్యాలతో పోల్చినప్పుడు ఎంత తేడా!

శివాజీ శిబిరానికి తూర్పు తీరంలో చాలా కాలంగా స్థిర నివాసమేర్పరచుకొన్న డచ్చివారు 1677 ఆగస్టు 6 న తమ ప్రతినిధులను పంపారు. పూర్వపు రాజులు ప్రసాదించిన వ్యాపార రాయితీలను ఖాయపరచి కొనసాగించమని అర్థించడానికి

---

[1] యస్.యస్. సేన్, ఫారిన్ బయగ్రఫీస్ ఆఫ్ శివాజీ, పుటలు 306, 316.

వారు వెళ్ళారు. ఈ కోరికలు వెంటనే మంజూరు అయాయి.

చరిత్ర కారుడు డాక్టర్ రవీంద్ర రామదాస్ శివాజీ డచ్చివారితో కుదుర్చుకొన్న మరొక వ్యాపార ఒప్పందంలోని ఒక ప్రత్యేక షరతువైపు వారి దృష్టిని మరల్చాడు. ఆ షరతు ఈ విధంగా ఉంది: "మహ్మదీయుల పాలన క్రింద స్త్రీ పురుషులను బానిసలుగా క్రయ విక్రయం చేసేందుకు అనుమతి ఉండేది. కానీ ఇప్పుడు నా భూభాగంలో స్త్రీ పురుషులను బానిసలుగా అమ్మడానికి కొనడానికి మీకు అనుమతి లభించదు, మీరు ప్రయత్నించినట్లయితే, నా మనుషులు ఆ పని చేయకుండా మిమ్మల్ని నిషేధిస్తారు. ఈ షరతు తూ.చ. తప్పకుండా పాటించవలసి ఉంటుంది."[1] తోటి మానవుల పట్ల ఆయనకు గల శ్రద్ధ శివాజీ రాజ్య భావనను బహిర్గతం చేస్తుంది.

శివాజీ కొలదున్ నది ఒడ్డుపై గల తన శిబిరాన్ని 1677 జూలై 27 న ఎత్తి వేశాడు. వృధాచలంలోని యాత్రాస్థలాన్ని సందర్శించాడు. సెప్టెంబరు 22 న వెల్లూరుకు ఆగ్నేయంగా 64 కి.మీ. ఉన్న వానికంవాడి చేరుకొన్నాడు. అక్టోబరు మాసారంభంలో మద్రాసుకు రెండు రోజుల ప్రయాణ దూరంలో ఉన్నాడు. మద్రాసులోని దుర్గ ఆలయాన్ని ఆయన దర్శించి ఉండవచ్చు. ఆ ఆలయంలో ఆవిధమైన సంప్రదాయం ఉంది. బ్రిటిషువారితో తన ఉత్తర ప్రత్యుత్తరాలలో కొన్ని మందులు కావాలని కోరాడు. అనేక దుర్గాలలో కోటలలో కొత్త నిర్మాణాలు చేయడానికి సాంకేతిక నిపుణుల సేవలను కూడా కోరాడు. ఆయనకు మందులు సరఫరాచేస్తూ వారు సాంకేతిక నిపుణులకు సంబంధించిన ఆయన కోర్కెలను తిరస్కరించారు.

కొత్తగా జయించిన రాష్ట్రపాలనకు శివాజీ ఉత్కృష్టమైన ఏర్పాట్లు చేశాడు. ఆయన ఆధీనంలో ఉన్న తమిళనాడు ప్రాంతాలకు, కర్ణాటక భాగాలకు, రఘునాథ్ నారాయణ్ హనుమంత్‌ను గవర్నర్ జనరల్‌గా నియమించాడు. వెంకోజీ కదలికలను గమనించడానికి తన సేనాధ్యక్షుడు హంబీర్‌రావ్ మోహితే ఆధ్వర్యంలో బలమైన సైనిక దళాన్ని నియమించాడు.

అది దూర దృష్టి గల చర్య. కొలదున్ నదికి ఉత్తరంగా ఉన్న తన భూభాగ నష్టం పట్ల తీవ్రంగా అసంతుష్టుడైన వెంకోజీ శివాజీ హాజరుగా లేని అవకాశాన్ని తీసుకొని ఆయన సైన్యాలపై దాడిచేశాడు. ఇది నవంబర్ (1677) లో సంభవించింది. అనుకున్నట్లుగానే అతను ఓడిపోయి తంజావూరుకు పారిపోవలసి వచ్చింది.

[1] ఇంగ్లీషు రికార్డులు శివాజీపై, సంపుటు1, పుట 137.

శివాజీ సైన్యాలు తంజావూరును ఆక్రమించి ఉండవచ్చు. కానీ శివాజీ తంజావూరును వెంకోజీకి వదలి వేశాడు. మిగిలిన వెంకోజీ భూభాగాలన్నీ సంధి ఫలితంగా శివాజీకి దక్కాయి.

తంజావూరులో వెంకోజీ స్థాపించిన రాజ్యం 1799 లో బ్రిటిషువారి హస్తగత మయ్యే వరకు కొనసాగింది. తంజావూరు మరాఠా రాజులు గొప్ప సాహిత్య కళా పోషకులు. సంస్కృత, తెలుగు, తమిళం మరాఠీ భాషలలో విద్వాంసులను పోషించారు. సంస్కృతం, తమిళం, తెలుగు, మరాఠీ భాషలలో వేలాది వ్రాత ప్రతులు కలిగి జాతీయ ప్రాధాన్యంగల సంస్థగా పేరు గన్న తంజావూర్ సరస్వతీ మహల్ గ్రంథాలయాన్ని భావి తరాలకు విడిచి పెట్టిన అనేక ప్రయోజనకరమైన వారి కార్యాలలో వొకటి

**శివాజీ అనవరత పురోగమనం**

శివాజీ 1677 అక్టోబరు ఆఖరికి తమిళనాడు వదలిపెట్టాడు. కనుములను దాటి కర్ణాటక గుండా ప్రయాణిస్తూ, దారిలో వెంకోజీ భూభాగాలను లోబర్చుకొన్నాడు. తమిళనాడులోని వెల్లూరును దాని బీజాపూర్ సైన్యాధిపతి 1678 జూలై 21 న స్వాధీన పరచుకొన్నాడు.

శివాజీ సైన్యాలు తిరుగు ప్రయాణంలో మైసూరుతో స్వల్ప పోరాటానికి దిగాయి. శివాజీ స్వస్థలానికి చేరడానికి వేగిరపడుతున్నట్లు స్పష్టం: మొఘల్‌లతో మైత్రి ఎంత మంచిగా యాచించినప్పటికీ, స్థిరమైనది కాదు. బహదూర్‌ఖాన్ బీజాపూర్ నుంచి నల్‌దుర్గ్ గుర్బర్గాను వశపరచుకొనగానే బహదూర్‌ఖాన్ క్రింది హోదాగల సైన్యాధికారి దిలేర్ ఖాన్, బీజాపూర్ పఠాన్ ప్రధానమంత్రి అయిన బహలూల్ ఖాన్‌తో సంబంధం ఏర్పరచు కొన్నాడు. బహలూల్ ఖాన్ బీజాపూర్‌ను రక్షించదలచాడు. దిలేర్ ఖాన్ దానికి అంగీకరించాడు. మొఘల్ సైనిక శక్తిని గోల్కొండకు వ్యతిరేకంగా మరల్చినప్పుడే బీజాపూర్‌ను కాపాడటానికి వీలుపడుతుంది. దిలేర్ ఖాన్ బహలూల్ ఖాన్ కలసి ఔరంగజేబ్‌తో బహదూర్ ఖాన్ శివాజీతో స్నేహ సంబంధంకలిగి ఉన్నాడని, గోల్కొండ శివాజీతో సత్సంబంధాలను ఏర్పరచుకొన్నదని ఫిర్యాదు చేశాడు. బహదూర్ ఖాన్‌ను (దక్కన్‌నుంచి) తొలగించవలసిన అవసరం స్పష్టంగా ఉంది అప్పుడు బహలూల్‌ఖాన్ దిలేర్ ఖాన్ సంయుక్తంగా గోల్కొండను శిక్షించడానికి ససైన్యంగా వెళ్ళగలరు.

ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, ఔరంగజేబ్‌కు ఈ వాదనలు నచ్చాయి.

ఇందువలన దక్కన్‌లో మొఘల్‌ల చర్య విషాదాంతమైనది. ఔరంగజేబ్ రాకుమారుడు 1656 లో దక్కన్‌లో రాజ ప్రతినిధిగా ఉన్నప్పుడు గోల్కొండను నాశనం చేసి ఉంచవచ్చు. కానీ గోల్కొండ మాజీ మంత్రి అప్పుడు షాజహాన్ ప్రధాన మంత్రి ఆయన సూక్ష్మబుద్ధి మీర్జుమ్లా తన కర్ణాటక జాగీర్లు కాపాడుకొనే ఉద్దేశంతో ఔరంగజేబ్‌కు షాజహాన్‌కు బీజాపూర్ పై దండయాత్ర చేయమని ప్రోద్బలం చేశాడు. కాగా బీజాపూర్‌కు విరామం లభించింది. షయిస్త ఖాన్ 1660 లో బీజాపూర్‌పై దండయాత్ర చేయడానికి శివాజీ సహాయాన్ని తిరస్కరించాడు. అయిష్టంగా మొఘల్ పక్షాన చేరగా రాజా జయసింగ్ తగిన ఏర్పాట్లు లేకుండా బీజాపూర్ పై చేసిన దండయాత్ర ఏ మాత్రం వాంఛనీయంగా పరిణమించలేదు. ఫలితంగా మొఘల్‌లు కలతచెంది తిరిగి రావలసి వచ్చింది. ఆ తర్వాత బహదూర్ ఖాన్‌కి వ్యతిరేకంగా ఆయన సేనాని చేసిన కుట్ర బీజాపూర్ నాశనానికి అడ్డు పడింది.

బహదూర్‌ఖాన్ ఉత్తర భారతానికి వెళ్ళేదారిలో ఉండగా, దిలేర్ ఖాన్ గోల్కొండ భూభాగంపై దండయాత్ర చేశాడు. వారు 1677 సెప్టెంబర్‌లో గుల్బర్గాకు తూర్పుగా 35 కి.మీ. దూరంలో మాల్ఖేడ్ చేరారు. రెండు నెలలపాటు భీషణ పోరాటం జరిగింది. తీవ్ర ప్రతిఘటన ఎదురైనందున మొఘల్‌లు పురోగమించలేక పోయారు. చివరకు అక్టోబరులో మొఘల్‌లు గుల్బర్గాకు వెనుతిరిగారు. వెనుతిరిగి పోతున్నప్పుడు కూడా మొఘల్‌లు పోరాడవలసివచ్చినందువల్ల అది అవమానకరమైన పలాయనంగా పరిణమించింది. కేవలం 35 కి.మీ. దూరాన్ని ప్రయాణం చేయడానికి వారికి 12 రోజులు పట్టింది.

వెంటనే బహలూల్ ఖాన్ గుల్బర్గాలో దారుణ వ్యాధిపీడితుడయాడు. గోల్కొండ రాజు అబుల్ హసన్ బీజాపూర్‌లోని దక్కనీ పక్ష అధిపతి సిద్ధీమసూద్ బహలూల్ ఖాన్‌ల మాధ్య రాజీ చేశాడు. సిద్ధీమసూద్ ప్రధానమంత్రి బాధ్యతలను చేపట్టగా బహలూల్ ఖాన్‌కు, అతని సైన్యానికి చెల్లింపవలసిన బాకీలను తీర్చడానికి తగిన సొమ్ము లభించింది. ఈ రాజీ కుదర్చడంలో దిలేర్ ఖాన్ కూడా పాల్గొన్నాడు.

ఈ సమయంలో 1677 డిసెంబరు 25 న బహలూల్ ఖాన్ మరణించాడు. అంత గొడవ సంభవించిన తరువాత పఠానులు దక్కనీ పక్షానికి లొంగవలసి వచ్చింది.

దిలేర్ ఖాన్ సిద్దీ మసూద్‌తో గట్టి బేరం కుదుర్చుకొన్నాడు. బీజాపూర్ పూర్తిగా మొఘల్ చక్రవర్తి ఆజ్ఞానువర్తిగా వ్యవహరించింది. శివాజీని నాశనం చేయడానికి మొఘల్‌లు బీజాపూర్‌కు తోడ్పడగా, బీజాపూర్ రాజు సికందర్ అదిల్షా సోదరికి ఔరంగజేబ్ కుమారుడు అజామ్‌తో వివాహం కుదిరింది.

శివాజీ ఈ పరిణామాలను నిశితంగా గమనిస్తున్నాడు. మసూద్ ఆధ్వర్యంలో బీజాపూర్ తనకు వ్యతిరేకంగా యుద్ధ విధానానికి ఎలా కట్టుబడి ఉండగలదో ఆయన గుర్తించాడు. తనకు వ్యతిరేకంగా యుద్ధాన్ని కొనసాగించడానికి మొఘల్‌లు కృతనిశ్చయులై ఉన్న వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకొని, శివాజీ వ్యవహరించ వలసి వచ్చింది. బహదూర్‌ఖాన్ పూర్వంవలె దక్కన్‌లో లేడు. ఆయనకు వ్యతిరేకంగా మొఘల్-బీజాపూర్ మైత్రీ ఛాయ పెద్దగా ప్రసరించ సాగింది. దక్షిణాదిన ఆయన ఎక్కువ కాలం గడపడానికి వీలు లేక పోయింది. ఆయన కేవలం ఆరు నెలల కాలంలో దక్షిణాది నుంచి బీజాపూర్ తిరుగులేని విధంగా తొలగించి మరాఠా ప్రాబల్య రక్షణకు గట్టి పునాది ఏర్పాటు చేశాడు. దక్షిణాది నుంచి మరాఠాలను తరిమివేయడానికి మొగల్‌లు 20 సం॥ పోరాడవలసి వచ్చింది. ఇది మరాఠాల స్వాతంత్ర్యపోరాటంలో మొఘల్ వ్యూహాన్ని గాఢంగా ప్రభావితం చేసింది.

దక్షిణాదిన శివాజీ విజయాలను క్లుప్తంగా వర్ణిస్తూ మార్టిన్ ఇలా వ్రాశాడు. "మనం యూరప్‌లో వాటికి మించిన విప్లవాల ఉదాహరణలను చూసి ఉండనట్లయితే అట్టి ఆకస్మికమైన విప్లవం ఇంతకు ముందెన్నడూ చూసి ఉండరనిచెప్పవచ్చు."

తిరుగు ప్రయాణంలో శివాజీ ప్రస్తుతం కర్ణాటకకు చెందిన రాయచూర్ జిల్లాలోని కొప్పాల్ లక్ష్మేశ్వర్, ఫిబ్రవరిలో స్వాధీనపరచుకొన్న దుర్గం బెల్వాడీల గుండా వెళ్ళాడు. ఆయన 1678 ఏప్రిల్‌లో తన రాజ్యంలోని పన్హాల్‌గడ్ చేరుకొన్నాడు.

# 9
# చివరి రెండు సంవత్సరాలు

మొఘల్‌లతో యుద్ధం కొనసాగింది. శివాజీ రాజ్య వైశాల్యాన్ని, 1678 లో వెల్లూర్ (ఉత్తరఆర్కాట్ జిల్లా, తమిళనాడు) పతనం తరువాత వ్రాసిన మార్టిన్ ఇలా నమోదు చేశాడు: "శివాజీ సైన్యాలు ఇతర రాష్ట్రాలలో వాటి విజయ పరంపర భారత దేశం (పశ్చిమ) తీరంలోని ఆయన స్థిరాస్తులకు ఈ ప్రాంతాలలోని ఆయన జయించిన భూభాగానికి మధ్య సుమారు 30 లీగ్‌ల ప్రయాణ దూరం మాత్రమే ఉండే విధంగా కొనసాగించినట్లుగా రూఢిగా తెలిసింది." దిలేర్ ఖాన్ బీజాపూర్ ప్రధానమంత్రి సిద్ధీ మసూద్‌లను కఠినమైన షరతులు అంగీకరించేట్లుగా ఒత్తిడి చేశాడు. శివాజీకి వ్యతిరేకంగా పొత్తు కలిపిన రాజ్యాలు కొన్ని యత్నాలు చేసినప్పటికి అవి జయప్రదం కాలేదు. ఇంతలో ఔరంగజేబునుంచి దిలేర్‌ఖాన్ తీవ్రమైన మందలింపులు అందుకొన్నాడు. చక్రవర్తి ఇలా వ్రాశాడు. "సిద్ది మసూద్‌ను బీజాపూర్‌లో అధిపత్యం వహించడానికి ఎందుకు అనుమతించావు? అఫ్ఘన్‌లు స్థైర్యాన్ని కోల్పోయిన స్థితిలో ఉన్నారు. దక్కనీ పక్షనాయకులు కూడా పరస్పరం కలహించుకుంటున్నారు. వారిని నీవైపు తిప్పుకో. వారిని సామ్రాజ్య సేవలో నియోగించి బీజాపూర్‌ను ముట్టడించు." ఆ విధంగా దిలేర్‌ఖాన్ బీజాపూర్ వినాశనానికై బహదూర్ ఖాన్ చాలాకాలం పాటు చేసిన కృషిని కొససాగించవలసి వచ్చింది.

దిలేర్‌ఖాన్ 1678 నాటి వర్షారుతువులో బహదూర్ గడ్ వద్ద మకాం పెట్టాడు. బీజాపూర్‌కు వ్యతిరేకంగా యుద్ధానికి సిద్ధ పడుతూ అతఃకలహాలతో నిండిన ఆ రాజ్యం నుంచి అనేక స్వపక్ష త్యాగాలను విద్రోహాలను అతను ప్రోత్సహించాడు. స్వపక్షాన్ని విడిచి పెట్టిన (బీజాపూర్) అధికారులకు తగిన మన్సబ్‌లు ఇవ్వాలని ఔరంగజేబ్ స్పష్టమైన ఆదేశాలను జారీచేశాడు. అయినప్పటికీ మన్సబ్‌ల నిర్ణయం కోసం వేచివుండక వారికి సొమ్ము చెల్లిస్తూ వుండాలి. వారి దళాలలో ప్రతి అశ్వికునికీ రోజువారీ ఆరు అణాల వేతనం చొప్పున సొమ్ము తక్షణం అంద చేస్తారు. తారీఖ్ దిల్‌కుషా గ్రంథకర్త అయిన భీమ్‌సేన్ సక్సేనా, స్వల్పకాలంలో 20,000

ఆశ్వికులు బీజాపూర్ గోల్కొండలను విడిచిపెట్టి దిలేర్ ఖాన్ సేవలో చేరినట్లు వ్రాశాడు.

ఇంతలో మూ అజ్జామ్ రాకుమారుడు ఔరంగజేబ్‌తో రాజప్రతినిధిగా పదవీ బాధ్యతలను చేపట్టడానికి 1678 అక్టోబరులో దక్కన్ చేరాడు.

మొఘల్ పక్షంలో శివాజీ కుమారుడు శంభాజీ చేరేటట్లు అతని మనస్సును త్రిప్పటం దిలేర్ ఖాన్ సాధించిన ఘన విజయం శివాజీకి అతని కుమారుని స్వపక్ష త్యాగం పిడుగుపాటువలె తోచింది.

శంభాజీ తలబిరుసు స్వభావంగలవ్యక్తి. శివాజీకి అతను వారసుడు, యువ రాజు. పరిపాలనలో బహుశా అతను ఆతురతపడిఉంటాడు. అతని సవతితల్లి ఆమె బిడ్డ రాజారాంకి అనుకూలంగా కొన్ని పథకాలువేస్తున్నట్లు అవి తన భవిష్యత్తుపై పెద్దప్రభావాన్ని కలిగించవచ్చని అతను భావించి ఉంటాడు. అంతేకాక శివాజీ మంత్రులు కూడా అతనికి వ్యతిరేకంగా పనిచేస్తున్నట్లు తలపోశాడు.

శివాజీ దక్షిణ భారతదేశంలో దండయాత్ర సాగించినప్పుడు శంభాజీని వెంట తీసుకొని వెళ్ళలేదు. ఆయన లేని సమయంలో రాజధాని రాయగఢ్‌కు వెలుపల శంభాజీని ఆయన నియోగించాడు. ఈ శివాజీ చర్య తన పట్ల విశ్వాస రాహిత్యాన్ని చూపించినట్లుగా అతను బహుశా అన్వయించుకొని ఉంటాడు. మొఘల్‌లు తమ శత్రువుల బలహీనతను వినియోగించుకోవడానికి నిత్యం కృషి చేస్తుండేవారు. మస్నబ్‌దారి పదవి గట్టి ఆకర్షణ. ఆ సాధనాన్ని బలహీనమైన రాజ పుత్ర రాజ్యాలలో మొఘల్‌లు జయప్రదంగా నిర్వహించారు. ఆ విధంగానే స్వీయరాజ్య వైశాల్యాన్ని ప్రభావాన్ని తగ్గించడానికి ఉద్దేశరహితంగా తోడ్పడుతూ ఉదయపూర్ రాజవంశానికి చెందిన కనిష్ఠ రాకుమారులు కూడా మొఘల్‌ల క్రింద మన్సబ్‌లను అంగీకరించారు.

1665 లో శంభాజీకి మన్సబ్‌ను పురందర్‌లో ఔరంగాబాద్‌లో 1667 లో శివాజీ అందు కొన్నప్పటికి 1675 లో బహదూర్‌ఖాన్‌ను కోరారు. పైన పేర్కొన్న కారణాలను పురస్కరించుకొని శంభాజీ మన్సబ్ ఎరను పరిగ్రహించడాన్ని సమర్థించుకొని ఉండవచ్చు. అతను 1680 ఆగస్టు 24 న ఒక బ్రాహ్మణునకు జారీ చేసిన దానపత్రాలలో అతని చర్యకు స్వీయ సమర్ధన బహిర్గతమవుతుంది. దానిలో అతను ఇలా అన్నాడు: "రాణి మనస్సు స్ఫటికంవలె స్వచ్ఛమైనది. కాని జ్యేష్ఠ పుత్రునికి సింహాసనం ఇవ్వరాదని దుష్టులైన మంత్రులు చెప్పిన దుర్మార్గపు సలహాకి ఆమె తలకెక్కినది. రాజు (శివాజీ) రాణిపట్ల అభిమానం కలిగి ఉన్నందున అతనికి వ్యతిరేక మయాడు. అయినప్పటికీ, పితృభక్తి విషయంలో అతను ఎన్నడు లోపం చెయ్యలేదు. కర్తవ్యనిర్వహణలో అతను దశరథరాముని వంటి వాడు. ఒకటిన్నర కోట్ల సంపదను,

దుర్గాలను, రాజ పదవిని, తృణప్రాయంగా ఎంచి వాటిని వదలు కొన్నాడు."

శంభాజీ గంభీరంగా తనను రామునితో పోల్చుకొన్నప్పటికీ 1678 డిసెంబరు 13 న మొఘల్‌ల పక్షంలో చేరడానికి తీసుకున్న చర్య ప్రమాద భరితమయినది.

శంభాజీ రాకను దిలేర్‌ఖాన్ అమిత సంతోషంతో శ్లాఘించాడు. ఔరంగజేబ్ అతనికి రాజా అనే బిరుదును ఇవ్వటమే కాక బహుకొద్దిమంది వ్యక్తులకు ప్రసాదించిన గౌరవం అయిన ఏడువేల ఆశ్వికదళ మన్సబ్ దారీని ఆ యువరాకుమారునికి అనుగ్రహించాడు.

శంభాజీ స్వపక్ష త్యాగం శివాజీకి తీవ్ర వ్యాఘాతమై ఉంటుంది. అయినా మహామనీషి అయిన ఆ నాయకుడు తన ధైర్యాన్ని కోల్పోలేదు. తన కుమారుడు స్వగృహానికి తిరిగి వచ్చేటట్లు నచ్చచెప్పటానికి ప్రయత్నాలు కొనసాగించాడు. బీజాపూర్‌కు మొఘల్‌లకు మధ్య వైరుధ్యాన్ని కల్పించి ఆయన బీజాపూర్‌కు పూర్తిగా తోడ్పడగలనని వాగ్దానం చేశాడు. ఇంతలో మరాఠా దుర్గం భోపాల్ గఢ్‌ను దిలేర్ ఖాన్ శంభాజీ కలసి ముట్టడించారు. ఆ దుర్గం 1679 ఏప్రిల్ 2 న శత్రువుల స్వాధీనమయింది. శివాజీ కుమారుడు ముట్టడికి నాయకత్వం వహించడాన్ని గమనించిన దుర్గదళాధిపతి ధైర్యాన్ని పోగొట్టుకోవడమే దానికి ముఖ్యకారణం. ఆదుర్గ దళాధిపతిపై తీవ్ర క్రమశిక్షణ చర్యలు విధించడం ద్వారా శివాజీ కేంద్రాలకు తగిన గుణపాఠం నేర్పినట్లు అయింది.

మరాఠాలకు వ్యతిరేకంగా పురోగమించలేక, దిలేర్ ఖాన్ తన దృష్టిని బీజాపూర్‌కు మరల్చాడు. ఆ సమయానికి సిద్దీమసూద్ శివాజీ మైత్రీబంధాన్ని ఏర్పరచుకొన్నారు.

దిలేర్ ఖాన్ బీజాపూర్‌ను ముట్టడించడానికి గట్టి ప్రయత్నాలు చేస్తుండగా, దక్కన్‌కు మనుష్యులను కాని అదనపు దళాలను కాని పంపే స్థితిలో ఔరంగజేబ్‌లేడు. మహారాజా జస్వంత్‌సింగ్ 1678 డిసెంబరు 10 న మరణించగా 1679 ఫిబ్రవరి 19 న అజ్మీర్‌కు చేరుకున్నాడు. మరణానంతరం జన్మించిన అతని కుమారుడు అజిత్ సింగ్‌ను ఢిల్లీలో నిర్బంధించడానికి ప్రయత్నించాడు. రాజపుత్రులు ఆ పిల్లవాడిని కాపాడి 1679 జూలై 23 న అతన్ని దూరంగా తీసుకుని పోయారు.

తిరిగి ఔరంగజేబ్ రాజపుత్రుల వ్యవహారాన్ని సంబాళించడానికి సెప్టెంబర్ 3 న అజ్మీర్ చేరుకొన్నాడు. ఉదయపూర్, జోధ్‌పూర్‌తో కలసి మొఘల్‌లకు వ్యతిరేకంగా తీవ్ర పోరాటాన్ని కొనసాగించింది.

సామ్రాజ్యంలోని తన అధీనుల్లో అత్యధిక సంఖ్యాకుల్ని రెండవ తరగతి పౌరు

లుగా చూసే ఔరంగజేబ్ విధానానికి 'తలపన్ను' (జజియా) ను విధించే అతని ఆజ్ఞ ఒక చక్కని ఉదాహరణ. ఔరంగజేబ్ పవిత్రుడైన కార్యదర్శి, జీవిత చరిత్ర రచయిత అయిన సాకీ ముస్తయిద్ ఖాన్ ఇలా వ్రాశాడు[1]. "మతానువర్తి అయిన చక్రవర్తి లక్ష్యాలన్నీ ఇస్లాం శాసన వ్యాప్తికి అవిశ్వాసుల కార్యకలాపాలను తొలగించడానికి అంకితంకాగా అతను రాజధానిలోని రాష్ట్రాలలోని ముస్లిమేతరుల (జిమ్మీలు) సవినయ హస్తాలతో చెల్లించినట్లు మతన్యాయ సంప్రదాయాలను అనుగునంగా మార్పిడి సొమ్ము (జజియా)ను విధించిన ఖురాన్ ప్రామాణిక ఆదేశానికి లోబడి, 1679 ఏప్రిల్ 2 బుధవారం నుంచి జిజియాను వసూలు చేయాలని ఉత్తర్వులు జారీ చేశాడు."

చరిత్ర కారుడు యమ్. అతర్ అలీఖాన్[2] మత ఛాందసత్వంగల చక్రవర్తి 1658-59 లో మొఘల్‌ల సింహాసనాన్ని చేపట్టడానికి తన హింసాయుత చర్యకు సమర్థనగా ముస్లిం సంప్రదాయ వాదులతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొని హిందువులకు వ్యతిరేకంగా, వివక్షత చూపే విధానాన్ని అనుసరించాడు. సైనిక యాత్రల్లో అతని అపజయం కూడా ఇది మరొక కారణం. రాజపుత్రులపై దండయాత్రను గురించి మన్సబ్‌దారి వ్యవస్థలో ఏర్పడిన విషమపరిస్థితి రాజపుత్ర భూభాగాలను స్వాధీనం చేసికొనేటట్లు ఔరంగజేబ్ ప్రలోభానికి గురిచేసిందని అందువల్ల రాజపుత్రులు మరుగున పడటం, చక్రవర్తి కొత్తగా అవలంబించిన తీవ్ర ఛాందసవైఖరికి అనుగుణంగా ఉన్నదని ఆ చరిత్ర కారుడు సూచించాడు. దూర దృష్టిలేక ఔరంగజేబ్ జజియాను విధించడం పట్ల శివాజీ భావోద్వేగంతో అసమ్మతిని ప్రకటించాడు. జాతి నిర్మాతగా శివాజీ పాత్రను (ఈ సందర్భంలో) ఔరంగజేబ్‌కు ఆయన వ్రాసిన లేఖ నిదర్శనం. ఆ లేఖ ధోరణి-హుందా, ఆగ్రహ వైఖరి ఉన్నత మానవత్వానికి చేసిన విజ్ఞప్తి చివరకు చక్రవర్తి తలపెట్టిన వినాశకరమైన కార్యాచరణ నుంచి విరమించమని చేసిన హెచ్చరికలను బట్టి భారతదేశ చరిత్రలో ఇది ముఖ్యమైన పత్రం కాగలదు. ఆ లేఖలోని కొన్ని అంశాలు ఇలా వున్నాయి. "మీరు నాకు వ్యతిరేకంగా సాగిస్తున్న యుద్ధం వలన మీ కోశాగారం ఖాళీ అయిందని నాకు ఇటీవల తెలియవచ్చింది. వ్యయాన్ని హిందువులపై జజియాను విధించడం ద్వారా భరించడానికి మీరు నిర్ణయించారు. సార్వభౌమా! 'ఖురాను' లో భగవంతుణ్ణి జగద్రక్షకుని (రబ్-హుల్-అలమిన్) గా వర్ణించారే కాని, ముస్లింల సంరక్షకునిగా కాదు. వాస్తవానికి ఇస్లాం-హిందూ మతాలు రెండూ దైవశక్తికి చక్కని రూపాలు). మసీదులలో ప్రార్థనలకై పిలుపునిస్తారు. దేవాల

[1] సాకీముస్తయిన్ ఖాన్, మసిరే అలంగీరీ.

[2] యమ్. అతరాలీ, మొఘల్ నొబిలిటీ అండర్ ఔరంగజేబ్.

యాలో దేవుని వైభవాన్ని ప్రకటించడానికి గంటలు మ్రోగుతాయి. మూఢభక్తి, ఇతర మతాల పట్ల ద్వేషమ్ము కలిగినవాడు భగవంతుని ఆదేశానికి వ్యతిరేకంగా నడచుకొం టున్నాడనాలి. ఈ మత చిత్రాల ప్రాతిపదికపై గీతలు గీయాలని తలపెట్టడం నిజంగా దైవ చిత్రకారునిపై నిందవేసినట్లే. సృష్టిలో లోపాలను చూపిస్తే, మీరు సృష్టికర్తను విమర్శించినట్లే. ఆవిధంగా చేయవద్దు.

"న్యాయ బద్ధంగా ఉండదలచినట్లయితే జజియాను ఏ కారకాలను పురస్కరిం కొని సమర్థించడానికి వీలులేదు."

**అణగారని సంఘర్షణ**

బీజాపూర్‌ను రక్షించడంలో సహాయంచేయడానికి శివాజీ ఆ నగరానికి 10,000 గుఱ్ఱాల బలగాన్ని పంపాడు. 10,000 ఎద్దులపై ధాన్యాన్ని బీజాపూరుకు రవాణా చేశాడు. బీజాపూర్‌కు ధాన్యాన్ని చేరవేయవలసిందని ప్రజలకు కూడా ఆజ్ఞ జారీఅయింది. శివాజీ సేనాని అనందరావు 2000-3000 అశ్వికదళంతో బీజాపూర్ చేరాడు.

అక్టోబర్ 7, 1679 న దిలేర్ ఖాన్ బీజాపూర్‌కు ఈశాన్యముగా 10 కి.మీ. దూర ములో విడిది చేశాడు.

శివాజీ కూడా 10,000 సైన్యంతో బీజాపూర్‌కు చేరుకొన్నాడు. తరువాత యుద్ధసన్నా హాలను గురించి వారు తీవ్రంగా చర్చించుకొన్నారు. సిద్దీమసూద్ బీజాపూర్‌ను సంర క్షించేటట్లు, శివాజీ మొఘలాయిల దక్కన్ భాగంలో యుద్ధ ప్రయత్నాలు కొనసా గించి బీజాపూర్ ముట్టడిని విరమింప చేయడానికి నిర్ణయమయింది.

అదే విధంగా దిలేర్ ఖాన్ బీజాపూర్‌ను ముట్టడించాడు. శివాజీ మొఘల్ రాష్ట్రాలలో ప్రవేశించి అతను వెళ్ళిన ప్రతిచోటా ఎదురుదాడులు ప్రారంభించాడు. రాజప్రతినిధి యువరాజు మువజ్జామ్ ఆగ్రహోపూరితుడయ్యాడు. అతను చక్రవర్తికి ఒక సందేశం పంపుతూ బీజాపూర్‌ను ఆక్రమించటం కష్టతరమైన విషయమని దిలేర్ ఖాన్ ప్రభుత్వ ధనాన్ని నిర్హేతుకంగా దుర్వినియోగం చేస్తున్నాడని తెలియచేశాడు. తన వైఫల్యానికి బాధపడిన దిలేర్‌ఖాన్ గ్రామ ప్రాంతాలను ధ్వంసంచేశాడు. పట్టణాలను దోచుకున్నా డు. పెక్కు మంది పౌరులను ఖైదీలుగా పట్టుకున్నాడు. శివాజీ ఇట్టి అర్థరహితమైన చర్యలపట్ల నిరసన తెలిపాడు. శివాజీయొక్క కఠినమైన క్రమశిక్షణ దృష్ట్యా. శంభాజీ తన వైపు ఉన్నప్పటికీ మరాఠా రాజ్యంపై ఎటువంటి ప్రభావాన్ని కలిగించలేక పోయా డు. మొఘలాయీలతో చేతులు కలిపేందుకు త్వరపడిన ఫలితంగా శంభాజీకి పశ్చా త్తాపయే మిగిలినది. శివాజీ ప్రోత్సాహంతో శంభాజీ అతని వద్ద వున్న మొఘలాయీల

గుడారాల నుంచి నవంబరు 20, 1679 న తప్పించుకున్నాడు. అక్కడ నుంచి బీజాపూర్‌కు పారిపోయి డిసెంబర్ 5, 1679 న పన్హాలా చేరుకున్నాడు.

శివాజీ మొఘలాయీల దక్కన్ ప్రాంతంలో మెరుపు దాడులు కొనసాగిస్తూనే ఉన్నాడు. అక్కడి నుంచి బీరార్, ఖాందేష్‌లకు దాడులను విస్తరింప చేశాడు. జాల్నా దోపిడీ శివాజీ యొక్క దాడులలో అత్యద్భుతమైనదిగా పేర్కొనవచ్చును. జాల్నా ఔరంగాబాద్‌కు 64 కి.మీ. దూరంలో ఉన్నది. ఈ దాడి నవంబరు చివరి వారంలో జరిగింది. జాల్నా నుంచి తిరుగు ప్రయాణంలో శివాజీ పట్టా (విశ్రామ్‌గడ్ దుర్గ) అనే దుర్గము వద్ద విడదిచేసి వుండగా శంభాజీ తప్పించుకొని పన్హాలాకు సురక్షితంగా చేరినట్లు తెలియవచ్చింది. శివాజీ తన కుమారుని కలుసుకోవడానికి త్వరితగతిని పన్హాలా దుర్గాన్ని చేరుకొన్నాడు. పరితప్తుడైన కుమారుడు తన తండ్రి పాదములపై పడి క్షమాభిక్ష వేడుకున్న దృశ్యము మనసులను కదిలించివేస్తుంది.

దిలేర్ ఖాన్ బీజాపూర్‌పై చేసిన ప్రయత్నాలు విఫలమయాయి. ఔరంగజేబు ఆజ్ఞను అనుసరించి అతను బీజాపూర్ ముట్టడిని 29 జనవరి, 1680 న విరమించాడు. మొఘలాయీల భూభాగానికి తిరిగిరావాలని ఆజ్ఞలు ఉన్నప్పటికీ బీజాపూర్ సామంతులైన బీదర్‌లపై దండెత్తడానికి నిశ్చయించుకొన్నాడు. ఇక్కడ కూడా అతను పూర్తిగా ఓటమిని ఎదుర్కొన్నాడు. మొఘలాయీలు అధికంగా మరణించారు. చనిపోయినవారు గాయపడినవారు 1700 వున్నారు. తరువాత తన ఓటమిని అంగీకరించి అతను భీమానదిని దాటి బహదూర్ ఘడ్ వద్ద విడిది చేశాడు. దిలేర్ ఖాన్, రాజప్రతినిధి ముఅజ్జాం యువరాజు మొఘల్ దర్బారుకు పిలువబడ్డారు. మార్చి 1680 లో బహదూర్‌ఖాన్ రాజప్రతినిధిగా తిరిగి నియమితుడయాడు.

పరిహాసపూర్వకంగా మరొ సేనానాయకుడు కూడా అప్రతిష్ఠతో తన ప్రయత్నాన్ని విరమించవలసి వచ్చింది. షయిస్త ఖాన్ జయసింగ్, దావూద్‌ఖాన్ దిలేర్‌ఖాన్, ముఅజ్జామ్ యువరాజు యిదే విధంగా అప్రతిష్ఠ పాలు అయారు. అవకాశవాదుము, పట్టుదల లేకపోవటం, మొదటి ఒక రాజ్యంలో తరువాత మరో రాజ్యంతో అవినీతికరంగా తంత్రాలు చేయడం, మొదలైన వాటితో కూడుకున్న మొఘలాయీల విధానం వలన ఇట్టి అప్రతిష్ఠ ఏర్పడింది. ఔరంగజేబ్ వ్రాసిన లేఖలలో దక్కన్‌లోని సైనికుల నిర్లక్ష్య వైఖరి, అసమర్థతను గురించి నిందాపూర్వకంగా ఆరోపించాడు. ఆ కారణం చేతనే అతను స్వయంగా దక్కన్‌కు వచ్చి యుద్ధము చేయాలని సంకల్పించాడు. తన విధానము విఫలం కావడానికి స్వయంకారకుడు.

జంజీరాలోని సిద్దీలపై శివాజీ యుద్ధచర్యలు నడిపాడు. వీరు మొఘలాయీల

నావికా బలాన్ని నిర్వహిస్తుండేవారు. శివాజీ నడిపిన ఈ రక్షణ చర్యల వలన బ్రిటిష్ వారితో యుద్ధం చేయవసి వచ్చింది. శివాజీ ఖందేరీ ద్వీపాన్ని పటిష్ఠముగా చేయాలని నిర్ణయించాడు.

బ్రిటిష్‌వారు ఈ పరిస్థితిని తమ స్వప్రయోజనానికి భంగకరమని గ్రహించి ఆహార పదార్థాలు మొదలైన వాటిని బయటనుంచి ఖందేరీ ద్వీపములోనికి చేరవేయకుండా నిరోధించడానికి ప్రయత్నించారు. సెప్టెంబరులో లెఫ్టినెంట్ తోర్ప్ నాయకత్వాన బ్రిటిష్ సైనికులు ఆ ద్వీపంపై దాడిచేశారు. కానీ ఆ ప్రయత్నము విఫలమయింది. తోర్ప్ బ్రాడ్‌బరీ, హెన్రీ వెల్ప్ వధించబడ్డారు. అనేక మంది క్షతగాత్రులయారు. జార్జికోలేతో పాటు అనేక మంది ఆ ద్వీపంలో ఖైదు చేయబడ్డారు. 19 సెప్టెంబరు 1679 న రివెంజ్ అనే పేరుగల యుద్ధ నౌకాధికారి కెప్టెన్ మించిన్ ఈ విషయాన్ని గురించి ఇలా వ్రాశాడు. "ఏ శత్రువైనా నాపై దాడి జరిపినప్పుడు నన్ను నేను రక్షించుకునే స్థితిలోలేను. అందువలన మిమ్మల్ని త్వరితగతిని కొత్తగా సైనికులను రక్షక దళంలో చేర్చుకొని పంపవలసినదిగా నా విన్నపము. లేనట్లయితే మీరు ఏ విధంగా ఆజ్ఞాపిస్తే అలా చేయగలను."

ఆ పరిస్థితిలో బ్రిటిషువారు ఆ ద్వీపం పై నిరవధికంగా ముట్టడి చేయడానికి నిశ్చయించుకొన్నారు. ఆ ముట్టడి నిర్వహించడానికై కెప్టెన్ రిచర్డ్ కిగ్విన్ సైన్యాధికారిగా నియమించబడ్డాడు. 18 అక్టోబరు 1679 న నౌకాయుద్ధం జరిగింది. గట్టి పోరాటం తరువాత మరాఠాలు యుద్ధవిరమణ చేశారు. కాని బ్రిటిష్ సైన్యాధికారులను బంధించిన తరువాత అలా చేశారు. ఆ ముట్టడి విఫలమయింది. తరువాత మరాఠాలు యథేచ్ఛగా తమకు కావలసిన భూప్రదేశం నుంచి రవాణాఏర్పాట్లు చేసుకొని ద్వీపానికి గట్టి బందోబస్తు చేసుకొన్నారు.

శివాజీ బొంబాయి ద్వీపంపై తగినంత సైనిక బలాన్ని పెంచుకొన్నాడని బ్రిటిష్ వారు తెలుసుకొన్నారు. జంజీరాకు చెందిన సిద్ధీలు కూడా పోరాటానికి దిగి ఖందేరిపై దాడులు చేశారు. మరాఠాలు దానిని ధైర్యసాహసాలతో ఎదుర్కొన్నారు.

బ్రిటిషువారికి ఈ కార్యము విఫలమైనదిగానే కాక చాలా వ్యయంతో కూడుకున్నదిగా తేలింది. బొంబాయికి సంబంధించినంత వరకు ప్రమాద స్థితి అలక్ష్యం చేయతగినది కాదు. 1680 జనవరి సంధి ఒప్పందం ప్రకారము బ్రిటిషువారు తమ సైనికబలాన్ని ఖందేరీ నుంచి ఉపసంహరించుకొన్నారు. జనవరి 27 న తన సైనిక బలగాన్ని విరమించుకోవడాన్ని ఉద్దేశిస్తూ బ్రిటిషువారు జనవరి 31 న ఈ విధంగా వ్రాశారు. "హెన్రీకెంబ్రీ వ్యవహారం ఎప్పుడూ జరగకుండా వుండవలసిందని కాంక్షిస్తూ

శివాజీకి సంబంధించిన అమీదులు మాత్రమే ఈ వ్యవహారంలో అందరిమ నలను పొందగలిగారు."

బ్రిటిష్‌వారికి శివాజీకి మధ్యన జరిగిన నౌకాయుద్ధం ఆ విధంగా ముగిసింది. సిద్దీలతో యుద్ధం మందకొడిగా కొనసాగింది. రామ్‌నగర్‌కి సంబంధించిన పన్ను (చౌత్‌ను) తిరిగి పంపే విషయంలో పోర్చుగీసువారు తమ మాట నిలబెట్టుకోని కారణంగా శివాజీ వారికి వ్యతిరేకంగా కార్యక్రమాన్ని చేపెట్టాడు. వారి అధికారాన్ని క్రమంగా కోల్పోనున్నట్లు పోర్చుగీసువారు గ్రహించుకొన్నారు. అంతేకాక మరాఠాల కీర్తి ప్రతిష్ఠలను వారు కూలంకుషంగా గ్రహించారు.

మొఘల్‌లతో పోరాటం కొనసాగుతూనే ఉంది. 24 ఫిబ్రవరి 1680 న ఖందేష్ లోని చోపడా నుంచి పంపిన ఒక సందేశంలో బ్రిటిషువారు: "శివాజీ సైనిక విధానాలను గురించి ఈ విధంగా చెప్పవలసిఉంది. వారు ఖాందేష్‌లో తమకు పన్ను (చౌత్) చెల్లించే పట్టణాలను కాక తక్కిన ప్రదేశాలను దోచుకొని తగుల బెట్టారు. మోరో పంతు నాయకత్వంలోని శివాజీ సైన్యం సరిహద్దు ప్రాంతాలలోనే కొనసాగుతూ వారు ఆక్రమించుకోగలిగినన్ని కోటలను ఆక్రమించుకున్నారు. అప్పటికే వారు హనుమంత్ గడ్ కోటను ఆక్రమించుకొన్నారు. కొందరు వారి దృష్టి సూరత్‌పైన కేంద్రీకరించబడినదనీ మరికొందరు బుర్హాన్‌పూర్‌పై ఉన్నదనీ చెబుతారు."

రాజపుత్రులకు వ్యతిరేకంగా ఔరంగజేబ్ యువరాజు ముఅజ్జామ్, ధిలేర్ ఖాన్‌లు ఉత్తరానికి వెళ్ళేందుకు సిద్ధపడేటట్లు చేసింది. మొఘల్‌లలో ఏవిధమైన ప్రతీకార వాంఛ మిగులలేదు.

శివాజీ తన కుమారుడు శంభాజీని పన్హాల్‌గడ్‌లో కలుసుకొనేందుకు తొందరపడ్డాడు. తండ్రి కుమారుల మధ్య రాజీ కుదిరింది. శివాజీ తన కుమారునికి పరిపాలనా విభాగంలో ఒక ప్రాముఖ్యతను సంతరించి పెట్టే ఆలోచనకు అనుగుణంగా సామ్రాజ్యంలో ముఖ్యమైన భాగం సాధ్యమైనంత వరకు దక్షిణ ప్రాంతాన్ని అతని పరిపాలన క్రిందకు తెచ్చే ఆవశ్యకతను గుర్తించాడు కానీ ఈ విషయంలో ఒక నిర్ణయానికి రాలేక పోయాడు.

తన చిన్న కుమారుడు రాజారామ్‌కు వివాహము వడుగు జరిపంచే నిమిత్తమై శివాజీ రాయ్‌గడ్‌కు తిరిగి రావలసి వచ్చింది. శంభాజీ విషయమై ఒక సహేతుకమైన నిర్ణయం చేయడం కోసమై కార్యానంతరము పన్హాల్‌గడ్ తిరిగి రావడానికై శివాజీ అభిలషించాడు. కానీ విధి వేరొక విధంగా నిర్ణయించింది. పన్హాలా నుంచి తిరిగి వచ్చేటప్పుడు యోగి శ్రీరామదాసుతో సజ్జన్‌గడ్‌లో శివాజీ కొంత కాలము గడిపాడు.

రాజారామ్ పవిత్రమైన వడుగు కార్యక్రమము మార్చి 7 వ తారీఖున జరిగింది. మార్చి 5 న వివాహమహోత్సవము. పూర్తయింది.

ఆ తరువాత శివాజీ అస్వస్థతకు గురిఅయినాడు. (సభాసద్ వ్రాసిన ప్రకారం ఆయన జ్వరానికి గురయ్యాడు. మరికొందరు కొత్తరకం జ్వరానికి టైఫాయిడ్‌కి లేక మెదడుకు సంబంధించిన వ్యాధికి గురయ్యారని చెబుతారు). కొద్దికాలం మాత్రమే అస్వస్థతకు గురి అయి శివాజీ మరణించాడు. బ్రిటిషువారు రక్తపూరితమైన వ్యాధిగాను, పోర్చుగీసువారు రాచపుండుగాను, మొఘల్‌లు రక్తపు వాంతులతోను మరణించినట్లు నిర్ణయించారు. ఆయన జ్వరముతోను రక్తవిరోచనములతో బహుశః కాలంచేసి వుండవచ్చు.

# ముగింపు

ఆధారరహితమైన పుకార్లకు విరుద్ధంగా ఆయన మరణము సహజసిద్ధమైన కారణాల వల్ల సంభవించినదని చాలాకాలం తరువాత నిర్ణయించబడినది. అసాధారణమైన ఒక జీవితము ముగిసిపోయినది. మూడు శతాబ్దాల కాలక్రమములో ఒక స్వతంత్ర రాజ్యాన్ని మలచడానికై శక్తివంతమైన మొఘల్ సామ్రాజ్యంతో తలపడి భావి తరాలవారికి సర్వత్రా ఉత్తేజాన్ని ఇవ్వడంలో ఆయన కృతకృత్యుడయాడు.

రాజవంశంలో జన్మించి యోగినివంటి తన తల్లి ప్రభావంలో పెరిగిన శివాజీ అన్ని మతాలను గౌరవించి పూజించే విశాల దృక్పథాన్ని పెంపొందించుకొన్నాడు. ఆయనచే గౌరవింపబడిన మతగురువులలో బాబా యాకూబ్ ఒకరు. కుల మత ప్రసక్తిలేకుండా మత సంస్థలకు ఉదారంగా సహాయం చేసేవాడు. చరిత్రకారుడు ఖాఫీ ఖాన్ వ్రాతలను బట్టి ఏ దోపిడిలోనైనా ఖురాన్ ప్రతి ఆయనకు లభించినట్లయితే సగౌరవంగా దాని స్వంతదారునికి తిరిగి అప్పచెపుతుండేవాడు. అటువంటి గౌరవ మర్యాదలనే యుద్ధంలో బందీలుగా చిక్కిన మహిళల పిల్లల విషయంలో చూపిస్తుండేవాడు. అన్ని మతాల వ్యక్తులపట్ల గాఢమైన సానుభూతి, పటిష్ఠమైన మత స్వభావం నుంచి మాత్రమే ఏర్పడుతుంది. ఇది ఔరంగజేబ్ మత మౌఢ్యానికి వ్యతిరేకము అయిన విధానము.

బీజాపూర్‌తోనూ, మొఘల్‌లతోనూ శివాజీ పోరాటం హిందువులకు, ముస్లింలకు మధ్య యుద్ధంగా చిత్రించడం తప్పు. శివాజీప్రవేశించేటప్పటికే బీజాపూర్ మొఘల్‌లకు సామంతరాజ్యంగా రూపొందింది. అధికారాన్ని గౌరవమర్యాదలను కోల్పోసాగింది. దక్కనులు, అబిసీనియన్లు, పఠానుల వంటి ప్రాంతీయ శక్తులు అధికారం కోసం పోటీ పడసాగాయి. మొఘల్‌లు ఈ కల్లోలిత పరిస్థితులను తమకు అనుకూలంగా మలచుకోవడానికి బాహాటంగా ప్రయత్నిస్తున్నారు.

బీజాపూర్ ప్రభువులు మొఘల్‌లతో పొత్తుకలపడంతో కానీ లేక వారు స్వతంత్ర ప్రభువులుగా ఏర్పడుటవలనగానీ, శివాజీకి పితృవంశానుగతము, మాతృభూమి అయిన తన రాజ్యాన్ని పటిష్ఠంగా రూపొందించుకొని విస్తరింప చేసుకోవాలనే కోరిక సహజంగా కలిగింది.

సిద్దీ జౌహర్ కర్నూలులో స్వతంత్ర ప్రాంతాలను ఆక్రమించుకొనగలిగినప్పుడు, పఠాన్ బహలూల్ ఖాన్ బీజాపూర్ ప్రభుత్వాన్ని వ్యతిరేకించగలిగినప్పుడు తప్పనిసరిగా శివాజీ తన రాజ్యంలో నిలచి ప్రజలను నడిపించి స్వతంత్ర మరాఠా రాజ్యం కోసం పనిచేయడం న్యాయమయినది.

శివాజీ రాజ్యం తొలుతగా బీజాపూర్ నుంచి మలచబడినది. కొంకణ్ కొండచరియలు, మెట్టప్రాంతాలు ఆయన ముఖ్య పీఠభూములుగా రూపొందాయి. బీజాపూర్ తన దక్షిణ ప్రాంతాలను శివాజీకి పోగొట్టుకోవడంతో దీర్ఘకాలిక పోరాటం ముగిసిపోయింది.

షాజహాన్ అధికారం క్రిందనున్న మొఘల్‌లు దక్షిణాదిలో వారి అధికారంలో వున్న బీజాపూర్ గోల్కొండ తమ సామంత రాజ్యాలుగా ఉండేటట్లు ఎంచుకొన్నారు. ఈ రాష్ట్రాలను అప్పటి రాజప్రతినిధిగా వున్న ఔరంగజేబ్ విచ్ఛిన్నము చేయాలనే ఆకాంక్షతో నాశనము చేయతలచాడు. శివాజీ నాయకత్వంలోని మరాఠాలు ఆత్మ రక్షణకై పోరాటాన్ని కొనసాగించారు. మొఘల్‌లు సామ్రాజ్య విస్తరణకై పోరాడుతుండగా మరాఠాలు తమ మాతృదేశ భద్రత కొరకు పోరుసలిపారు. ఆ కారణము పోరాటానికి మరణానికి కూడా యోగ్యమయింది. వారు అసాధారణ ప్రతిభావంతుడైన వ్యక్తిచే ముందుకి నడిచారు.

శివాజీ నాయకత్వము వహించడానికి తగిన వ్యక్తిత్వము కలవాడు శ్వేతవర్ణపు ఛాయ సమమైన ఎత్తు, శక్తివంతమైన కండలు తిరిగిన శరీర దారుఢ్యము, మెరుపు వంటి చిరునవ్వుతో పుట్టుకతోనే చక్రవర్తిగా అతను భాసించేవాడు. ఆగ్రాలో 1666 లో ఆయనను చూసిన ఒక రాజపుత్రుడు, ఈ విధంగా వర్ణించాడు: "చిన్న విగ్రహము, వర్ణించవీలు లేని స్వచ్ఛమైన తెల్లని దేహఛాయప్రతి అంగుణం చక్రవర్తిగా కన్పట్టినాడు."

ప్రజలు ఆయన చుట్టూ గుమిగూడేవారు. ఆయన ప్రమాదంలోరో తన ప్రాణాల్ని సైతం పణంగా పెట్టాడు. ఒక నాయకుని వారు కనుగొన్నారు. అఫ్జల్‌ఖాన్‌తో ఆయన సమావేశము, ఆగ్రా సందర్శన, షయిస్తఖాన్‌పై రాత్రి పూట దాడి ఆయన నిర్భీతిని వెల్లడించే అసంఖ్యాకమైన సంఘటనలలో కొన్ని మాత్రమే. ఆయనసైనిక వ్యవస్థ ఆయనను ఒక క్రొత్త మార్గదర్శకుడిగా చూపిస్తుంది. సహియాద్రి కొండలను కవచంగా ఆయన పూర్తిగా ఉపయోగించుకొన్నాడు. సముద్రతీరాల్లోను పర్వతశ్రేణుల్లోను పెద్ద సంఖ్యలో కోటలను మరమ్మత్తులు చేసి అప్రమత్త రక్షణ సైన్యంతో పటిష్ఠం చేశాడు. ప్రతాప గడ్, జింజీ, సింధ్ దుర్గలోని సముద్రతీర దుర్గము ఇతరవాటిల్లో

ఆయన సైనిక సాంకేతిక నేర్పుకు గొప్ప నివాళి.

శివాజీ సైన్యము ఆయనచే రూపొందించబడి ఆయన చేతనే నడుపబడినది. కేవలము భూస్వామ్య శిస్తు ప్రోగుచేయుట కంటే ఎక్కువ ప్రాముఖ్యతలేని మొఘల్‌ల మన్సబ్‌దారీ విధానంలోని లోపాలు అతని సైన్యంలో లేవు. శివాజీ సైనిక విధానంలో ఆడంబరంగా, శోభాయమానంగా వుండి నిదానంగా పనిచేసే విధానం లేదు. అందులో సైనికులకు జీతాలు క్రమబద్ధంగా చెల్లింపబడేవి. సైన్యానికి సంబంధించిన అశ్వాలు రాజ్యానికి చెంది ఉండేవి. రౌతు దాని స్వంతదారు కాదు. సైనిక గమనము మిక్కిలి త్వరితగతిని సాగేది. శత్రువులకు మిక్కిలి దిగ్భ్రమ కలిగించే తీవ్రవేగము, విధానాలే శివాజీ తిరుగులేని విజయానికి కారణాలుగా ఫ్రెంచివారు అభిప్రాయపడ్డారు.

సైన్యంలో క్రమశిక్షణ చాలా కఠినంగా ఉండేది. పంట పొలాలను నాశనం చేయకుండా కఠినమైన ఆజ్ఞలు జారీ అయేవి. యుద్ధంలో కొల్లగొట్ట బడిన ధనరాసులు ప్రభుత్వ ధనాగారంలో జమచేయాలి. సైనిక శిబిరాలలో వారి కొరకు సరఫరా చేసిన ధాన్యాన్ని మాత్రమే వినియోగించుకోవాలి. సామాన్య పౌరులకు ఎలాంటి ఉపద్రవము కలిగించుటగాని, నిర్బంధపూర్వకంగా వారి వద్ద కొనుగోళ్ళు చేయప్రయత్నించటం గానీ తీవ్రంగా నిషేధింపబడింది. సైనిక సాధారణ ఉద్యోగాల్లో చేర్చుకొనేటప్పుడు తేడాలు, కులతత్వం, ప్రాంతీయతత్వం వుండేవి కాదు. సైన్యం ముఖ్యంగా రాజ్యపౌరులతో నిర్మించబడేది. హిందువులలో అన్ని కులాలవారు, సముద్రతీరప్రాంత ముస్లింలు నౌకా దళంలో ఉద్యోగాలు పొందగలిగారు. జాతీయ స్రవంతిలో భాగస్వామ్యులుగా ఉండ అంగీకరించే పక్షంలో మాత్రమే జంజీరాకు చెందిన సిద్ధీలకు మరాఠా నౌకాదళ ఆధిపత్యాన్ని ఇవ్వజూపాడు. అప్పటికి ఫోండా వీరుడు ఇబ్రహీమ్ దౌలత్ ఖాన్ అనే నౌకాదళాధిపతి శివాజీ భృత్యులుగా ఉన్న చాలా మంది ముస్లిం అధికారులలో కొందరు. శివాజీ ముఖ్యబలం ఆయిన అశ్వికదళంలోను, మరియు ఆయన దుర్గాలలోను ఉన్న నౌకాదళ విషయంలో మాత్రం, శివాజీ నూతన ప్రయోగం చేసినవాడుగా నిర్దిష్టంగా చెప్పవచ్చు. మొఘల్‌లు ఈ శాఖను దయనీయంగా నిర్లక్ష్యంగా చేశారు. ముఖ్యం అందుచేత మక్కాయాత్రికులను తీసుకువెళ్ళే వారి నౌకలు భద్రతకొరకై పోర్చుగీసు అధికార పత్రాల క్రింద ప్రయాణించేవి

మరాఠా నౌకాదళం 1657 లో స్థాపించిన గణ్యత శివాజీదే. సముద్ర పరిరక్షణకై సముద్రతీరంలో చాలా దుర్గాలు నిర్దేశించబడ్డాయి. పోర్చుగీసువారు, బ్రిటిషువారు, సిద్ధీలు మొఘల్‌లు ఉపయుక్తమైన రీతిలో పర్యవేక్షించబడేవారు.

శివాజీ గుఢాచారి విభాగం కూడా నిర్లక్ష్యం చేయతగినదికాదు. గూఢచారి శాఖ సమర్థవంతమైన విభాగంగా మరాఠా సైన్యం రూపొందింది.

## ఒక పవిత్ర సైనికుడు

ధైర్యసాహసాలుగల వ్యక్తిగా శివాజీ ఆయన కాలంలో ఒక అద్వితీయమైన సేనానాయకుడు. పరిమితమైన తన సాధన సంపత్తిని గురించి ఆయన జాగరూకుడై ఉండేవాడు. తన శ(త్రువులకున్న అమిత సాధన సంపత్తి విషయమై ఆయన కూడా అప్రవత్తుడై ఉండేవాడు. శత్రువుకున్న ప్రతి బలహీనతనుంచి ఆయన పూర్తి ప్రయోగనాలను సాధించాడు. వారి ప్రతివాదలినను గమనించి వారిని క్లిష్టమైన పరిస్థితులలో ఇరికించే చర్యలను సమర్థవంతంగారా నిర్వహించేవాడు. శత్రువుల మధ్య పరస్పర ద్వేషాన్ని కలిగించి, వారి సమాఖ్యలను విచ్ఛిన్నం చేసేవాడు.

ఆయన సైనిక విధానానికి 1670 లో నాసిక్ జిల్లాలోని బగ్లానాలో నిర్వహించిన దాడులు ఉదాహరణగా తీసుకోవచ్చు. తన భూభాగం లోని అహమ్మదనగర్ దక్షిణ ప్రాంతానికి కదలి వస్తున్న మొఘల్ సైన్యాలను ఎదుర్కొనేశక్తి లేనప్పుడు అందుకు సమానమైన ఎదురుదెబ్బగా నాసిక్ పడమర ప్రాంతాన్ని దెబ్బతీసి మొఘల్ సైన్యాలు ఆ దిశకు మరలించి తన మాతృదేశాన్ని రక్షించుకొన్నాడు. అంతేకాక, ఆయన నాసిక్ దుర్గాల ఆక్రమణ మరాఠాలను ఆప్రాంతం నుండి పూర్తిగా తుడిచివేయడానికి మొఘల్‌లకు 19 సంవత్సరాల కాలం వచ్చేట్లు చేసింది. తరువాతి సంవత్సరాలలో ప్రతికూల ఫలితాలతో కూడిన గొప్ప మార్పులను తెచ్చింది.

వివిద దక్కన్ భాగాలలో శివాజీ యొక్క విజయోపేతమైన దాడులు మొఘల్‌లను వారి సమతి ల్యస్థితి కోల్పోయేటట్లు చేసింది, యుద్ధంలోను, రాజ నీతిలోనూ., మొఘల్‌లో సంఘర్షణలో భాగంగా భారతదేశంలో ఇతర ప్రాంతాలను చేర్చేందుకై తన ఉద్యమాన్ని విస్తరింపచేశాడు. బుందేల్‌ఖండ్ వీరుడు ఛత్రసాల్ మొఘల్‌లకు వ్యతిరేకంగా తన మాతృదేశం నుంచి పోరాటం సలిపేందుకు ఆయనచే ప్రేరితుడయాడు. ఆయన గౌరవించే చాలామంది రాజపుత్రులతో శివాజీ సత్సంబధాలను కలిగి వున్నాడు.

ఔరంగజేబ్ వ్యతిరేక మతమౌఢ్యము దానికి ఫలితమైన అసంతృప్తి, శివాజీ తన పోరాటాన్ని విశ్వాసంతో విస్తృతం చేయడానికి తొడ్పడినప్పటికీ ఆయన మత పరమైన విషయాలను ఎప్పుడు తన కనువుగా ఉపయోగించుకునే ప్రయత్నం చేయలేదు. మొఘల్ సామ్రాజ్యానికి చాలినన్ని బలహీనతలున్నాయి. మత మౌఢ్యముతోను

తురుష్క జాతి అహంకారము తోను, భారతీయుల పట్ల ఉదాసీన వైఖరితోను వున్న చక్రవర్తి ఇరాను మధ్య ఆసియానుంచి వచ్చిన వ్యక్తులతో కూడిన మొఘల్‌ల అధికారవర్గము మొదలైన వాటి వలన సామ్రాజ్య నైతిక పీఠమే ప్రశ్నించదగినదిగా తయారయింది. మరాఠాలు, బుందేలాలు, రాజపుత్రులు ఆకారణం వల్లనే వాయవ్య సరిహద్దులోని పఠాన్లువంటి స్వదేశీశక్తులు వారి విస్తరణను సరిగా అవరోధించగలిగారు. అది ఒక రాజకీయ పోరాటము. బీజాపూర్‌తోను గోల్కొండతోను శివాజీ సంబంధాలు ఆయన సంకుచిత మత వైఖరిని అధిగమించేటట్లు తెలియచేస్తాయి.

ధర్మము తన రాజ్యంలో నెలకొనాలని శివాజీ కోరాడు. ధర్మము అనే మాటకు సన్మార్గము అని అర్థము స్ఫురిస్తుంది. తన కార్యక్రమములో దయనీయుడైన ఈశ్వరుడు మార్గదర్శకుడుగా వున్నాడని ఆయిన గాఢవిశ్వాసము. అన్ని మత విశ్వాసాల పట్ల సహనము గౌరవములతో శివాజీ రాజ్యము ఆధునిక లౌకిక రాజ్య విధానానికి సరిపోలుతుంది.

రాజ్యానికి అధిపతి రాజు. ఆయనకు ఎనిమిదిమంది మంత్రులతో కూడిన మంత్రి మండలి సహకారిగా ఉండేది. మంత్రులు వారి శాఖలతో పాటు నిర్దేశించబడిన రాష్ట్రాల నిర్వహణను కూడా చేసేవారు. సంప్రదాయ చట్టం అమలులో ఉన్నది. న్యాయ నిర్వహణలో ఎవరిజోక్యం ఉండేదికాదు.

శివాజీ తన సామ్రాజ్యాన్ని సంక్షేమ రాజ్యంగా రూపొందించేందుకు కృషిచేశాడు. రాజ్యం వ్యవసాయదారులకు సన్నిహితంగా ఉండేది. శివాజీ భూములను అన్యాక్రాంతము చేయడం తీవ్రంగా వ్యతిరేకించాడు. సేవలకు ప్రతిఫలం ధనరూపంలో చెల్లించటం ప్రోత్సహించబడింది. వంశపారంపర్యంగా పన్ను వసూలు చేసే అధికారులైన దేశ్‌ముఖ్‌ల, దేశ్‌పాండేల ప్రాముఖ్యం తగ్గించబడింది. వారు ప్రభుత్వ, అధికారుల అజమాయిషీలో వుంచబడ్డాయి.

వ్యవసాయ దారులకు కూడా సౌకర్యములు ఏర్పడ్డాయి. పంటభూములుసాగు క్రిందకు తీసుకొనిరాబడ్డాయి. అవి కొలువబడ్డాయి. వాటిపై సక్రమమైన పన్ను విధించబడింది. అక్రమమైన పన్నులు తొలగించబడ్డాయి. సైన్యములోను, ఇతర రంగములలోను హెచ్చుగా, యువకులకు ఉద్యోగావకాశం కల్పించటం నిస్సందేహంగా అన్ని వర్గాలవారికి లభించిన ఆశీర్వచనము.

వర్తక, వ్యాపారములుకూడా నిర్లక్ష్యం చేయబడలేదు. నియమబద్ధమైన సూత్రాలు విధించబడ్డాయి. ఒకచోట స్థిరనివాసమేర్పరచుకొని వస్తువుల రవాణా అభివృద్ధి పరచేందుకు వర్తకులు ప్రోత్సహించబడ్డారు.

సంస్కృతి, పవిత్రత, పాండిత్యము గల వ్యక్తులు పోషించబడ్డారు. యోగుల యెడ శివాజీ భక్తి ప్రపత్తులు తెలిసినదే. తరుచు ఆయన సాంగత్యంలో గడిపేవాడు. అట్టి చాలా మంది మహనీయులలో తుకారామ్, రామదాసు, మౌనిబాబా, బాబా యాకూబ్ కొందరు. ఆయన పరిపాలనలో సాహిత్యం కూడా ఉదారంగా పోషించబడింది. పరమానంద్, జయరామ్, గంగాబట్టు వంటి సంస్కృత కవులు మరియు హిందీ కవి భూషణ్ ఆయనచే గౌరవింపబడ్డారు.

ఆయన "రాజ్య వ్యవహారకోశ్" అనే పదకోశమును వ్రాయించాడు. దక్కను ఉర్దూ భాషలో ఆనాడు వాడుకలో ఉన్న పరిపాలనకు సంబంధించిన పదములకు సంస్కృత పర్యాయపదములు దీనిలో ఇవ్వడమైనది. ఇది 1679 లో పొందుపరచబడిన ప్రథమ ఏకైక ఉర్దూ సంస్కృత పదకోశముగా చెప్పవచ్చును.

Lasertypeset at UNIQUE Graphics, 2/3 Old Rajinder Nagar, New Delhi - 60
and printed at Bosco School of Printing, Okhla Road, New Delhi - 21